# భారతి

మాసపత్రిక



సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్



ఆగస్టు 1965



సంపుటము 42 : : సంచిక 8

విడిపత్రిక వెల ఒక రూపాయి

# ఆంధ్రపత్రిక

# స్వర్ణోత్సవ సంచిక

సంవత్సరాది సంచికల ప్రచురణ తెలుగు సాహిత్యంలో ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచికతోనే ప్రారంభమైంది. 1910 నుంచి ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక వార, దిన, మాసపత్రికలతోపాటు అవిచ్ఛిన్నంగా ప్రచురితమవుతున్నది.

ఆంధ్రపత్రిక విశ్వావసు సంవత్సరాది సంచిక స్వర్ణోత్సవ సంచికగా ఈ వినాయక చవితికి వెలువడనుండడం మీ కందరకీ తెలిసిన విషయమే.

ఈ స్వర్ణోత్సవ సంచిక—

- గడిచిన అర్ధ శతాబ్ది తెలుగు సాహిత్య రీతులకు మచ్చుతునకలన దగిన డెబ్బయి రచనలతో,
- వివిధ రంగాలలో వాసిగాంచిన పెద్దల డెబ్బయి ఛాయా చిత్రాలతో,
- సుప్రసిద్ధ తెలుగు చిత్రకారులు చిత్రించిన నాలుగు త్రివర్ణ చిత్రాలతో,
- దాదాపు 40 వ్యంగ్య చిత్రాలతో

—సర్వాంగ సుందరంగా ఉంటుంది.

అర్ధ శతాబ్ది తెలుగు జాతి వికాసానికి, తెలుగు సంస్కృతి స్వరూపానికి, తెలుగు సాహిత్య పరిణామానికి ఈ స్వర్ణోత్సవ సంచిక మణిముకురమని వేరుగ చెప్పనక్కరలేదు.

ఒక్కమాటలో, అర్ధశతాబ్ది ఆంధ్ర స్వరూపం స్వర్ణోత్సవ సంచిక.

## వెల : 5 రూపాయలు

రిజిస్టర్ పోస్టులో పంపడానికి అదనంగా రు. 2-00.

# విషయానుక్రమణిక

## ఆగస్టు 1965

# అపశ్రుతి

## శ్రీ బసిరెడ్డి ఈశ్వరరెడ్డి

స్వర్గానికి నిచ్చెన వేశాడు శాస్త్రజ్ఞుడు
రంభా పరిరంభణాయత్తుడు సోమయాజి
మురికిబొంతకు మాసిక వేశాడు చెంగడు
శశాంకుని ఉపరితలంలో చిక్కుకున్నది రాకెట్టు
సంధించిన బ్రహ్మాస్త్రాన్ని వెనుదిప్పలేక
ఇకిలిస్తున్నా డశ్వత్థామ.

నీలాటిరేవులో అపవాదుల కార్ఖానా
డెఫిసిట్టుకు సర్‌ప్లస్ రంగు వేస్తున్నాడు విత్తమంత్రి
కాగితాల్లో పుట్టి, పెరిగి, గతిస్తున్నది ప్రణాళిక
ఉపనిషత్పారాయణ చేస్తున్నాడు బ్రహ్మచారి
హోమధూమ పునీతమైనది పరిసరం
భంగుదమ్ములో అరుణారుణమైనవి సన్యాసి నేత్రాలు
చితికిపోయినదానికి అతుకు వేస్తున్నాడు గృహస్థు
చేయబోవు అప్పులతో బడ్జెట్ లోని గండ్లు పూడుస్తున్నాడు.

తారకలమధ్య కోణం కొలుస్తున్నాడు పైలట్
నిస్తంత్రీవార్త లందిస్తున్నవి కనుదామరలు
వేడిమించిన యింజన్ ఆగిపోతున్నది
భగ్నప్రేమికుడు దూకబోతున్నాడు గుంటలో
ప్రబంధనాయక విరహజ్వరం 103 డిగ్రీలు దాటింది
చందనం పూసుకొంటూ చంద్రోపాలంభన చేస్తున్నది నాయిక
రసపిపాసి తాత్పర్య దీపికలలో బడి నలిగిపోయాడు
పద్దెనిమిది వర్ణనలు చేసి మహాకవియైనా డప్పన్న శాస్త్రి
పదిమార్లు పల్లించిన అబద్ధం నిజమౌతుందని మావ్ సేటుంగ్ ఉవాచ.

కవిగాని కవికి సారస్వత బహుమానం
క్రతువులో రక్తం ఏరులై ప్రవహించింది
సశరీర దేవతలు దీవించారు యాజకులను
వైదికార్యుడు ఉద్భవించాడు జర్మనీలో
డిటెక్టివ్‌ల డికాక్షన్‌తో చేదువారింది సాహిత్యం
స్వాంతః సుఖానికి రాస్తున్నా డుత్తముడు
ప్రచారానికి రాస్తున్నా డధముడు.

విరియగాచినది వెన్నెల ఎడారిలో
భోషాణంలో మూల్గుతున్నవి ధనరాసులు
అనాఘ్రాత బాలవిధవ ముకుళించి పోయినది
చీకట్లోని ఆవేశం వెలుగులో వెలవెలాపోయింది.

దేశాన్ని దోచా రగస్త్యభ్రాతలు
ఉద్ధతులమధ్యలో ఇరుక్కున్నాడు నిరుపేద
అస్తినాస్తి విచికిత్సాహేతువు ప్రబంధ సుందరి నడుం
అడవిమనిషి కైవసమయ్యెను అణుబాంబులు
శాంతి కపోతంపై గురిపెట్టెను వ్యాధుడు
దయ్యాలు చేసెను వేదఘోషలు
గార్దభపు ముసుగులో దాగియుండెను శార్దూలం
మదగజాన్ని ఎదుర్కొన్నది పిపీలికం
సరస్వతిని తరిమివేస్తున్నది లక్ష్మి.

జలతారు ముసుగులో ఘనీభవించెను వాంఛలు
అంతరాళపు చీకట్లో అవ్యక్తుడై దాగెను సైతాను
ఆర్థిక పోరాటంలో చిత్తుగా వీగిపోయాడు కవివర్యుడు
అగ్రాసనంలో తిష్ఠ వేశాడు శల్యసారథి
ఆనంద విజయుడు కాళిదాసు
విషాదంతో వీగిపోయాడు భవభూతి
అభ్యుదయ పథంలో అడ్డునిలిచె సైంధవుడు
ఊరికొక బకాసురుడు వెలిశాడు
జీవనపు ఎడారిలో అరుదయ్యెను ఒయాసిస్సులు.

# విద్యాసంస్థలలో వ్యావహారిక భాష

శ్రీ జి. వి. కృష్ణారావు

విద్యాసంస్థలలో వ్యావహారికభాష అన్న ఈ వ్యాసములోని ముఖ్యాంశాలు మూడు. ఒకటి: వ్యావహారిక భాషను మనం ఎందుకు స్వీకరించాము ? రెండు : ఈ ఉద్యమం ప్రారంభించిన తరువాత మనం ఏమి సాధించాము ? అంటే ఇప్పటి వ్యావహారిక భాషా స్థితిగతులు ఎలా ఉన్నాయి ? మూడు : మన లక్ష్యం ఏమిటి ? దాన్ని ఎలా సాధించగలము ?

వ్యావహారిక భాషోద్యమ నాయకు లెవరో మనకు తెలిసిందే. వారి చరిత్ర, కావించిన కృషి ఇప్పుడు ప్రత్యేకంగా పేర్కొనవలసిన పనిలేదు. కాని వారి కృషికి మన కృతజ్ఞత తెలియజేయక తప్పదు. వారికి నమోవాకాలు.

వ్యావహారిక భాషోద్యమం ఏదో గాలి పాటుగా వచ్చింది కాదు. కొన్ని సూత్రాలను మున్నిడుకొని ప్రత్యేక లక్ష్యాలను సాధించటం కోసం బయలుదేరింది. ఆ సూత్రాల లక్ష్యాలు తిరిగి సంస్మరించటం అవసరం.

భాష అనేది లోకంవల్ల సిద్ధిస్తుంది కాని కేవలం కొలదిమంది వ్యక్తులవల్ల సృష్టి పొందేది కాదు అని ప్రాచీనులు కూడ అంగీకరించారు. అయితే ఈ లోకం మారదనీ, నిత్యంగా ఉంటుందనీ వారు భావించారు. అందుకనే ''సిద్ధిర్లోకా ద్ద్రుశ్యా లోకోఽనన్యాదృశశ్చ, నిత్యశ్చ'' అని అన్నారు. కాని విజ్ఞాన శాస్త్రయుగంలో పుట్టి పెరుగుతున్న మనము లోకమూ లోకంవల్ల సిద్ధిస్తున్న భాష మారవంటే ఒప్పుకోము. లోకం మారుతున్నట్లే భాష కూడ మారుతున్నదని మన విశ్వాసం. ఇది సహేతుకమే. దీనికి శబ్దజాలం నుంచి, (ఒక కొంత) పలుకుబడినుంచి దృష్టాంతాలు చూపగలము.

భాష మారుతుంది కనుక శబ్దజాలంలో కూడ మార్పు ఉంటుంది. కొన్ని మాటలు క్రొత్త అర్థాలు, క్రొత్త సంవేదనలు సంతరిస్తాయి. కొన్ని వ్యవహారంలోనుంచి జారిపోతాయి. కొన్ని క్రొత్త అవతారాలు తాలుస్తాయి. కొన్ని క్రొత్త మాటలు చేరుతాయి. కాలం గడచినకొలది యీ మార్పులు చేర్పులు కూర్పులు మెండవుతవి గనుక ఒక యుగంలో, ఒక శతాబ్దంలో ఉన్నట్లుగా భాష మరొక యుగంలో మరొక శతాబ్దంలో ఉండదు. ఎన్ని వ్యాకరణాలున్నా, ఎంత నిష్ఠతో అధ్యయనం సాగించినా ఉత్తరకాలమందలి పండితులైనా పూర్వకాలపు భాష మాట్లాడటం కష్టం. విమానం ఎక్కి కోరుకొన్న దేశానికి పోవచ్చు. కాని యిప్పటి యుగంవారు ప్రాచీన యుగంలోకి పోవాలంటే ఏ వాహనం ఎక్కేటట్లు ? మీలోని చమత్కారులు టైం మెషిన్ ఉన్నదనవచ్చు. మీ సహృదయతకు నమస్సులు. ''అలా కాదు, శబ్దానుశాసనాలు సమర్థమైనవి ఉంటే అది సాధ్యమే. పాణినీయాదులను బట్టి మనం సంస్కృతం నేర్చుకోవటం లేదా? వ్రాయటం లేదా?'' అని కొందరన వచ్చును. నేర్చుకొంటున్నమాట వాస్తవమే కాని ఎందరు నేర్చుకుంటున్నారు? ఎందరు సజీవ భాష వ్రాయగలుగుతున్నారు ?

ఈ ప్రశ్నలు అలా ఉంచుదాము. నిత్యం ఒక భాష వింటూ మాటాడుతూ దీనికి (మాండలిక ప్రాయమైన) సన్నిహితంగా ఉన్న మరొక భాష పారపొచ్చాలు పోకుండా నేర్చుకుని వ్రాయాలన్నా, మాటాడాలన్నా ఎంత కష్టమో వూహించండి! శ్రమంతా నిర్దుష్ట భాషా సముపార్జనకే వినియోగించవలసి వస్తుంది. భావనకూ ఆలోచనకూ అంతగా ప్రాముఖ్యం యివ్వలేము.

ఇంతకూ చెప్పదలచిన దేమంటే ఒకయుగంలోని భాష మరొక యుగంవారికి సుసాధంకాదు. కనుక తమనాటి భాషను ఆమోదిస్తే నోటిమాటకు చేతివ్రాతకూ సాన్నిహిత్యం చేకూరుతుంది. ఈ సాన్నిహిత్యంవల్ల ప్రజ లందరకూ వ్రాతకోతలు అలవడుతాయి. చదువుసంధ్యలు అబ్బుతాయి. వ్యావహారిక ప్రయోజనం సిద్ధిస్తుంది. ఇతర దేశాలవారి వలెనే మనం పురోగమిస్తాము.

భాష మారుతుంది అని ఎప్పుడైతే ఆమోదించామో అప్పుడే పార్యంతిక అనుశాసనం అసంభవమని అంగీకరించినట్లే. నాటి వ్యావహారిక భాషను ప్రమాణంగా స్వీకరించనప్పుడు రేపటి తరంవారు ఇలా వ్రాయాలని అనుశాసించటానికి మనకేమి అధికారం ఉన్నది? ఒకవేళ తెలివితక్కువతనంతో అనుశాసించామే పొండి. రేపటి తరమువారు దానిని మన్నించాలని ఎక్కడుంది? పైగా మీపూర్వులను మీ రెంతవరకు మన్నించారంటే సమాధానం ఏమి చెప్పేటట్లు? కనుక పార్యంతిక భాషను శాసనం తలపెట్టలేము.

వ్యావహారికభాష అనగానే మరికొన్ని చిక్కులున్నవి. తెలుగునాటి నలుమూలల భాష ఒకే రీతిగా లేదు. రాయలసీమలో తెలుగు తీరుతెన్నులు ఒకవిధంగా, దక్షిణపు కోస్తా జిల్లాలలో మరొకవిధంగా ఉత్తరపు కోస్తా జిల్లాలలో వేరొకవిధంగా, తెలంగాణ ప్రాంతంలో మరొకవిధంగా ఉన్నాయి. అంతే కాదు, జిల్లా జిల్లాకు, వర్ణ వర్ణానికీ, వృత్తి వృత్తికీ ఎన్నో వ్యత్యాసాలు ఉన్నవి. ఇన్ని విధాలుగా ఉన్న తెలుగు పలుకుబళ్లలో దేనిని ప్రమాణంగా స్వీకరించాలి అన్న ప్రశ్న బయలుదేరింది. ఆనాటి గ్రాంథికవాదులు వ్యావహారికవాదులను నిగ్గదీసి అడిగారు. దానికి వ్యావహారికవాదులు సమాధానం చెప్పారు. "మేము కోరుతున్నది వ్యావహారిక భాష కాని గ్రామ్యం కాదు. శిష్టులు వ్యవహరిస్తున్న భాషనే మేము కోరుతున్నాము. వీరి భాషలో అసభ్యత అనే అనౌచిత్యం ఉండదు. పైగా సామాన్య ప్రజానీకానికి అందుబాటులో ఉంటుంది. పిల్లలు పెద్దవాళ్ల నుంచి మాతృభాషను తేలికగా నేర్చుకొంటున్నట్లే ప్రజాసామాన్యం శిష్ట వ్యావహారికాన్ని నేర్చుకొంటుంది. పైగా రాకపోకలు పెరగడంవల్ల వివిధ ప్రాంతాలు సన్నిహితాలై భాషా వ్యత్యాసాలు తగ్గిపోతవి. విశేషించి వ్యావహారిక రచనలవల్ల, పత్రికల రచనలవల్ల, రేడియో ప్రసారంవల్ల ప్రామాణికమైన వ్యావహారికభాష అచిరకాలంలోనే నెలకొంటుంది. మీదుమిక్కిలి వివిధ ప్రాంతాలలోని పలుకుబళ్లను సంగ్రహించి తెలుగు అపూర్వ వికాసం పొందుతుంది," అని నాడే వ్యావహారికభాషోద్యమనాయకులు సమాధానం చెప్పారు.

ఈ వాదం యుక్తి యుక్తంగా కనిపించింది. ఉత్సాహవంతులు వ్యావహారిక భాషవైపు మొగ్గారు. తరువాత పత్రికలు కూడ చేయూత యిచ్చాయి. క్రమంగా వ్యావహారిక భాషలో రచనలు సాగించేవారి సంఖ్య విపరీతంగా పెరిగిపోయింది. గ్రాంథిక భాష వ్రాసేవారు చాలా తగ్గిపోయారు. కాకపోతే పాఠ్య పుస్తకాలు మాత్రం ఈనాటికీ గ్రాంథికాలుగానే ఉన్నవి.

ఇంక నా వ్యాసంలోని రెండో అంశం ఇప్పటి స్థితి. వ్యావహారిక భాషవల్ల రచనలలో నేమి, పాఠకుల అభిరుచులలో నేమి, విమర్శకులలో నేమి, రచయితలలో నేమి, విద్యార్థులలో నేమి మార్పులు వచ్చాయా? వచ్చినవని అందరూ అంగీకరిస్తారు. కాని అవి మంచివా కావా అంటే అభిప్రాయభేదాలు పొడసూపక తప్పదు. ఇక్కడ విభిన్న సంస్కారవంతులు సమావేశమయ్యారు. అయినా వీలుపడినంత నిర్లిప్తంగా ఈ మార్పులను సింహావలోకనం చేసుకోవటం అవసరం.

వ్యావహారికభాషతో వచ్చిన మార్పులలో మొట్టమొదట ఎన్నదగింది మారుమూల పదాలపై మోజుతగ్గటం. ఈనాటికీ పుచ్చిపోయిన జొన్నలతో సంకటి కాచుకొనేవారు ఉండవచ్చును. అదే పరమాన్నంగా ఆరగిస్తూ ఉండవచ్చును. అది వేరే విషయం. (2) శబ్ద సాధుత్వాసాధుత్వ వాద ప్రతివాద సిద్ధాంతాలు ఎక్కడో కాని వినిపించవు. (3) అరానుస్వార

# విద్యాసంస్థలలో వ్యావహారిక భాష

శకటరేఫల ప్రాముఖ్యం నశించిందని చెప్పాలి. (4) వచన రచనలలో సమాస జటిలత చాలవరకు తగ్గిపోయింది. (5) అయితే అచ్చు తప్పులు కోకొల్లలుగా పెరిగిపోతున్నవి. అవి లేని పుస్తకాలు అరుదంటే అతిశయోక్తి కాదు.

భాషతోపాటే విషయంలో గూడ విశేషమైన మార్పు వచ్చింది. దివ్యపురుషుల వృత్తాంతాలు, ధీరోదాత్త రాజపుంగవుల చరిత్రలు తమ ఆకర్షణను కోల్పోయాయి. నిత్యజీవితంలో గోచరించే సన్నివేశాల, వ్యక్తుల, సమస్యలు, మానసిక తత్త్వాలు, సంఘర్షణలు ప్రాముఖ్యం వహించాయి. ఈ దృష్టితో చూచినప్పుడు ఆధునిక ఆంధ్ర సాహిత్యంలో ఒక క్రొత్తదనం, ఒక నిండుదనం, ఒక నవచైతన్యం కొట్టవచ్చినట్లు కనిపిస్తున్నవి. వస్తూర్జస్వితలో, చిత్రణ విధానంలో ఒక విచ్ఛిత్తి కనిపిస్తుంది. పురాణేతిహాసాలను కథాపూర్వోదయాన్ని విడిచిపెడితే, తెలుగులో కథాపుష్టి, పాత్రల వ్యక్తిత్వం ఏ ప్రాచీన రచనలో గోచరిస్తవంటారు? ఈ గుణాలు ఇప్పటి వ్యావహారిక రచనలలో ఉన్నవా?

వ్యావహారిక భాషోద్యమ ప్రథమ దశలో వెలువడిన కన్యాశుల్కాన్నే తీసుకోవచ్చును. 19 శతాబ్దంలో సామాన్య బ్రాహ్మణ కుటుంబాలలో, వాటిని ఆశ్రయించుకొని బ్రతికే కూలినాలి జనంలో ఉన్న స్థితిగతులు, వారి సమస్యలు కన్నులకు కట్టినట్లు కనిపిస్తాయి. గిరీశం, రామప్ప పంతులు, మధురవాణి, అగ్నిహోత్రావధానులు, కరటకశాస్త్రి, లుబ్ధావధానులు మున్నైనవారు ఈనాటికీ మన ముందు తిరుగుతున్నట్లే ఉంటారు. ఇలాంటి జీవితాన్ని, పాత్రలను అంతకుముందు ఏ తెలుగు రచయిత చూపించాడు? చూపించటానికి ఎవరైనా యత్నించి ఉన్నా గ్రాంథికభాష కిది సాధ్యపడేదా? ఇలా అంటున్నప్పుడు కన్యాశుల్కం, అభిజ్ఞానశాకుంతలం వంటి సర్వాంగసుందరమైన నాటకమని నా తాత్పర్యంకాదు. కథలో, అంక నిర్మాణంలో, పాత్ర నిర్వహణలో పెక్కు లోటుపాటు లుండవచ్చును. అది వేరే విషయం. కాని కన్యాశుల్కం ద్వారా మనం క్రొంగ్రొత్తదగు సాహిత్యలోకంలో ప్రవేశిస్తాము.

బండి పెడదారి పడుతున్నట్లుంది. మనకు ప్రధాన విషయం వ్యావహారిక భాష కదా! కన్యాశుల్కంలోని భాష స్వచ్ఛమైన వ్యావహారికం. కలితీ లేని వాడుక భాష. సర్వ సాధారణంగా గమనించక వదలుతున్న విశేషం ఒకటి ఉంది. విజయనగర ప్రాంతపు మాటలు ఇతర దూర ప్రాంతాలవారికి బొత్తిగా తెలియనివి కావు. కాని వాని భావాలే (Feeling tones) చటుక్కున బోధపడవు. ఉదాహరణకు ఒక సంఘటన చెబుతాను. రిక్షావాడు ఎదురుదెబ్బ తగిలి బొక్క బోర్లగా పడ్డాడు. వెంటనే ప్రక్కనున్న ఆవిడ "నా కొడుక్కి ఎంత దెబ్బ తగిలింది!" అన్నది. దెబ్బ తగిలింది అని అన్నదో మరొక మాట అన్నదో సరిగా జ్ఞప్తికి రావటంలేదు. నేను వెంటనే విస్తుపోయాను. ఆమె తిడుతున్నట్లుంది. తిట్టవలసిన పనిలేదే అని విభ్రాంతి పొందాను. క్రమక్రమంగా సందర్భాన్నిపట్టి అర్థం చేసుకొన్నాను. "బిడ్డకు ఎంత దెబ్బ తగిలింది" అని ఆమె సానుభూతి ప్రకటిస్తూ ఉంది. ఇలాంటి చిక్కులు అపోహలు కలుగని తీరున గురజాడ అప్పారావుగారు విజయనగర ప్రాంతీయ వ్యావహారికాన్ని వాడారు. అంటే తెలుగువా రందరికీ సుగ్రాహమైన ప్రాంతీయభాషను వాడి దానికి సాధారణీకృతి కల్పించారు. లేదా ప్రాంతీయ భాషలోని సర్వ సాధారణాంశాన్ని సేకరించారు. ఈ జాగరూకత వ్యావహారికవాదియైన ప్రతి రచయితకు ఎంతైనా అవసరం.

సంసారం వెనుకనున్న బ్రహ్మపదార్థాన్ని తత్త్వదృష్టి చూపుతున్నట్లు సామాన్య హృదయాంతరాంతరాల్లో ఉన్న ఉదాత్తతను మాలపల్లి ప్రదర్శిస్తున్నది. రామదాసు, జ్యోతి, సంగదాసు మున్నయినవారు మనలను విస్మితులను చేస్తారు. అయితే మాలపల్లిలోని భాష సిసలైన వ్యావహారికమంటే నేను ఒప్పుకోలేను. అద్భుతమైన భావన, వర్ణన లోకధర్మం ఉండవచ్చును. ఆ ప్రాంతంవారు వాడే పదజాలాన్ని రచయిత పుష్కలంగా వాడి ఉండవచ్చును. కాని, ఆ పదాల కూర్పు, రకం పలుకుబడి వ్యావహారికాలు కావు. కృతకాలు. అన్నివిధాల శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణగారు పెద్దలు, పూజ్యులు. అయినా ఈమాట యదార్థమని నా నమ్మిక.

ఇలాగే సాంసారిక ఇతివృత్తాన్ని తీసుకొని వ్యావహారికభాషలో రస ముప్పొంగించినవారు శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు. ఆయన కత్తికి రెండువైపులా పదునుంది. వీరు గ్రాంథికం వ్రాసినా, వ్యావహారికం

వ్రాసినా నవనవోన్మేషం తొణికిసలాడుతూంటుంది. ఆయన గద్య పద్యాన్ని పరిహసిస్తుంది. పద్యానికివలెనే గద్యానికి కూడా ఒక తూగు, ఒక ఒయ్యారం, ఒక హొయలు ఉంటుందని గ్రహించి తెలుగులో నిరూపించినవారు ఇద్దరే కనిపిస్తున్నారు. ఒకరు చిన్నయ సూరి మరొకరు శివరామశాస్త్రిగారు. (నా వరకు చెప్పవలసివస్తే శివరామశాస్త్రిగారి రచనలందే గురు భావం మెండు.) అలాగే విశాఖ ప్రాంతీయ వ్యావహారికంలో కథలందు వచ్చి కవిత్వాన్ని ఒలికించిన వారు రాచకొండ విశ్వనాథ శాస్త్రిగారు. ఇది భాషాదృష్టితో అంటున్నమాట. సాహిత్యదృష్టితో చెప్పవలసివస్తే ప్రపంచ ఉత్తమ కథలలో పరిగణింప దగిన రచనలు పెక్కు లున్నాయి. పెక్కు రచయితలు తెలుగు కథకు ఆ స్థాయి సమకూర్చారు.

ఇంతకూ పిండితార్థ మేమంటే వ్యావహారిక భాషవల్ల ప్రజా సామాన్య జీవితం—ఆశయాలు, లక్ష్యాలు, కష్టాలు, సుఖాలు, ఆందోళనలు, ఆవేశాలు ప్రతిబింబితాలై తెలుగు సాహిత్యం నూతన చైతన్యం పొందినమాట వాస్తవం. నూతన కావ్య భేదాలు అంటే, నవల, కథ, నాటకం, ఏకాంకిక, గేయం బయలుదేరాయి. ఈ విషయాన్ని త్రోసి పుచ్చలేము. కాని ఆలోచించవలసిన విషయం ఒకటే. ఇప్పుడు వెలువడుతున్న రచనలలో నూటికి తొంబదింట కర్త, కర్మ, క్రియ ఉన్న వాక్యం కనిపిస్తున్నదా ? ఆ పలుకుబడి, ఆ కారకం ఏ ప్రజలు మాటాడు తున్నారు. ప్రజలుకాదు శిష్టులందాము. ఏ శిష్టులు వాడు తున్నారు ? అయితే ఈ సందర్భాన ఒకమాట అడుగ వచ్చును. ఈ భాష మీకు అర్థమవుతున్నదా లేదా అని? వాదం కోసం అర్థమవుతున్నదనే ఒప్పుకో వాలి. ఎందుకంటే తనకు అర్థంకాని విషయాలను గూర్చి చర్చించే అధికారం ఎవరికీ ఉండదు.

పసిపిల్లల తొక్కు పలుకులు అస్పష్ట ఉచ్చారణాలైనా, ఈషద్బోధాలైనా విని ఆనందిస్తున్న మాట వాస్తవం. అయితే ఆ భాష సమగ్రమని కాని, సమర్థమని కాని, మనం భావించటంలేదు. పిల్లలుకూడా అలా అనుకొనక తమ వాచకాన్ని చక్కదిద్దుకొంటు న్నారు. ఇప్పటి వ్యావహారిక భాషా విషయంలో అలాంటిది కనబడటంలేదు. అన్య భాషాకృతులను చదివి అన్యభాషలో ఆలోచించి తెలుగులో వ్రాయటం సామన్యమై పోయింది. అందువల్ల అన్యభాషలోని మాటలు పలుకుబళ్లు వాక్య విన్యాసం అవ్యాహతంగా దొర్లిపోతున్నవి. ప్రాచీనులు సంస్కృతం చదువుకొని తెలుగున వ్రాసినప్పుడు "వానిం బలికెను", "గ్రామమును గూర్చి పోయెను", "లోకములను దిరిగెను", "రాముని కొఱకుం గన్యనిచ్చెను". "ఏ రాముడు లోకకంటకుని రావణుని సంహరించెనో ఆ రాముని వందించుము" అన్నట్టి ప్రయోగాలు చేశారు. వ్యాకర్తలు వాటిని ప్రమాణీకరించారు. అంతమాత్రాన అవి తెలుగు పలుకుబళ్లని అనలేము. ఆత్మీయమై పోషకమైన సంస్కృతంవల్లనే ఇట్టి చిక్కులు వస్తున్నప్పుడు కేవలం పరభాషలో ఆలోచించి తెలుగులో వ్రాసే టప్పుడు ఇంకా ఎన్ని చిక్కులు వస్తవో వూహించు కోవచ్చు. అంతమాత్రాన పరభాషలు చదవగూడదనీ, క్రొత్త భావాలు, శాస్త్రార్థాలు గ్రహించరాదనీ నా తాత్పర్యం కాదు. తెలుగు నుడికారం జారపోనీవి రచన సాగించవలసి వస్తుంది. ఈ సందర్భంలో మరి రెండంశాలు పేర్కొనటం ముఖ్య మనుకొంటాను. శ్రమ జీవుల జీవితం చిత్రించే నెపంతో అతి వికృత శబ్దజాలం ప్రయోగిస్తున్నారు. శ్రమజీవులమాటలు విద్యావంతుల మనుకొనేవారికి ఎబ్బెట్టుగా కనిపించ వచ్చునేమో కాని వారి కారకంలో వాక్యంలో సిసలైన తెలుగుతనం ఉంటుంది. దానిని గ్రహించక వారు ఉచ్చరించే కొన్ని మాటలను పట్టుకొని వారి భాష సర్వం మరొక తీరుగా ఉంటుందని వూహించుకొని వ్రాస్తున్నారు. ఇది భాషకే కాదు, ఆ శ్రమజీవులపట్ల కూడ మహాపచారం.

ఇంక రెండవ అంశం రచయితలలో ఎవరికి వారే తాము భాషా బ్రహ్మలమనీ, వస్తున్న యితరుల రచనల నుంచి గ్రహించవలసిన భావాలు, అందమైన పలుకుబళ్లు ఉండవనీ ఉపేకిస్తున్నారేమో ననిపిస్తున్నది. ఎందుకంటే అంతకంతకూ అందంగా పటుతరంగా తయారు కావలసిన భాష శుష్కమౌతున్న దేమో ననిపిస్తున్నది. కాదు, ప్రవర్ధమాన మవుతున్నది. ఇవిగో,ఈయీరచనలు భాషావిషయంలో చక్కని చిక్కని పలుకుబళ్లు అందిస్తున్నవంటే శిరసావహించి వాటిని చదువుకొంటాను.

నేటి వ్యావహారిక భాషకు పట్టుగొమ్మలు దిన పత్రికలు. ఇందులో సందేహంలేదు. అయితే ప్రామాణికమైన వ్యావహారిక భాషను ఇవి అందిస్తున్నవా అన్నది ప్రష్టవ్యం. వాటిల్లో వెలువడుతున్న ప్రతి

# విద్యాసంస్థలలో వ్యావహారిక భాష

వాక్యం వ్యావహారిక భాషకు ఆదర్శకం. ప్రామాణికం అంటే ఎంతమంది అంగీకరిస్తారో నేను చెప్పలేను. అంతమాత్రంచేతనే పత్రికా సంపాదకవర్గం వారు విజ్ఞులు కారనుకోవటం సాహసం. చక్కని భాష వ్రాయగలిగినవారు, భాషాతత్త్వం వడపోసినవారు చాలమంది ఉన్నారు. అయితే వారు ఆంగ్ల మూలం ముందుంచుకొని అనతి వ్యవహిత కాలంలో తెలుగున వ్రాయవలసి వస్తున్నది. పైగా వ్రాయవలసిన విషయాలు కూడ పెక్కు శాస్త్రాలకు సంబంధించినవి. అప్పుడు ఎన్ని చిక్కులు ఏర్పడుతవో వూహించుకో వచ్చు. ఏదో ఒక విధంగా ప్రపంచ వార్తలను, విశేషాలను ఎప్పటికప్పుడు అందించగలుగుతున్నారు. అందుకు మన మందరమూ కృతజ్ఞులమే. అయితే పత్రికల మూల పాఠాలను తెలుగులో సంపాదించటానికి యత్నించవలసిన అవసరం ఎంతైనా ఉన్నది.

కనుక దినపత్రికలలోని భాషఅంతా ప్రమాణమని మనం అంగీకరించలేము. వారు కూడా అలా భావిస్తారనుకోను. ఇలాంటి ఇబ్బందులే రేడియోకి ఉన్నవి.

ఏ కారణాలవల్ల నైతేనేమి ప్రశ్నసీయం, ప్రాధాన్యత, ప్రాముఖ్యత, ఐక్యత వంటి శబ్దాలేమి, తల లేని సమాసాలేమి, శిక్షా మాధ్యమం, బోధనా మాధ్యమం వంటి వాడుకలేమి కోకొల్లలుగ వచ్చి పడుతున్నవి. ఇలాంటివి లోకంలోనా లేవు. వ్యాకరణాలు చెప్పవు. కోశాలు చూపవు. వీటికి గతియేమిటి? ప్రయోక్తల సంస్కారం కంటె మరొక శరణ్యం ఉన్నదంటారా ?

వీటి సంగతి వదలివేద్దాము. వ్యావహారిక భాషా సమాదరణంవల్ల శతాబ్దాలనుండి ఉపేక్షితమై ఉన్న వివిధ మండలాలలోని శబ్దజాలం, పలుకుబళ్లు, కారక విశేషాలు, సామెతలు, పరిభాషలు చేరి తెలుగునకు నవ జీవనంతోపాటు లోతుపాతులు సమకూరుస్తవని అందరూ ఆశించారు. కాని ఈనాడు జరుగుతున్న దేమిటి ? ఒక మూడు నాలుగు జిల్లాల భాషయే వ్యావహారిక భాష అన్నట్లు గా కనిపిస్తున్నది. ఇది న్యాయం కాదు. వివిధ ప్రాంతాలలో ప్రచురాలు రమణీయాలు అయిన పలుకుబళ్లను సంగ్రహించుకోవలసిన బాధ్యత రచయితలమీద ఉంది. వృత్తి పదకోశాలు కూర్చటానికి పూనుకొని పనిచేస్తున్న ఆంధ్రప్రదేశ సాహిత్య పరిషత్తువారిని ఈ సందర్భంలో ఎంతైనా అభినందించవలసి ఉన్నది.

పేర్కొనదగిన మరొక విశేష ముంది. దాదాపు డెబ్భై యేళ్లనుంచి వ్యావహారిక భాషోద్యమం సాగుతున్నా, మంచి రచనలు కొన్ని వచ్చినా ఇంతవరకూ ఒక నిఘంటువైనా రాలేదు. 1852, 1854 లలో బ్రౌణ్యాలు వచ్చాయి. ఆ తరువాత మళ్లీ నిఘంటువు కూర్చుకోవలసిన ఆవశ్యకతను వ్యావహారికవాదులు గుర్తించినట్లు కనబడదు. ఇటీవల కొన్ని కోశాలు బయలుదేరాయి. అవి గ్రాంథికాలు. గ్రాంథిక భాషకు నిఘంటువులు అవసరమే కాని వ్యావహారికానికి అవసరంలేదా ?

వ్యావహారిక భాషకు కొందరు వ్యాకరణమో నియమావళో రచించటానికి ప్రయత్నించారు. ఆ రచయితలు పరిశీలించి ప్రమాణీకరించిన గ్రంథాల కంటె రచించిన సూత్రాలకంటె కూడ ఆ సూత్ర గ్రంథాలను చూచినవారి సంఖ్య చాలా తక్కువ అంటే అతిశయోక్తి కాదేమో ననుకొంటాను.

మొత్తంమీద ఈనాడు వ్యావహారిక భాష పరిస్థితి యిది. ఈ వ్యావహారిక భాషను విద్యాసంస్థలలో విశ్వవిద్యాలయాలలో ప్రవేశపెట్టట మనేది చర్చించవలసి ఉంది.

ఈ చర్చకు ముందు మన అభిమతాన్ని లక్ష్యాన్ని స్మరించుకోవటం అవసరం.

భాష శాస్త్ర సాహిత్యాలకు ఒక సాధనమే కాని, తనకు తానుగా పరమార్థం కాదు. మంత్రోపాసకుల అధిక్షేపంతో మన కిక్కడ నిమిత్తంలేదు. శాస్త్ర సాహిత్యాలకు సాధన భూతమైన భాష సామాజిక జీవనంతో మారుతుంది. సందేహం లేదు. కాని, నిన్నటి భాష నేడు లేకపోవటం నేటిభాష రేపుండక పోవటం సంభవించదు. అమ్మ అన్నపదం ఎప్పుడు పుట్టిందో తెలియదు. కుటుంబం ఉన్నంతవరకూ అది ఉంటుంది. అలాగే భయ సంభ్రమ వాచి అయిన అమ్మో శబ్దం కవులు వాడకపోయినా, నిఘంటుకారులు గుర్తించకపోయినా పల్లెటూళ్లల్లో ఇళ్లు కట్టుకొని తెలుగు వారింట పేరంటం చేస్తూనే ఉన్నది.

శబ్దాలు కొన్ని వ్యవహారం నుంచి జారిపో వచ్చును. కొన్ని కొత్త శబ్దాలు రావచ్చును. కొన్ని ప్రాత మాటలు కొత్త రూపాలు కొత్త అర్థాలు పొందవచ్చును. శబ్దపరిణామవేగం జీవిత పరిణామంపై ఆధారపడి ఉంటుంది. అయితే కారకం అంత తొంద

రగా మారదు. తిక్కన నాటి కారకం ఈనాటికీ నెల్లూరు మండలంలోను, రాయలసీమలోను ఇంకా అక్కడక్కడా కనిపిస్తున్నదని పండితులు చూపెడుతున్నారు.

ఈ సందర్భాన మరొక విషయం స్మరించక తప్పదు. ఇద్దరు ముగ్గురు కలిసి ముచ్చటలు చెప్పుకొనేటప్పటి భాష వేరు. ఉపన్యసించేటప్పటి భాష వేరు. చేష్టలతోను, సంజ్ఞలతోను, స్వర భేదంతోను అప్పుడు భావాలను వ్యక్తం చేస్తుంటాము. రచనలో కేవలం శబ్దం ఒక్కటే ఈపని చేయాలి. అందువల్ల నోటిమాటకూ, చేతి వ్రాతకూ కొంత తేడా ఉంటుంది. నూటికి కోటికి ఒకరు వ్యత్యాసం లేకుండా మాటాడవచ్చును. అయితే అపవాదం సామాన్య విధి కాదు గదా.

ఈ వ్యత్యాసానికి మరొకటి తోడపుతున్నది. దైనందిన వ్యవహారానికి కావలసిన శబ్దజాలం పరిమితం. సాహిత్యానికీ వివిధ శాస్త్రాలకూ అది చాలదు. చాలదు. షేక్స్పియర్ ముప్పదివేల శబ్దాలు వాడుకొన్నాడు. ఈనాడు ఆంగ్లసాహిత్యంలో ఒకమాదిరి రచయితగా పరిగణన పొందటానికైనా 50 వేల పదాలైనా వాడగలిగి ఉండాలట. ఒక రచయిత ఎంత ఎక్కువ శబ్దజాలాన్ని వాడితే అంత వ్యర్థుని క్రింద నేటి వ్యావహారికవాదులు జమకడుతున్నట్లు కనిపిస్తున్నది. అనపేక్షిత శబ్ద ప్రయోగం దోషమని అలంకార శాస్త్రోద్ఘోష.

ఏది ఎలాఉన్నా శాస్త్ర సాహిత్యాలకు విస్తృత శబ్ద ప్రపంచమూ అభివ్యక్తి సౌలభ్యమూ కావాలి. అవసరమైనప్పుడు క్రొత్త శబ్దాలను సృష్టించుకోవటానికి వీలుగా భాషను పెంపొందించుకోవలసి ఉంటుంది. అనాదినుంచి వ్యాకర్తలు ప్రకృతి ప్రత్యయ వివేచనంతో సాధు శబ్దానుశాసనం చేయుటంవల్ల కావలసిన మాటను కల్పించుకోవటానికి, ఎట్టి భావాన్నైనా వ్యక్తంచేయటానికి సంస్కృతం సమర్థతను గడించింది. తెలుగులో కూడ మొదటినుంచి ఈ పని జరుగుతూ వచ్చినట్లయితే యీనాటి దుస్థితి మనకు ఏర్పడి ఉండేదికాదు. గత జల సేతుబంధనంవల్ల ప్రయోజనం లేదు. కాని అలాంటి ప్రయత్నంచేసినవారినీ, చేయబోయేవారినీ పరిహసిస్తున్నాము. ఈ దృష్టి ఎంతవరకు సమర్థనీయమో మరొకసారి పరామర్శించుకోవలసిన అవసరం ఉన్నది.

ఆధునిక యుగంలోని మనుగడకు విజ్ఞాన శాస్త్రాలు ఎంతైనా అవసరం. ఆ శాస్త్రార్థాలను తెలుగు ప్రజానీకానికి అందజేయాలంటే ఎంతో కొంత మేర క్రొత్తశబ్దాలను కల్పించుకోవటం, అన్యదేశాలను ఎరవు తెచ్చుకోవటం తప్పదు. ఇలా నూతన శబ్దావశ్యకత ఏర్పడుతున్న తరుణంలో గ్రాంథిక భాషా పరిహరణం అరవంతంగా కనిపించడం లేదు.

గ్రాంథిక భాషనుపూర్తిగా పరిహరిస్తే భాషా సాహిత్య సంప్రదాయ విచ్ఛేదం కలుగుతుంది. ఈ విచ్ఛేదము ఏమాత్రం అభిలషణీయంకాదు.

సంప్రదాయాన్ని అవగతం చేసుకొని ముందుకు పోవటం అవసరం. ఒకప్పుడు నేనూ అనుకొన్నాను. వ్యావహారిక భాష విద్యాసంస్థలలో ప్రవేశపెడితే జ్ఞాన సముపార్జనకు సౌలభ్యం ఏర్పడుతుందని భావించాను. అధ్యాపక వృత్తి అందున్న చిక్కులను నిరూపించింది. విద్యార్థికి వ్రాతకోతలు నేర్పాలి. అతని రచనలో ఎన్నో రకాలదోషాలు శాబ్దికాలు, ఆర్థికాలు, తదుభయాలు దొర్లుతుంటవి. వీటిని ఏ ప్రమాణమును చూపి సంస్కరించాలి ? ఈనాటివరకూ వ్యావహారికభాషకు ప్రమాణాలు లేవు. వ్యక్తిగత అభిమతాలను బట్టి సంస్కరణలను సూచిస్తే విద్యార్థి ప్రశ్నించవచ్చును. ఆ పృచ్ఛ సహేతుకమే. హేతువాదాన్ని పెంపొందించ వలసిన ఈ యుగంలో "నేను చెబుతున్నాను. నీవు నన్ను. నమ్మి దిద్దుకోవాలి" అని శాసించటం సముచితం కాదు.

నిర్దిష్టమైన చట్ట మున్నప్పుడు స్వాతంత్ర్యం ఏర్పడుతుంది కాని, పాలకుల ఇష్టానిష్టాలే శాసనాలైనప్పుడు స్వాతంత్ర్యం ఎక్కడ ఉంటుంది ? ప్రజాస్వాతంత్ర్యానికి ఉదార రాజ్యాంగపు చట్టం ఎంత అవసరమో, భాషా లక్ష్యాలైన శాస్త్ర సాహిత్యాల నిర్మితికి నియతి అవసరం. యునైటెడ్ కింగ్డం వంటి రాజ్యాలలో లిఖితపూర్వకమైన రాజ్యాంగపు చట్టం లేని మాట వాస్తవమే. అక్కడ ప్రజాస్వామ్యం ఉత్తమ స్థాయిలో జరుగుతున్నమాట వాస్తవమే. అయితే దానికి కారణం ప్రబలతరమైన నిర్దిష్ట సంప్రదాయమే. దానివల్ల అచటి ప్రజలు స్వాతంత్ర్యం అనుభవిస్తూ పురోగమించటానికి అవకాశం ఏర్పడింది.

అలాగే యిప్పటి మన వ్యావహారికభాషకు నిర్దిష్టమైన సంప్రదాయం ఏర్పడిందా ? లేదు. మన పరిపాలన నిర్వహణకు ఏమి చేశాము. లిఖిత రాజ్యాంగ నియమావళిని ఏర్పరచుకొన్నాము. అవసర

మనుకొన్నప్పుడు ఈ చట్టాన్ని సవరించుకొంటున్నాము. అలాగే భాషకు కూడా నియతి, వ్యవస్థ ఆవశ్యకం. వ్యవస్థలేక ప్రపంచంలో ఏదీ కొనసాగదు. "అవ్యవసిత చిత్తానాం ప్రసాదోఽపి భయంకరః" అని అనుభవజ్ఞుల అభియుక్తి.

కనుక భాషలో వ్యవస్థ అవసరం. ఈ వ్యవస్థ ప్రకృతి ప్రత్యయ వివేచనంతో సుశబ్దాన్ని బోధించే వ్యాకరణంవల్ల లభిస్తుంది కాని భాషాశాస్త్ర చరిత్రలవల్ల కాదు. భాషాశాస్త్రం, చరిత్ర నిరుపయోగాలని వివేకవంతు డెవ్వడూ అనడు. వాటికి ప్రత్యేక ప్రయోజనాలున్నవి. అవి వేరు. అవి వ్యాకరణ నిర్మితికి సహకారులు.

మనం కోరుతున్న వ్యాకరణం కేవలం వ్యావహారిక భాషకు మాత్రమే పరిమితమై ఉండరాదు. పాణిన్యాదులు అటు వైదికభాషకు, ఇటు లౌకికభాషకూ కలిపి అనుశాసనం చేసినట్లే మన యిప్పటి వ్యాకరణం అటు గ్రాంథికాన్ని ఇటు వ్యావహారికాన్ని అనుశాసించవలసి ఉంటుంది.

ఈ సందర్భాన ఒక వాదాన్ని ప్రస్తావించక తప్పదు. భాష అపారం. ప్రవర్ధమానం. అలాంటి దానికి పార్యంతికానుశాసనం అసంభవం—హాస్యాస్పదం. ఇది ఇలా ఉండగా పదాలు లౌకికాలే అయినా కవి తన ప్రతిభా విశేషంతో క్రొత్త కూర్పు కల్పిస్తున్నాడు. క్రొత్త జీవం పోస్తున్నాడు. అట్టి కవిని "నీవు ఇలా వ్రాయవలెనే కాని అలా వ్రాయరాదు" అని అనుశాసించటానికి ఎవరికధికారం ఉన్నది ? కవులు నిరంకుశులని ప్రాచీనులు అంగీకరించలేదా ?

ఈ వాదంలోని అంశాలు పరిశీలనార్హాలే. భాష అపారం ప్రవర్ధమానం. సందేహంలేదు. కాని మనం పార్యంతిక అనుశాసనం చేయవలెనని చెప్పటంలేదు. తెలిసినంత మేరలో వ్యవస్థ కల్పించుకోవాలని అంటున్నాము. విజ్ఞానం అపారం. ఇంతవరకూ తెలుసుకొన్నది తక్కువ. తెలుసుకోవలసింది ఎంతో ఉన్నది. అంతమాత్రాన విజ్ఞానశాస్త్రాలు తాము కనుగొన్న అర్థాలను సంగ్రహించుకొనక మానవు. కనుగొన్నవాటిని క్రోడీకరించుకొని ముందుకు సాగుతున్నవి. భాషా విషయంలో కూడా అంతే. ఇప్పటి వరకూ వచ్చిన ప్రచుర సుందర ప్రయోగాలను వ్యాకరణం నిరూపిస్తుంది.

ఇంక కవుల స్వాతంత్ర్యం సంగతి. అదెప్పుడూ వారికి ఉంటుంది. స్వాతంత్ర్యం అనేది ఒకరిచ్చేది కాదు. పుచ్చుకొనేది కాదు. ఎవరికి వారు సాధించుకొని అనుభవించాలి. మనం అన్యాయమైన పరప్రభుత్వంపై తిరుగుబాటుచేసి అష్టకష్టాలు పడి స్వాతంత్ర్యం సంపాదించుకొన్నాము. అధర్మమని తనకు తోచినప్పుడు, ఆ అధర్మాన్ని తొలగించటానికై తిరుగుబాటు చేసే హక్కు ప్రతివారికీ ఉన్నది. అది పరమ పవిత్రం. అలాగే భాషలో కూడ తాను అనుచితాలనుకొన్న నియమాలను ఉల్లంఘించే హక్కు కవికి ఉన్నది. దీనిని ఎవరూ తీసివేయలేరు.అయితే దానికోసం అతడు ప్రబల అవరోధాల నెదుర్కొని తన మతాన్నిసాధించుకోవలసిఉంటుంది. వ్యావహారిక భాషోద్యమ చరిత్రే యిందుకుతార్కాణం.

కనుక గ్రాంథిక వ్యావహారిక భాషల రెంటికీ ఏక భాషానుశాసనం అవసరం. వ్యాకరణం వలెనే కోశం కూడా అవసరం. ఈ రెండూ ఏర్పరచుకొనక ఆవేశాభినివేశాలతో వ్యావహారిక భాషను విద్యాసంస్థలలో ప్రవేశపెడితే కొరవితో తల గోకికొన్నట్లవుతుంది. అసలు విద్యా ప్రమాణాలు పడిపోతున్నవని పెద్దలు గోల పెడుతున్నారు. ఈ సందర్భంలో వ్యాకరణ కోశాలు లేకుండా వ్యావహారిక భాషను ప్రవేశపెడితే ఘోర అవ్యవస్థ తప్పదు.

పైగా నేడు కాకపోయినా రేపైనా మాతృభాష విద్యా బోధక భాష కాక తప్పదు. దీనితోబాటు హిందీ రాజభాష కాబోతున్నది. దీనితో తెలుగు మరికొన్ని సమస్యలు ఎదుర్కొనక తప్పదు. ఈ సమస్య లన్నిటిని దృష్టిలో ఉంచుకొని వ్యవహరించవలసి ఉంటుంది.

ఏది ఎలా ఉన్నా గ్రాంథిక వ్యావహారిక భాషలకు ఏకశబ్దానుశాసనం, కోశము ఆవశ్యకాలు. వీటిని ఎలా సంతరించుకోవాలన్నది ప్రత్యేక సమస్య. దానిని గూర్చి నే నిక్కడ ప్రస్తావించటం అసముచితం కాకపోయినా అధిక ప్రసంగమే అవుతుంది. కనుక దానిని విడిచి ఒక సంగతి మాత్రం మనవిచేస్తాను. శబ్దానుశాసనం అధికారులచేత సంగ్రహింపజేయవలసి ఉంటుంది. అధికారులంటే పదవులలో ఉన్నవారని అర్థంకాదు. శబ్దానుశాసన యోగ్యత ఉన్నవారని అర్థం. అలా తయారుచేయించిన వ్యాకృతిపై కొంతకాలం విజ్ఞులు చర్చించాలి. ఆ చర్చల దృష్టితో సంస్కరింపబడిన శబ్దానుశాసనాన్ని నిఘంటువును మున్నిడుకొని వ్యావహారిక భాషను విద్యాసంస్థలలోను విశ్వవిద్యాలయంలోను ప్రవేశపెట్టటం సముచితం. అప్పుడే మనం అభ్యుదయ నిశ్రేయసాలను సాధించగలము.

# 'తలపువ్వు'!

శ్రీ ఇంద్రగంటి భానుమూర్తి

గాఢ తమః పరిష్వంగంలో సొగసిన లోకం కళ్లు విప్పే
అక్షర తేజస్తరుణారుణ పాదం మెరసిన చోట—
మధు రసార్ద్రాళి అమాయిక పుష్పాలు విరిసిన చోట—
అమృతం ఒలికిన చోట—
వికచ వాసంత సుమ పరీమళ పరిమళిత కలకంఠ గీతాలు,
స్పందిస్తూన్న చోట—

హద్దులూ అదుపులూ తుడిచి
నాడులూ నగరాలూ గడచి
దేశాలూ దేశాంతరాలూ
ఖండాలూ ఖండాంతరాలూ నడచి

భాషా, వేషం, హావం, భావం అన్నీ అతిక్రమించి
నలుపూ, తెలుపూ, శత్రుత్వం, మిత్రత్వం గడులన్నీ త్రెంచి
ప్రాణం ఉన్న ప్రతి గుండెనీ చల్లగా పలకరించి
ప్రాణం పెట్టే పూలనేస్తం మారుతం ఇంకా చలిస్తూన్న చోట—
పుట్టిన మనిషీ! ఏం మనీషివి!

* * * *

చెట్లకీ
చెట్లపై ఊగే పువ్వులికీ—
పువ్వులపై
గాలిలో తేలి యాడే రంగు రంగుల పిట్టలికీ—
పిట్టలపై
మెరిసే నక్షత్ర ఖచిత నీలాకాశానికీ పైన
ఇక్కట్లూ చీకట్లూ పగిలిన స్థలాన
కల్పవృక్షాల నీడలు పారాడే మిన్నేటి తీరాన

## 'తలపువ్వా!'

ఎన్నటికీ తెగిపోని తీయని హాసంతో,
ఆరిపోని లావణ్యా జ్వాలా విలాసంతో, మెరిసే వెన్నెల పగళ్ళ లోకాన్ని
అక్షరానంద నిత్యనృత్యాల చలించే నాకాన్ని
భువికి దించ యత్నిస్తూన్న నువ్వా—
నీ విశ్వ రహస్య తమ స్సముద్ర మథనంలో,
హఠాత్తుగా అణువే బద్దలై అద్భుతశక్తి ఆవిర్భవించి
ఒకచేత ఆనందకలశాన్ని, వేఱొకచేత మహాగ్ని కులిశాన్ని ధరించి
సాక్షాత్కరించగా,

స్ఫురిత తటిత్తరళ నేత్రాలతో చూస్తూన్న నువ్వా—
సకల జగన్మంగళ మహస్సు, ఒకే ఒక అఖండ తేజస్సు విడి
యుగయుగాన జన్మించి ఈ లోకానికి శాంతి సూక్తాన్ని పఠిస్తూన్నా
వినక ఆ మహాగ్ని కులిశాన్నే ఆహ్వానిస్తూన్న నువ్వా—
మనిషీ ! ఏం మనీషివి !

*　　　*　　　*　　　*

వెచ్చని వెలుగులతో, పచ్చని ఆశలతో
దూకే లేళ్ళతో, సెల యేళ్ళతో
కొండలతో, కోనలతో, మంచుతో, మంచితో
మోహానంగా మెరిసే ఈ అఖండ సుందరగాత్రిని
జ్యోత్స్నా మనోజ్ఞ తేజస్న్నపిత మసృణ మరకత ధాత్రిని
బహుభంగుల రంగుల ఇంద్రధనుఃఖండాన్ని—
స్ఫురద్రాగ రుచిరోపస్సుషమా స్వప్న సుందర శకలాన్ని
ఈ ఇలాసకలాన్ని—

బిక్కు బిక్కుమనే మహాశ్మశానంగా చేసి
భస్మ సింహాసనాధిష్ఠితుడవై కొలువు తీరుస్తావా !
విలక్షణ శ్రుతులతో, రాగాలతో మనోమోహనంగా మ్రోసే
ఈ సృష్టి శాంతి సుందర గీతాన్ని పేల్చి వేస్తావా !

ఈ మహాసృష్టి కంతటికీ తలపువ్వా !
చేసేదేమిటి నువ్వు !

---

# బొప్పుడి శిథిలశాసనమందలి పాకనాటి బల్లరాజు కాలము

శ్రీ దేవరపల్లి వేంకటకృష్ణారెడ్డి

సత్కవి నన్నిచోడుని కాల నిర్ణయచర్చలో బొప్పుడి శాసన చోడవంశము నెవ్వరు ఇంతవరకు ప్రమాణముగా స్వీకరించినట్లు కనగడలేదు. ఆ పాకనాటి— కమ్మనాటి శిథిలచోడ వంశ చరిత్ర నిప్పుడు పరిశీలింతము.

తప్పులతో కూడుకొన్న సంస్కృతమూలము నంతను ప్రకటించుటకంటె ముఖ్య ప్రమాణ చరిత్రను మాత్రమే ఉల్లేఖించి, ఉన్నంతలో బల్లెరాజుల వంశవృక్షములు చూపుట మేలు.

19—10—1157 తేదీ చంద్రగ్రహణ కాలములో 'నన్నిచోడ (సు) ధి' శ్రీ కేశవస్వామికి సూదనిపాటి గ్రామములో పది 'ఖండుక'ల (పుట్ల) భూమిని దానమిచ్చుట కమ్మనాటి బొప్పుడి శాసనచరిత్ర తెల్పుచున్నది. శాసనదాత నన్నిచోడ సుధికి కన్నరచోడదేవుడు, శ్రీ చోడదేవుడు అను తమ్ములున్నను, వీరి తండ్రిపేరు శిథిలచోడ వంశములో చెడిపోయినందున స్పష్టముగా తెలియుటలేదు.

గుంటూరుజిల్లా నర్సారావుపేట తాలూకాలోని బొప్పుడి శాసన చోడవంశమునకును, చెన్నుపల్లి శాసనచోడవంశమునకును మధ్య వ్యక్తిభేదము లేదను పక్షములో నన్నిచోడుల తండ్రి 'త్రిభువనమల్లి దేవచోడుడు' కాబోలన వీలున్నది.

అట్లు రెండు చోడవంశములకు భేదము లేదను నెడల మొదటి భార్య మాచ (ల) మకు నన్నిచోడ— కన్నరచోడదేవులు (ఇద్దరు) కుమారులు కలుగగా, రెండవ భార్య త్రిభువనదేవికి శ్రీచోడదేవుడు ఒక్కడు మాత్రమే కలిగినట్లు చెప్ప వీలున్నది.

కావ్యావతారికలోని కావ్యకర్త వంశ చరిత్రను బొప్పుడిశాసనమందలి శిథిల చోడవంశ చరిత్రతో పోల్చిచూచినప్పుడు 'చోడబల్లి—బల్లభూవల్లభుడు' భిన్న పురుషులు కారన వీలున్నది. నామైకదేశే నామ గ్రహణము తప్పుకాదు.

'.......అజాయత తతో రాజా సత్యపరాక్రమః త్యాగి పోత స్తత స్త [స్య]...బల్లో బభూవతుః. బల్ల భూవల్లభ శ్శూర స్తయోర్ద్ధర్మ పరాయణః మహీం ...సాహస్రపాక [నాడు] మపాలయత్....కామచోడ.... కరికాల.......విజయాదిత్య పిడువత్యా ఖ్యాతః.....' (S. I. I. Vol. VI. P. 241–243)

'అన పోతనకు ఇద్దరు బల్లరాజులు పుట్టిరి. వారిద్దరిలో ధర్మపరాయణుడును, శూరుడును అగు (చోడ) బల్లరాజు (ఏకవింశతి) సహస్ర పాక నాటి భూమిని పరిపాలించెను........'

ఇక్కడనుండి శిథిలచోడవంశ మారంభమగుచున్నది. అయినను, బల్లభూవల్లభుని తమ్ముడగు బల్ల భూవల్లభుడు కూడ అన్నవలె శూరుడై కమ్మరాష్ట్రము పాలించిన ట్లూహింప వీలున్నది.

బొప్పుడి శాసనములో శిథిలమైన కమ్మనాటి బల్లచోడుని వంశ చరిత్రను విడిచిపెట్టి శిథిలముకాని పాకనాటి (చోడ) బల్లభూవల్లభుని వంశ చరిత్రను పరిశీలింతము.

సత్కవి నన్నిచోడరాజు తన తండ్రి 'పాకనా డిరువదియొక్క వేయిటి కధీశుఁడు వాజను చోడబల్లి' అని కావ్యావతారికలో చెప్పినట్లే శాసనదాత తన ముత్తాత 'పాకనా డిరువదియొక్కవేయిభూమి నేలిన (చోడ) బల్ల భూవల్లభు'డని దానశాసనములో చెప్పి నాడనుట నిర్వివాదము. ఇతని కుమారుడైన నన్ని చోడరాజు పేరు శిథిల భాగములో చెప్పెనో లేదో తెలియదు. శిథిలమైనది.

తెలియకపోయినను, క్రీ. శ. 1145—6. తేదీ నెల్లూరుజిల్లా దర్శి తాలూకా మన్నేపల్లి శాసన చోడవంశమును బొప్పుడి శాసన శిథిల చోడవంశము క్రింద చేర్చినచో అప్పుడు 'బల్లరాజు తనూజుఁడు (పొత్త పి) నన్నిచోడు'ని కందుకూరు పాకనాటి (విషయు) చరిత్ర గోచరించును.




పెద్ద చెరుకూరు శాసనములో పునర్భావ కాలము లేదను మిషతో కాకతీయ గణపతి దీర్ఘ రాజ్య కాలము నాధారము చేసికొని 'చోడబల్లి తనూజుడు నన్నిచోడ' సత్కవికాలము క్రీ. శ.1160–70 ప్రాంతమనగా క్రీ. శ.12 శతాబ్దమని హేమాహేమీలు నిర్ణయించుట సరికాదు.

బహుశా క్రీ. శ.1157 తేది కమ్మనాటి 'నన్నిచోడ—సుధి' నే తండ్రిపేరు శిథిలమైనందున చోడబల్లి కుమారుడై యుండవచ్చుననుకొని, ఆ కాలమును పెద్ద చెరుకూరు చోడవంశములో చొప్పించి సరిపెట్టినారు కాబోలనుటకు పై శాసన చోడవంశ సమకాలములు తోడ్పడుచున్నవి.

# బొప్పుడి శిథిల శాసనమందలి పాకనాటి బల్లరాజు కాలము

## కందుకూరు చోడవంశ వృక్షము




అన్ని శాసనములలోని 'బల్ల, బల్లె, చోడబల్లి' పేర్లు మారుపేర్లు కావని స్పష్టమగుచున్నది. అట్లే 'పొత్తపి నన్నిచోడు' నన్నిచోడు' పేర్లును, 'రాజ మహేంద్ర పొత్తపిచోడు, రాజరాజ మహీపతిః' పేర్లును మారుపేర్లు కావు.

నన్నూరుపాడు శాసన చోడవంశములో మూల పురుషు లిద్దరు 'వెంక' రాజులగుటచేత శిల్పి చెక్కు నప్పుడు తప్పుగా మొదటి '(కంటు వంక్య) వెంక రాజు' స్థానము మూడవ స్థానమునకు మార్చి చెక్కి నట్లు బొప్పుడి శాసనమందలి 'చాగి (వెంకన)—త్యాగి (పోతన)' బిరుదనామము దృఢపరచు చున్నది.

బొప్పుడి శాసనములో 'తస్య పుత్రో భూ [త్పాంకః] శంకరకింకరః....శ్రీమాన్ సర్వ్వాముర్వ్వి మహీపలతు' ...... అనుటనుబట్టి అతను శంకర కింకరుడైన 'వేంక' రాజనుట కాక్షేపము లేదు. పగ సాధించువాడగుటచేత అతనిని 'కంటు వెంకరాజు' అన్నట్లే, 'చాగి—త్యాగి' యగుటచేత మరియొకనిని చాగి వెంకన లేక 'త్యాగిపోతన' అన్నట్లు వాడుకపేర్లు చెప్పుచున్నవి. కాబట్టి, నన్నూరుపాడు శాసనములో చోడవంశము తారుమారైనట్లు గుర్తించి క్రమముగా కూర్చుట మార్పుకాదు. సాదృశ్య చరిత్ర.

'.............................................పాకనాం
డిరువదియొక్క వేయుటి క
ధీశుఁడు నాఁజను చోడబల్లికిం
........శ్రీసతికిన్ తనూజు (డు)
..........నత్కవి నన్నిచోడుఁడట.'

కావ్యావతారిక చరిత్రతో శాసన చరిత్ర చక్కగా సరిపోవుచున్నది. తల్లి పేరు లేదు.




శాసనచోడవంశ. చరిత్రలో కావ్యావతారికలో చెప్పినట్లు కవి తల్లి 'శ్రీసతి' పేరు లేకపోయినను (కందుకూరు) 'పాకనాటి భూమి' నేలిన తండ్రి 'బల్ల భూవల్లభుడు—చోడబల్లి' పేరున్నట్లు శిథిల శాసన చోడ వంశ చరిత్ర వాచ్యముగా చెప్పుచున్నది. పరిశోధకులందరీ కందుకూరు—దర్శి పాకనాటి శాసన చరిత్రను గుర్తింపకపోవడము శోచనీయము. కావ్య వ్యంగ్య చరిత్రలో చోడకవి శ్లేషగా 'కనిగిరి పతి' ఉదయాద్రి ప్రభు (శృంగము—ప్రభుత్వము) రాజ్యము సూచించినాడనుట దర్శి శాసనచోడ వంశనిదర్శనము. కందుకూరు—పాకనాంటి విషయ (ము) లోనివే అవి. స్కంధపురి ప్రబంధము కుమార సంభవకథ కాబోలును!

క్రీ. శ.1145–66 తేదీ (ల) మన్నేపల్లి శాసన చోడవంశములో కవిరాజశిఖామణి తేంకణాదిత్యుని పేరు చెప్పకపోయినను, ఆ కవి 'పొత్తపి నన్నిచోడు'నే తద్వంశ మూల పురుషుడుగా పేర్కొన్నట్లు స్పష్టమగుచున్నది. అతని తండ్రి 'పాకనాటి నేలిన (బల్లి) బల్ల' చోడరాజని క్రీ. శ. 1157 తేదీ బొప్పుడి శాసన శిథిల చోడ వంశ చరిత్ర సూచించుచున్నది. కాబట్టి క్రీ. శ. 1097 తేదీ నన్నూరుపాడు శాసన కర్త పొత్తపిచోడుని తాత, (కవి) పొత్తపి నన్నిచోడుడు క్రీ. శ. 11 శతాబ్దికి చెందిన వాడగునే కాని క్రీ. శ. 12 శతాబ్దికి చెందిన వాడెంతమాత్రము కాదు.

భాషా తత్వవేత్తలు "ఇంతవరకును చేసిన చర్చ చేత తేలిన సారాంశము—నన్నెచోడుఁడు

(1) శాసనాధారములచేత దొరకఁడు. శాసనములచే విధిలేక గ్రహించినను నన్నయకు పూర్వుఁడు కాఁడు. అనంతరుఁడు;

(2) షష్ఠ్యంత రచనచేత తిక్కన కేతనల కనంతరుఁడు. అనుట........"

—శ్రీ వేదం నన్నెచోడుని కవిత్వము.

ఇప్పుడీ నాలుగు శాసనములచే విధిలేక గ్రహించినఁ (పొత్తపి నన్నిచోడుఁడుఁ నన్నయకుఁ) పూర్వుడు కాక పోయినను 'అనంతరుఁడు' మాత్రము కాడు. సాక్షాత్తు సమకాలికుడు. సందేహము లేదు. నన్నయ—మల్లయ కవులకు నడిమివాడు. నన్నయ—కేతయ్యలకు నడిమి వాడు కాడు.

గ్రంథాంతరంగికమైనే గర్భకవి ప్రతిజ్ఞా పాలన కాలమును బట్టి చూచిన క్రీ. శ. 1045—70 తేది పురుషాంతరకాలములో క్రీ. శ. 1054 తేదీ 'రగడ' కాలమునాటికి కుమార సంభవ రచన తుద ముట్టి నట్లేర్పడుచున్నది.

క్రీ. శ. 1157 తేదీ బొప్పుడి శాసన శిథిల చోడవంశమందు 'ఇరువదియొక్క వేయిటి నేలిన బల్ల భూవల్లభుడు' చిక్కినాడు కాబట్టి, కుమార సంభవ విమర్శకులు (భాషా తత్వవేత్తలు) ఇక 'పెద్ద చెరుకూరి శాసనమున' 'బాంకనాఁడిరువదియొక్క వేయిటి కధీశ్వరుఁడు'.చోడబల్లి దొరికినాడందురే. అది యెట్లు?—అని శాసన చరిత్ర నాక్షేపించుటకు వీలెంతమాత్రము లేదు. ఉన్న నాలుగు శాసన చోడ వంశములు సమకాలిక చరిత్రను సమన్వయము చేయుచున్నవని మరచిపోరాదు. కాగా కల్పిత భాషా చరిత్ర చెల్లదు.

# మబ్బు విడిచిన ఎండ

## శ్రీ పెద్దిభొట్ల సుబ్బరామయ్య

ధనంజయరావుపంతులు కప్పుకునివున్న దుప్పటి తొలగించి, పక్కనే బల్లమీద అందుబాటులోవున్న కళ్లజోడుతీసి తగిలించుకుని కిటికీలోనుంచి బయటికి చూశాడు. నిద్రమత్తు ఇంకా వదలని ఆయన కళ్లకు బయట సన్నగా జల్లుపడుతూవుండటం కనిపించగానే అకారణంగా ఒక విధమైన ఉత్సాహం కలిగింది. ఆయనకు చిన్నతనంనుంచీ పక్కమీద మత్తుగా పడుకుని దుప్పటి కప్పుకునివుండి బయట జోరుగా కురుస్తున్న వర్షం వంక చూస్తూ గంటల కొద్దీ కాలం గడిపివేయడమంటే ఎంతో యిష్టం. ఉద్యోగంలో ఉన్నన్నాళ్లూ ఆదివారాలూ, శలవు రోజులలో తప్ప అటువంటి అవకాశం లభించేది కాదు. వర్షం పనికట్టుకుని శలవులలో, ఆదివారాలలో మాత్రమే కురవదు కదా! ఉద్యోగంలో ఉండగా గడిచిన ఎన్నో సంవత్సరాలుగా వర్షర్తువులలో ఆయన ప్రతి శనివారమూ రాత్రిపూట పడుకోబోతూ "తెల్లవారితే ఆదివారం. ఉదయం లేచీ లేవగానే వర్షం కురుస్తూ ఉండాలి" అనుకునేవాడు. కాని చాలా పర్యాయాలు ఆయన ఆశ ఫలించలేదనే చెప్పాలి. కళ్లుతెరిచి కిటికీలోనుంచి చూసి హతాశుడయ్యేవాడు. కిటికీలోనుంచి దాదాపు ప్రతిసారీ నిర్మేఘమైన ఆకాశమూ, ప్రశాంతంగావున్న ప్రకృతీ కనబడి ఆయనకు నిరుత్సాహం కలిగిస్తూ ఉండేవి.

ఇవాళ చాలా మంచి రోజులా వుంది. కిటికీలో నుంచి కనిపిస్తున్న ఆకాశభాగం గచ్చకాయ రంగులో వున్న జలార్ద్రమైన మేఘాలతో నిండివుంది. నీటితో నిండిన ప్లాస్టిక్ సంచీలావున్న ఆకాశం ఉండి ఉండి ఉరుముతున్నది. కిటికీలోనుంచి చతురస్రంగా విభజించబడినట్టు కనిపిస్తున్న మేఘావృతమైన ఆకాశమూ, దానిమధ్యలో ఏపుగా పెరిగిన పున్నాగచెట్టూ, ప్రహరీగోడమీద వాలివుండి వానలో తడిసి మాటిమాటికీ రెక్కలూ తలా విదిలించుకుంటున్న గోరువంకా, అన్నీ కలిసి ధనంజయరావుపంతులుకు హుషారు కలిగించాయి. ఉత్సాహమనే ఔషధాన్ని సిరంజిలో పోసి నరం లోపలికి నేరుగా రక్తంలోకి చేరేట్టు ఇంజక్షన్ యిచ్చినట్టయింది. ఆయన తన వయస్సు మాట మరిచిపోయి యీలవేస్తూ నిర్నిమేషంగా ఆకాశం వంక చూస్తూ పడుకున్నాడు. అప్పుడే తనకు ఈ అరవై అయిదేళ్ల జీవితంలోనూ బాగా ఆనందం కలిగించిన విషయాలు కొన్ని గుర్తు వచ్చాయి ఆయనకు. అందులో మొదటిది ఆయన ఇల్లాలిని గురించినది. ఆమె ఇప్పుడు లేదు. ఆ ఇంట్లో కొత్తగా ప్రవేశించిన ప్రతి వ్యక్తి దృష్టినీ ముందుగా ఆకర్షించేది ముందు హాలులో గోడకు తగిలించబడివున్న నిలువెత్తు పంచ రంగుల ఫోటో. లోపలికి అడుగు పెట్టగానే ప్రతివారి చూపులూ ఆ బొమ్మ కళ్లచేతనే ఆకర్షించబడుతూ వురటాయి. కలతలేక కుదురుగా వున్న నీళ్లమీద ఉండి ఉండి తేలియాడే పెద్ద పెద్ద వెండి రంగుల చేపలవంటి ఆ కళ్లనుంచి దృష్టి మళ్లించడం కష్టమే. అలా చేయగలిగితే తర్వాత అలంకృతమైన శంఖంవంటి కంఠమూ, జరీ అంచు చీరె, పండు తమలపాకులవంటి పాదాలూ కనిపిస్తాయి. అన్నిటికన్నా క్రింద ధనంజయరావు స్వదస్తూరీతో వ్రాసిన 'సుభద్ర' అనే అక్షరా లున్నాయి. ఆమె చాలా యేళ్లక్రిందట ఒక ఆదివారం ఉదయం బాగా వర్షం కురుస్తున్న సమయంలోనే కళ్లు మూసింది.

ధనంజయరావుకు తలుచుకున్నప్పుడల్లా నిరంతరం సంతోషం కలిగించే మరొక విషయం లెక్కలు. ఆయన తన బి. ఏ. పట్టా లెక్కలలోనే సంపాయించాడు. ఆ శాస్త్రం అంటే ఆయనకు విపరీతమైన అభిమానం. సెలవు దొరికితే చాలు, లెక్కల పుస్తకాలు ముందు పోగు పెట్టుకుని కూర్చుని ప్రాబ్లమ్ తర్వాత ప్రాబ్లమ్ సాధించుకుంటూ పోయేవాడు. అలా వందలకొద్దీ లెక్కలు, రక రకాల లెక్కలు

సాధించిన తర్వాత ఆ పుస్తకాన్ని ఒక వైపుకు విసిరి వేసేవాడు. రిటైరయిన ఈ అయిదేళ్లుగా ఆయన అల్మారాలో పాతబడివున్న ఆ పుస్తకాలన్నింటినీ ఇవతలికి తీసి చేసిన లెక్కలే మళ్లీ చేస్తూ ఎంతకాలం గడిపాడో అంచనా వెయ్యడం కూడా కష్టమే.

ఆయనకు ఆనందం కలిగించే మరొక విషయం విశ్వనాథాన్ని ఆటలు పట్టించడం. విశ్వనాథం ఆయన చిన్ననాటి స్నేహితుడు. ఆయనకు లెక్కలంటే హడల్. ఇద్దరూ హైస్కూలులోనూ, కాలేజీలోనూ కలిసే చదువుకున్నారు. విశ్వనాథం ప్రతి క్లాసులోనూ సంవత్సరాల తరబడి కూర్చోకుండా పైకి రాగలిగాడూ అంటే అది అంతా ధనంజయరావు చలువవల్లనే అని చెప్పక తప్పదు. స్కూల్ ఫైనల్ పరీక్షలో కూడా విశ్వనాథం లెక్కలనబడే తన పాలిటి భూతంవల్ల భయంతో పాలిపోయిన సందర్భంలో ధనంజయరావు రాత్రి అంతా మేలుకుని ఆయనకు ముఖ్యమైన లెక్కలూ సిద్ధాంతాలూ వోపికగా బోధించాడు. అయితే మాత్రం? పరీక్ష హాలులో పేపరు అందుకోగానే తన వెనకనే కూర్చున్న విశ్వనాథం మొహం ఆఖరు గంటలో అతని ఆన్సరు పేపరులా తెల్లగా పాలిపోయి ఉండటం గమనించి వాచర్లకంటబడకుండా అతి జాగ్రత్తగా తన లెక్కలు చూపించి వాటిని కాపీ చేసుకునే వీలు కల్పించి ఉద్ధరించినవాడు ధనంజయరావుపంతులే. విశ్వనాథం స్కూల్ఫైనల్ తర్వాత హాయిగా నిట్టూర్చి ఇంటరులో తెలుగూ, చరిత్రలు గ్రూపుగా తీసుకుని కాలేజీలో చేరాడు. ఆ తర్వాత జీవితంలోనూ విశ్వనాథం అట్టే పైకి రాలేకపోయాడు. రిటైరయేనాటికి ధనంజయరావు అయిదువందల రూపాయల జీతం తీసుకుంటూ ఉండేవాడు. విశ్వనాథం మరొక ఆరు నెలల తర్వాత ఎక్కడో గుమాస్తాగా రెండువందల చిల్లర రూపాయల వేతనంతో రిటైరయినాడు. ఆయన ఆ వీధి చివరలోనే ఒక పెంకుటింటిలో అద్దెకుంటున్నాడిప్పుడు. చేతికర్ర వూతగా ఆయన ప్రతిరోజూ విధిగా ఇక్కడికి వస్తూనే ఉంటాడు. ఇప్పటికీ ధనంజయరావు విశ్వనాథాన్ని అప్పుడప్పుడు లెక్కల విషయంలో ఎగతాళి చేస్తూనే ఉంటాడు. అటువంటి సందర్భాలలో విశ్వనాథం కళ్లజోడు సర్దుకుని "పోన్లే వోయ్! అంతమాత్రంలో నేను జీవితంలో తల్లక్రిందులైపోయిందేమీ లేదు. నువ్వు లెక్కల పుస్తకాలన్నీ మింగి జీర్ణించుకున్నంతమాత్రంలో నాకన్నా సుఖపడుతున్నదీ లేదు" అంటూ ఉంటాడు. దానితో యిద్దరూ నిర్మలంగా నవ్వుకుంటూ వుంటారు.

ధనంజయరావు కళ్ల జోడు తీసి ఒక్కసారి కళ్లు నులుముకుని బయటికి చూశాడు. ఆ గోరువంక అంత సేపటినుంచీ అక్కడ ప్రహరీగోడమీద సోమరిగా నిలబడివుండి వర్షంలో తడుస్తూ రెక్క లల్లార్చుకుంటున్నదల్లా ఎటో ఎగిరి చక్కాపోయింది. పక్కయింటివారి రేడియో పెద్దగా వాగుతున్నది.

అంతలో గది తలుపు తెరుచుకుని లోపలికి తొంగిచూసింది వసంత. ఆ పిల్లకు పదమూడేళ్లుంటాయి. సన్నగా, పచ్చగా, నాజూగ్గా ఉంటుంది. చేతిలో పుస్తకంతో లోపలికి వస్తూ ఆమె, "లేచావా తాతయ్యా ఇందాక ఒకసారి వచ్చిచూస్తే నిద్రపోతున్నావు నువ్వు" అంటూ పక్కమీద కూర్చున్నది.

ధనంజయరావుపంతులు నవ్వి, "ఏమిటి సంగతి?" అని అడిగాడు.

వసంత, "నువ్వు లేవలేదు కదా అని మళ్లీ వెళ్లి ఇప్పటిదాకా లెక్కలు చేసుకుంటూ కూర్చున్నాను. ఇదిగో, అయిదు లెక్కలు చేశాను." అన్నది.

ధనంజయరావుకు అంత వయస్సు ఉన్నా ఆ పిల్ల లౌక్యం బొత్తిగ్గా అర్థం కాదు. తాతగారికి ఏ మాట చెబితే ఆయన మెత్తబడి తా నే వరం అడిగినా కాదనని స్థితిలోకి వస్తాడో ఆ పిల్లకు బాగా తెలుసు. అందుకే క్లాసుపిల్లలతో ఎక్స్‌కర్షన్‌కు వెళ్లవలసి వచ్చినా, సాయంకాలం స్నేహితురాళ్లతో సినిమాకు వెళ్లవలసివచ్చినా, లేక ఏ యితర పర్మిషన్ కావలసి వచ్చినా చేతిలో లెక్కల పుస్తకంతో ఆమె నెమ్మదిగా తాతగారి దగ్గరికి చేరుకుంటుంది. బస్! దానితో ఆమె తల్లీ,అత్తగారూ, తండ్రీ, యితరప్రపంచమూ,మూర్తిత్రయమూ ఏకమైవచ్చి అడ్డు నిలిచినా ఆమెకోరిక సిద్ధించకుండా ఎవ్వరూ ఆపలేరు. ఇవాళ ఆ అమ్మాయి తన స్నేతురాళ్లతో కొత్తగా విడుదల అయిన సినిమాకు వెళ్లవలసివుంది మరి......

ధనంజయరావుపంతులు పుస్తకంలోకి చూసి పెద్దగా నవ్వడం ప్రారంభించాడు. కొంతసేపటికి నువ్వు ఆపుకోలేక దుప్పటి అవతలికి విసిరి పారేసి లేచి పొట్టపట్టుకుని మరీ నవ్వాడు. కళ్లవెంట నీళ్లు తిరిగేట్టు విపరీతంగా నవ్వి నవ్వి చివరకు ఆమెను

దగ్గరికి తీసుకుని "భలేదానివే నువ్వు. ఈ లెక్క చూడు. ఏమిటిది?" అన్నాడు మళ్ళీ నవ్వుతూ.

వసంత తెల్లబోయి, తర్వాత తేరుకుని "ఏమిటి తాతయ్యా! అది ఆన్సరు......6¼.....దాన్లో నవ్వేందు కేముందీ?" అన్నది.

ఆయన కళ్ళజోడు తీసి తుడుచుకుని "అవునే అమ్మడూ! ఆ 6¼ అనేది ఆన్సరే.....నేను కాదనటం లేదు. కాని, ఏమిటవి? రాళ్ళా రప్పలా? లెక్క ఏమో మనుష్యులను గురించి...వాడు లెక్కలో 'ఫలానా పని చేయుటకు ఎంతమంది కూలీలు కావలెను?' అని అడుగుతున్నాడు. నీకేమో 6¼ అని ఆన్సరు వచ్చింది" అంటూ మళ్ళీ నవ్వుతూ "ఆరుగురు కూలీలంటే నేను అర్థం చేసుకోగలను. నాకు అర్థంకానిదల్లా ఆ ¼ కూలీ అంటే ఏమిటీ? అని......" అన్నాడు.

వసంత సిగ్గుపడి చప్పున పుస్తకం అందుకుని అవతలికి పారిపోయింది. ధనంజయరావు మళ్ళీ నవ్వు కుంటూ 'పిచ్చిపిల్ల' అనుకున్నాడు. తర్వాత మరికొద్ది నిముషాలసేపు ఆయన మళ్ళీ కిటికీలోనుంచి చూస్తూ అలాగే పడుకున్నాడు.

మబ్బులు ఇంకా కమ్ముకుని వస్తూనే వున్నాయి. ఆకాశం వుండి వుండి ఉరుముతూనే వుంది. నల్లని మేఘాలను చీల్చుకుని నిలువుగా గీత గీచినట్లు మెరుపు మెరిసింది.

అంతలో రాజశేఖరం చేతిలో సంచీతో ఆ గదిలోకి వచ్చి తండ్రి ఇంకా లేవకుండా అలాగే పడుకుని వుండడం చూసి సందేహిస్తూనే దగ్గరికి వెళ్ళి నిల బడ్డాడు.

ఆయన కళ్ళు తెరిచి చూసి "ఏంరా రాజా!" అంటూ పలకరించాడు. రాజశేఖరం తలవంచుకుని నెమ్మదిగా "నేను బజారుకు వెడుతున్నాను నాన్నా! వీలయితే ఆస్పత్రికి కూడా వెళ్ళివస్తాను......" అన్నాడు.

ధనంజయరావుపంతులు కొంచెం చిరాకుపడుతూ "అలాగే వెళ్ళిరా" అన్నాడు.

రాజశేఖరానికి ముప్ఫయిఎనిమిదేళ్ళంటాయి. ఇన్ కంటాక్సు డిపార్టుమెంటులో ఒక సెక్షన్ హెడ్‌గా పని చేస్తున్నాడు. అయినా అతడు ఇప్పటికీ తండ్రితో సంప్రదించనిదే ఏ పనీ చేయడు. అదే ధనంజయ రావుకు అతన్ని గురించి చికాకు కలిగించే విషయం. విశ్వనాథం ఎప్పుడూ "నీకొడుకు ముత్యంలాటివాడోయ్! లేకపోతే..... ఈ రోజుల్లో రెక్కలు రావడమే తరు వాయి. పిల్లలు మనలను మూలకూర్చోబెట్టేస్తారు. నీదే అదృష్టం......ఇన్నేళ్ళు వచ్చినా మీ రాజు నిన్ను గౌరవిస్తూ ప్రతి విషయంలో నీ సలహా తీసుకోవటం చూస్తూవుంటే నా కెంతో ముచ్చటగా వుంది" అంటూ వుంటాడు. విశ్వనాథం కొడుకు చక్రపాణి, రాజ శేఖరంకన్నా చాలా చిన్నవాడు. అతడు సర్వే శాఖలో గుమాస్తాగా నెల కో నూటయాభై తెస్తూవుంటాడు. ప్రతి పనీ తానే స్వయంగా ఇతరుల ప్రమేయమూ, సలహాలూ కోరకుండా చేసుకుపోవడం అతనికి రివాజు. ఒకవేళ తండ్రి తనంత తానుగా ఏ విషయంలోనైనా జోక్యం కలిగించుకోబోతే వారించి "నీ కెందుకు నాన్నా! పెద్దవాడివి. సుఖంగా విశ్రాంతిగా వుండక ఈ బెడద లన్నీ పెట్టుకుని మనసు పాడుచేసుకోవడం దేనికి?" అంటూ వుంటా డతడు. విశ్వనాథానికి ఆ ధోరణి బొత్తిగా సరిపడదు.

ధనంజయరావు తలతిప్పి చూసేసరికి వసంత గుమ్మంలో నిలబడివుండి నడుమున చెయ్యి వుంచు కుని తన మేనత్తను అనుకరిస్తూ పెద్ద ఆరిందా లాగా "తాతయ్యా! నువ్వింక లేచి నీ పనులు కానిచ్చుకో. నా కవతల బోలెడు పనులున్నాయి". అన్నది.

ధనంజయరావు అర్థం చేసుకున్నాడు. బాగా పొద్దెక్కినట్టున్నది. లోపలినుంచి కబురు రావడం దానికి సూచన. ఇక తాను లేచి కాల్యాదులన్నీ ముగించుకుని కాఫీ తీసుకుంటేగాని అనూరాధ వంట ప్రయత్నం ప్రారంభించే వీలులేదు. పైగా ఆమె వంట వగైరాలు ముగించుకుని ఆసుపత్రికి కూడా వెళ్ళవలసివుంది. అక్కడ కోడలు "ఎవరూ ఇంకా రాలేదే" అని ఆదుర్దా పడుతూ ఉంటుంది కూడా.

ఆయన లేచికూర్చొని దుప్పటి ఒకమూలకు విసిరి వసంతతో "లేచా నని చెప్పు అత్తయ్యతో" అన్నాడు. ఆపిల్ల అది విని తల వూపి వెళ్ళిపోగానే లేచి నిలబడి ఒళ్ళు విరుచుకున్నాడు. తర్వాత నెమ్మదిగా నడిచి లోపలి గదిలోకి వెళ్ళాడు. అక్కడ ఆయన కూతురు కుంపటిముందు కూర్చుని కాఫీ కలుపుతున్నది. ఆ ప్రక్కనే వసంత ఒక గ్లాసు పుచ్చుకుని తన వాటా కాఫీ కోసం సిద్ధంగా కూర్చుని వుంది.

ధనంజయరావు నవ్వుతూ "ఏమే వసంతా! నీక్కూడా కాఫీయేనా? చిన్నపిల్లలు కాఫీ తాగవచ్చునా?

తప్పు కదూ?'' అన్నాడు. అనూరాధ నవ్వుతూ తల ఎత్తి చూసింది.

వసంత, ''ఎందుకు తాగగూడదు తాతయ్యా! అది కూడా చెప్పు వింటాను'' అన్నది.

ధనంజయరావు అక్కడే పీట వాల్చుకుని కూర్చుంటూ ''ఎదురు ప్రశ్నలు కూడానా? నేను కూడదని చెబితే అంతే అమ్మాయీ! దీనికి కాఫీ ఇవ్వకు. మరీ రాలుగాయి అయిపోతున్నది......'' అన్నాడు.

అనూరాధ నవ్వింది. ఆమె నవ్వితే ధనంజయ రావు మనసు ఎప్పుడూ తేలికపడుతూ ఉంటుంది. అనూరాధ రాజశేఖరం తర్వాతది. అతనికన్నా నాలు గయిదేళ్లు చిన్నది. సుభద్రకు ఆడపిల్లలంటే ప్రేమ మిక్కుటం కావడంవల్ల చిన్నప్పటినుంచీ అనూరాధ రాజశేఖరంకంటె గారాబంగా పెరిగింది. ఆమె అస మాన లావణ్యవతి. నిమ్మపండువంటి శరీరచ్ఛాయా, తీర్చిదిద్దినట్టుండే అవయవాలూ, చెంపలకు చేరడేసి నీలికన్నులూ, చూపులలో ఠీవీ ఎవరి నాకర్షించవు? ధనంజయరావు ఎల్లప్పుడూ తల్లి రూపురేఖలు అచ్చుగుద్దినట్టు భూమిమీద పడిన కూతురుని చూసి ఎంతగానో గర్విస్తూ ఉండేవాడు. ఆమె పదహారోయేట స్కూల్ ఫైనల్ ప్యాస్ కాగానే కొన్నినెలలపాటు వరులవేటలో నిమగ్నుడై ధనంజయరావు చివరకు సూర్యారావనే ఇంజనీరు విషయంలో అన్ని విధాలా సంతృప్తిచెంది ఆ సంబంధం ఖాయంచేసి అతనితో ఆమె పెళ్లి జరిపించాడు. కాని, విధిదృష్టి వక్రించింది. ఒక ప్రాజెక్టు నిర్మాణంలో పని చేస్తున్న సూర్యారావు, మరో నలుగురు తోటి ఇంజనీర్లతోసహా నదిలో మునిగి పోయి మరణించాడు. అప్పటినుంచీ అనూరాధ పుట్టింటి లోనే ఉండిపోయింది.

వసంత తాతగారి మాటలకు కోపం తెచ్చు కుని చేతిలో గ్లాసు దూరంగా నెట్టి బుంగమూతి పెట్టుకుని గోడ కానుకుని కూర్చున్నది. అనూరాధ గ్లాసులో కాఫీపోసి ఆ పిల్లవైపు జరిపి ''తీసుకో..... కోపం తెచ్చుకోకు.....నా తల్లి కదూ!'' అన్నది.

వసంత కోపంగా చూస్తూ, ''మరి అలా ఎందు కనాలేం?'' అన్నది.

ధనంజయరావు లేస్తూ,''మరి అనరేమిటే? 6¼ మనుషులని లెక్కలు చేస్తూవుంటే అనక ముద్దు పెట్టుకుంటారు కాబోలు. చదువుకునే పిల్లలు పూట పూటా కాఫీలు తాగితే అలాగే వస్తాయి అన్నర్థ్లు.....'' అన్నాడు.

''మరి.....నువ్వు చిన్నప్పటినుంచీ కాఫీలు తాగ కుండానే చదివావా?'' అన్నది వసంత చుర చుర చూస్తూ.

ధనంజయరావు నవ్వుకున్నాడు. అవును మరి! ఆ కాలం ఈ కాలమా? ఆ పిల్లలు ఈ పిల్లలా?

అనూరాధ, ''పోన్లేఅమ్మా! పెద్దవాడు ఏదో తమాషాచేస్తూ వుంటాడంతే! నువ్వు పట్టించుకో గూడదు. హాయిగా కాఫీ తాగేసి వెళ్లి చదువుకుంటూ కూర్చో. మళ్లీ నేను వంట ముగించుకుని త్వరగా తెమిలి మీ అమ్మ దగ్గరికి వెళ్లాలి. అక్కడ ఆమెగారు ఎంతగా చిందులు తొక్కుతున్నదో, అసలే కంగారు మనిషి.....'' అన్నది.

ధనంజయరావు పెరటిలోకి వెళ్లి పది నిముషా లలో తిరిగి వచ్చేసరికి ఆమె టవల్ అందించింది. ఆయన మొహం తుడుచుకుంటూ, ''ఈ ముసురు తగ్గేట్టులేదే.....'' అనుకున్నాడు.

అనూరాధ కాఫీ అందిస్తూ తండ్రితో ''అదుగో ఆ బల్లమీద ఫ్లాస్కులో వేరే కాఫీ కలిపి ఉంచాను. ఆయన వస్తే ఇవ్వు. నా కింక పనితో తీరుబడి ఉండదు. అప్పుడేమో నువ్వు కాఫీకోసం కేకలు పెడితే ఎలా మరి?.....'' అన్నది. ధనంజయరావు నవ్వి తలవూపి ''అలాగే'' అన్నాడు.

ఆ రాబోయేవ్యక్తి విశ్వనాథం. ఆయన రోజూ ఉదయమే నిర్ణీతవేళకు నెమ్మదిగా చేతికర్ర వూతగా వీధిచివరి తన ఇంటినుంచి ఇక్కడికి నడిచి వస్తాడు. ఒకవేళ ఏనాడయినా, ఏ కారణంచేతనయినా, ఆయన రావడం ఆలస్యమైతే ధనంజయరావుపంతులు ఏమీ తోచక కాలు గాలిన పిల్లిలా అటూ ఇటూ తిరుగుతూ ఉండేవాడు. ఇక నిరీక్షించలేనిపక్షంలో లాల్చీ తొడు క్కుని తానే ఆయన ఇంటికి బయలుదేరి పోయే వాడు. అయితే అలా చాలా అరుదుగా మాత్రమే జరి గింది. అసలు ఎక్కువసార్లు ఆయన నిరీక్షించడం కూడా జరగలేదు. విశ్వనాథం చాలా కరెక్టు మనిషి. చిన్నప్పటినుంచి మంచి క్రమశిక్షణతో పెరిగాడు. అందువల్ల ఆయన చేసే పనిలో క్రమం తప్పడం అనేది చాలా అరుదు. ఆయన రాగానే ఇద్దరూ ఎదు రెదురుగా కుర్చీలలో విశ్రాంతిగా వెనక్కువాలి కూర్చుని

ఏవేవో కబుర్లు చెప్పుకునేవారు. ఆ కబుర్లు మానవ జాతికి సంబంధించిన అన్ని రంగాలను గురించీ జరిగేవి. ఒక్కొక్కరోజు ఒక్కొక్క విషయంతో ప్రారంభమైన సంభాషణ మరేదో విషయంతో అంత మవుతూ ఉండేది. నిన్నటిరోజున నిత్యావసర వస్తువుల ధరల పెరుగుదలతో ప్రారంభమై మానవుడి చంద్రమండల విజయం—దాని సాధ్యాసాధ్యాలు అన్న విషయంతో ముగిసింది వారి సంభాషణ. దాదాపు భోజనాలవేళకు గాని ఇద్దరూ లేచేవారు కాదు.

ధనంజయరావు వెచ్చగా కాఫీ చప్పరిస్తూ కూర్చున్నాడు. ఆయనకు కొద్దిదూరంలో వసంత చాపమీద కూర్చుని ఏదో వ్రాసుకుంటున్నది. కాఫీ త్రాగడం ముగించి కప్పు నేలమీద వుంచి ఆయన కిటికీ పక్కకువెళ్ళి వీధిలోకి చూస్తూ నిలబడ్డాడు.

రోడ్డుమీద జనం చాలా పలుచగా తిరుగు తున్నారు. వర్షం ఇంకా వడుతూనే వుంది. ఒక గొడుగులో ఇద్దరు పసిపిల్లలు నడుస్తూ వెళ్ళిపోయారు. కూరలమ్మే మనిషి ఒకామె రక రకాల కూరగాయల పేర్లు వరసగా చదువుకుంటూ నడిచి పోతున్నది. రెయిన్‌కోటు ధరించి మొహం గుర్తుపట్టడానికి వీలు లేకుండా టోపీ ధరించిన ఒక వ్యక్తి బురదలో నడుస్తూ వెళ్ళాడు. వీధి చివరినుంచి ఒక రిక్షా వస్తున్నది. రిక్షా పైటాపు వేసివున్న కారణంగా లోపల ఎవరున్నారో తెలియలేదు. ఆ రిక్షాలోవున్న వస్తువులు ధనంజయరావుదృష్టిని ఆకర్షించాయి. నాలుగైదు పచ్చి వెదుళ్ళు.....ఒకకుండ. ధనంజయరావు అలాగే చూస్తూ నిలబడిపోయాడు. రిక్షా ముందుకు కదిలి వెళ్ళిపో తున్నది. ధనంజయరావు నిట్టూర్చాడు. ఎవరి కీ లోకం నుంచి నిష్క్రమణ లభించిందో! ఎవరు, తనవా రందరినీ వెనక మిగిల్చి ఎక్కడికో, ఏమీ తెలియని చోటికి అనంతయాత్ర సాగించారో!

ఆయన వాలు కుర్చీలో వీలుగా విశ్రాంతిగా కూర్చున్నాడు. బయట ఇంకా వర్షం కురుస్తూనే ఉంది. అయితే ఇందాకటిలాగా మరీ కుంభవృష్టి ఏమీ లేదు. ఉండి ఉండి జల్లు పడుతున్నది. చల్లని గాలిమాత్రం విసురుగానే వస్తున్నది.

ధనంజయరావు కళ్ళు మూసుకున్నాడు. ఆయన మనసులో ఇందాకటి దృశ్యమే—రిక్షా, అందులో పచ్చి వెదుళ్ళూ, కుండ—కనిపిస్తున్నది. మనసంతా ఉన్నట్టుండి అకారణంగా బరువెక్కినట్టయింది. ఆ చచ్చిపోయిన వ్యక్తి ఎవరో! ఎంత వయస్సుంటుందో! ఆడమనిషో, మగవాడో! ఇంత వర్షంలోనూ అన్ని పనులూ శాస్త్రోక్తంగా జరగక తప్పదు కదా! పాపం! పోయినవాడిది బాధ కాదు. వెనక ఈ కర్మకాండ అంతా యధావిధిగా జరపవలసిన వాళ్ళది అసలు బాధ.

ఆయన మనసంతా మేఘావృతమైన ఆకాశం లాగే తయారయింది. ఏవేవో అర్థంలేని దృశ్యాలూ, ఆలోచనలూ చెలరేగి మనస్సాగరాన్ని కల్లోలపరుస్తున్నాయి.

ఆయన ఉన్నట్టుండి వసంత నుద్దేశించి ''అమ్మడూ! ఏదీ, ఇందాకటి లెక్క ఇలా తీసుకురా! చేసి చూపిస్తాను......'' అన్నాడు.

ఆ అమ్మాయి గబుక్కున లెక్కల నోట్సు పుస్తకం తెచ్చి తాతగారికి అందించి, ''నువ్వు పెద్ద పెద్ద ఇంగ్లీషు లెక్కలు నిముషాని కొకటి చేసి పారేయ గలవు. నాకేమో ఈ లెక్కలే రావు. నువ్వేమో ఎగ తాళి చేస్తావు. అందుకే నీకు చూపించ నెప్పుడూ'' అన్నది.

ధనంజయరావు నవ్వి, ''ఇంక ఎప్పుడూ ఎగ తాళి చెయ్యనులే. అయినా నువ్వూ ఏదయినా తెలి యకపోతే అడిగి తెలుసుకోవాలి గాని, నేను ఎగతాళి చేస్తానని ఉడుక్కుంటే చదు వెలా వస్తుందీ?'' అన్నాడు. తర్వాత అయిదు నిముషాలసేపు ఆ లెక్క సాధించే విధానమూ, స్టెప్స్ క్రమంగా వెయ్యడమూ, అంతా వివరించి చెప్పాడు. అప్పు డా పిల్ల తన నోటు పుస్తకం తీసుకుని వెళ్ళి యధాప్రకారం చాపమీద కూర్చుని ఇతర పాఠాలు చదువుకోవడం ప్రారంభిం చింది.

ధనంజయరావు పంతులుకు అకారణంగా నిట్టూర్పు వచ్చింది. నిట్టూర్చి కుర్చీలో వెనక్కు వాలి కళ్ళు మూసుకున్నాడు. విశ్వనాథం వచ్చేవేళ అయింది. నెమ్మదిగా కర్ర తాటించుకుంటూ నడిచి వస్తాడు. నిజానికి ఆయనకు ఆ చేతికర్ర అవసరం బొత్తిగా లేదనే చెప్పాలి. అయినా అది పెద్ద మనిషి తరహాకు చిహ్నమని చెప్పాడు విశ్వనాథం ఒకసారి. ఆయన వస్తేనేగాని తనకు ఏమీ బాగుండ దివాళ. ఆ పెంకుటింట్లో పంచలో వాలు కుర్చీలో ఏమీ తోచక కూర్చోవడం తప్పించి ఆయన చేసే ఘనకార్యం మాత్రం ఏముంది గనుక? అదీగాక విశ్వనాథం ఈ

మ్మాత్రపు వర్షానికీ, జల్లుకూ జంకడు కూడా. ఉత్తరీయం పైన వేసుకుని ఎంత దూరమైనా వెళ్లగలడు. అసలే చువ్వవంటి మనిషేమో పాము పాకినట్టు నడిచి పోగలడు. వర్షంలో తడిస్తే జలుబూ, జ్వరమూ వంటివి వస్తాయేమోనని ఏమాత్రమూ భయపడడు. అంతంతమాత్రపు ఎండా వానలకు తేలికగా తట్టుకోగలడు. తన విషయం మాత్రం అలా కాదు. ఈమాత్రపు జల్లులో తడిసినా, కొంచెం ఎండవేళప్పుడు నడిచినా గాజుకాయవంటి తన శరీరం తట్టుకోలేదు.

ధనంజయరావుకు మరో విషయం గుర్తుకు రాగానే నవ్వు వచ్చింది. విశ్వనాథం గురించి చాలా తమాషా అయిన విషయం ఒకటి ఉంది. ఆయన తన సర్వీసులో ఎన్ని గొడుగులు కొన్నాడో లెక్కలేదు. కాని చిత్రమేమిటంటే కొన్న ప్రతి గొడుగూ అయిదు రోజులకుమించి ఆయన దగ్గర ఉండేది కాదు. అయిదు రోజుల వ్యవధిలో ఆయన తన చేతిమీదుగా కొన్న ప్రతి గొడుగూ పోవడం ఖాయ మన్నమాట. అందుకే ఇటీవలి కాలంలో ఆయన అసలు గొడుగులు కొనటమే మానివేశాడు.

ఆయన లేచి బల్లమీది ఫ్లాస్కులో కాఫీ ఎంత ఉందో చూశాడు. ఫరవాలేదు. తాను మరి కొంచెం తాగవచ్చు. అప్పటికీ విశ్వనాథానికి సరిపడ అందులో ఇంకా కాఫీ మిగిలే ఉంటుంది.

ఫ్లాస్కులోనుంచి కప్పులోకి కాఫీ వంచుకుని తిరిగి దాని మూత సరిగా ఉంచి వెనుదిరుగుతూ ఉండగా వరండాలో అడుగుల చప్పుడు వినిపించింది. ఎవరో చెప్పులు విడుస్తున్నారు. "విశ్వనాథమే అయి ఉంటాడు. మిగిలిన కాఫీ కూడా కప్పులో పోసి ఉంచుదాం. ఇద్దరమూ ఒక్కసారే తాగవచ్చు" అనుకుంటూ తలఎత్తి చూసేసరికి, గుమ్మం ఇవతల పీచుపట్టాకు కాళ్లు తుడుచుకుంటున్న రాజశేఖరం కనిపించాడు.

అతని మొహం ఎందుకో కాంతి విహీనమై ఉంది. అతడు తండ్రిని చూసి, ఏదో చెప్పబోయి నోట మాట రానివాడిలా శిలావిగ్రహంలా నిలబడి పోయాడు.

ధనంజయరావుపంతులు "అదేమిటి రా? అలా నిలబడిపోయావేం? ఏమిటి సంగతి? కోడలి కెలా ఉంది?" అన్నాడు ఆదుర్దాగా.

రాజశేఖరం కొన్ని అడుగులు ముందుకు వేసి తడబడుతూ, "నాన్నా! మరి విశ్వనాథంగారు..... పోయార్ట...." అన్నాడు.

ధనంజయరావు పంతులు, "ఎక్కడికి?" అని అడగబోయి అంతలోనే గుండుదెబ్బ తిన్నవాడిలా బిగుసుకుపోయాడు. చేతిలోవున్న పింగాణీ కప్పు క్రింద పడి ముక్కలు ముక్కలైపోయింది.

ఆయన కనురెప్పపాటు లేకుండా కూర్చుని ఉండగా రాజశేఖరం నెమ్మదిగా చెప్పాడు "నిన్న సాయంకాలందాకా బాగానే ఉన్నారట నాన్నా! చక్కగా అందరితో కబుర్లు చెబుతూ కూర్చుని హాయిగా భోజనం చేశారట. పడుకోబోతూ కొంచెం గుండె నొప్పిగా ఉందన్నారట. అంతే...... గంటల్లో ముంచుకొచ్చేసిం దిట. ఒంటిగంటవేళకు లేచి కిటికీ తలుపులు తెరవమని అడిగారట. ఆ తర్వాత స్పృహ తప్పిం దిట—ఒంటిగంటన్నరకు అంతా అయిపోయిం దిట......"

ధనంజయరావు పంతులు కొయ్యబారిపోయి కూర్చున్నాడు. ఇదంతా విన్నాడో లేదో కూడా తెలియదు.

* * *

ఆయన ఉలిక్కిపడ్డాడు. "గేటు మూసేవేళ అయింది బాబూ! మీరిక లేస్తారా?" అంటున్నాడు పార్కు జవాను, ఎదురుగా నిలబడివుండి.

ఆయన తలవూపి నిట్టూర్చి చేతికర్ర అందుకుని లేచి ముందుకు నడిచాడు. పార్కులో బల్లలన్నీ ఖాళీగా ఉన్నాయి. అందరూ ఇళ్లకు వెళ్లిపోయినట్టున్నారు. అంటే బాగా పొద్దు పోయిందన్నమాట.

ఆయన పార్కులోనుంచి ఇవతలికి వచ్చి నెమ్మదిగా నడవటం ప్రారంభించాడు. రోడ్డుపక్కన దీపాల వెలుగు మందంగా వుంది. దూరంగా రైలొకటి కూత వేసుకుంటూ పోతున్నది. దూరాని కా రైలు దీపాల తోరణం కదులుతున్నట్టు కనిపిస్తున్నది.

ఆయన ఇంటికి చేరుకునేసరికి కూతురూ, కొడుకూ, మనుమరాలూ వరండాలో నిలబడి ఆయన కోసం ఎదురు చూస్తున్నారు. గేటు తెరుచుకుని లోపలికివస్తూ ఆయన కళ్లబడగానే తేలికగా నిట్టూర్చి "అమ్మయ్య" అనుకున్నారు వారు.

అనూరాధ తండ్రికి ఎదురువెళ్ళి చేతికర్ర అందుకుని, "ఇంతసేపు ఉన్నావేం నాన్నా? మేము ఇందాకటినుంచీ ఎంతగా దిగులుపడ్డామో తెలుసా?" అన్నది.

ధనంజయరావుపంతులు బదులేమీ చెప్పకుండా కుర్చీలో కూలబడ్డాడు.

అనూరాధ మళ్ళీ, "పాపం! ఆ చక్రపాణి బొత్తిగా చిన్నవాడు. వేరే పెద్ద దిక్కు కూడా ఎవరూ ఉన్నట్టులేరు. తల్లి అసలే లేదనుకో...... నువ్వు అక్కడ ఉండటమూ మంచిదే అయింది. ఏదో పాపం, ఆ కుర్రవాడికి కొంచెం ధైర్యం.....అయినా నువ్వు 'ఆలస్యంగా వస్తాన'ని చెప్పి వెళ్ళలేదు మరి.... అందుకని కొంచెం గాభరా పడ్డాం......అంతే"...... అన్నది.

రాజశేఖరం, "ఎవరో దూరపు బంధువులు కొందరు వచ్చినట్టున్నారు కదూ నాన్నా" అని అడిగాడు.

ధనంజయరావు పైపంచెతో మొహం తుడుచుకుంటూ "ఏమో మరి......నాకు తెలీదు. నే నక్కడికి వెళ్ళలేదు.,...." అన్నాడు.

అనూరాధ లోపలి గదిలోకి వెళ్ళబోతున్నదల్లా ఆగిపోయి వెనక్కు తిరిగింది. రాజశేఖరం ఆశ్చర్యంతో కళ్ళు పెద్దవిచేసి "అదేమిటి? నువ్వు వాళ్ళింటికి వెళ్ళలేదూ? మరి పొద్దుటినుంచీ ఎక్కడున్నావు?" అని అడిగాడు.

ధనంజయరావు పిచ్చి చూపులుచూస్తూ తలవూపి "వెడదామనే బయలుదేరాను పొద్దున.....కాని, అక్కడికి వెళ్ళలేదు. అక్కడా అక్కడా తిరిగి సాయంకాలం పార్కుకు వెళ్ళి కూర్చుని ఇప్పుడే లేచి వస్తున్నాను" అన్నాడు.

అనూరాధా, రాజశేఖరం ఇద్దరూ కొద్ది క్షణాలపాటు మ్రాన్పడి నిలుచుండిపోయారు. తర్వాత అనూరాధ నెమ్మదిగా "అదేమిటి నాన్నా! అలాటి పని చేశా వేమిటి? ఆ పిల్లవాడు మరీ చిన్నవాడు కదా! అతనికి వచ్చిన ఆపద సామాన్యమైంది కూడా కాదు. నువ్వు తప్ప వోదార్చి, ధైర్యం చెప్పగలవారెవరున్నారు చెప్పు అతనికి? అదీగాక విశ్వనాథంగారు నీకు ఎటువంటి స్నేహితుడు! ఎవరైనా వింటే బాగుండదు కూడాను. పెద్దవాడివి. ఇలా చెయ్యవలసింది కాదు నువ్వు" అన్నది.

తర్వాత ఒక అరగంట గడిచాక స్నానం ముగించుకుని భోజనానికి కూర్చుంటూ ధనంజయరావు కూతురివంక చూసి "మీ వదిన కెలా వుంది, ఇవాళ?" అని అడిగాడు.

ఆమె నెయ్యి వడ్డిస్తూ, "ఒకటి రెండు రోజులలో ప్రసవం అవుతుందన్నారు. ఏమీ గాభరా అక్కర్లేదన్నారు. వదిన కూడా ధైర్యంగానే ఉంది. కాన్పు ఎడం కావటంతో మనకి కొంచెం భయం...... అంతకంటె మరేం లేదు......" అని చెప్పింది.

ధనంజయరావు ఏమీ మాట్లాడకుండా నిశ్శబ్దంగా కూర్చుని భోజనం చేశాడు. తర్వాత వెళ్ళి హాల్లో వాలుకుర్చీలో కళ్ళు మూసుకుని పడుకున్నాడు.

అనూరాధ వంట ఇంటిలో పనులన్నీ ముగించుకుని ముందు హాల్లోకి వచ్చి తండ్రి వంక చూసి నివ్వెరపోయి, 'నాన్నా' అంటూ తట్టిలేపింది.

ధనంజయరావు ఉలికిపడి లేచి కళ్ళు నులుముకున్నాడు. "ఆ గదిలో నీ పక్క సరిచేశాను. వెళ్ళి పడుకో నాన్నా!" అన్నది అనూరాధ.

ఆయన "అలాగే" అని లేచి ఆ గదిలోకి వెళ్ళబోతూ మళ్ళీ ఆగి, "అన్నట్టు అమ్మాయీ! మన రాజు పక్క కూడా ఇవాళ నా మంచం పక్కనే వెయ్యి......వాణ్ణి ఇవాళ్టికి ఈ గదిలోనే పడుకోమని చెప్పు" అన్నాడు.

అనూరాధ ఆశ్చర్యంతో తలవూపి "అలాగే" అన్నది.

ఒక పావుగంట తర్వాత రాజశేఖరం, తండ్రి మంచం పక్కనే మరొక మంచం మీద పడుకుని నిద్రపోతున్నాడు. కిటికీలోనుంచి చల్లనిగాలి వాడియైన బాణపు మొనలాగా పదునుగా వస్తున్నది.

ధనంజయరావు కుమారుడి వంక చూశాడు. అతడు నిశ్చింతగా నిద్రపోతున్నాడు. ఆయనకు రోజూ ఈ పాటికి నిద్ర బరువుతో కనురెప్పలు వాలిపోతూ ఉండేవి. అయినా ఇవాళ నిద్ర సత్యాగ్రహం చేసినట్టున్నది. కళ్ళు గట్టిగా మూసుకుని ఏ ఆలోచనలూ లేకుండా నిద్రపోదామని ప్రయత్నం చేసి విఫలుడైనా డాయన.

కళ్లు మూసేసరికి రోజూ చేతికర్ర వూతగా నెమ్మదిగా నడిచివచ్చే విశ్వనాథమే కనిపిస్తున్నాడు. ఆయన అంతదూరమూ నింపాదిగా నడిచివచ్చి ఈ ఇంటి వీధిగుమ్మం దిగుతూ పడబోయేవాడు. అలా రోజూ క్రమం తప్పకుండా జరుగుతూ ఉండేది. వీధి గుమ్మం మెట్లలో పైనున్నది మిగిలిన వాటికంటె ఎత్తయినది కావడమే దానికి కారణం. తర్వాత ఆ మెట్టును గురించే గునుస్తూ "ఆ ఒక్క మెట్టూ అలా ఎత్తుగా ఎందుకు కట్టించావోయ్. రోజూ నే నిక్కడ పొరపాటుపడుతూనే ఉంటాను......" అంటూ ముందుకు నడిచి వచ్చేవాడు. తర్వాత నింపాదిగా చేతికర్ర ఒక మూలవుంచి, చెప్పులు విప్పి వసంత తెచ్చి అందించిన నీళ్లతో కాళ్లు కడుక్కుని పై పంచెతో తడి అద్దుకుని, అప్పుడు వచ్చి కుర్చీలో కూర్చుని, "ఏదీ? నా కోసం ఏం ఉంచావూ?" అని అడిగేవాడు. ధనంజయరావు లోపలినుంచి కాఫీ తెప్పించి "అంతే. ఒట్టి కాఫీతోనే సర్దుకుపోవాలి......" అనే వాడు. "గూడ్" అంటూ కాఫీ కప్పు అందుకునేవాడాయన. తర్వాత మొదలయ్యేది అంతులేని సంభాషణ. ఇలా కొన్ని సంవత్సరాలుగా క్రమం తప్పకుండా జరుగుతూ వచ్చింది. మరి ఇవాళ......?

తన ఇంట్లో నవ్వుతూ, పేలుతూ కూర్చుని కులాసాగా గడపవలసిన వాడల్లా చల్లగా బిగుసుకు పోయి ఉంటాడు. కదలికలేని ఆ శరీరాన్ని గోడకు ఆనించి కూర్చోబెట్టి ఈ చలిలోనే చల్లని నీళ్లతో స్నానం చేయించి ఉంటారు. మామూలు రోజులలో అయితే ఒంటిమీద చల్లని నీళ్లు పడితే గజగజ వణికే విశ్వనాథం ఇప్పుడు ఏమీ అభ్యంతరం చెప్ప కుండా నిశ్చలంగా ఉండి ఉంటాడు. "ఎంత చల్లని నీళ్లయినా మీ ఇష్టం వచ్చినన్ని పోసి నన్ను స్నానం చేయించండి" అన్నట్టు రాతిబొమ్మలా కూర్చుండి పోయాడేమో! తర్వాత ఆ వెదుళ్లు చీల్చి వీలుగా కట్టిన ఏడుకట్ల సవారీ మీద అతన్ని పడుకోబెట్టి నలుగురూ మోసుకుంటూ సాగిపోయి ఉంటారు. ఆ వెదుళ్లు అతని శరీరానికి ఒత్తుకోవూ?

ధనంజయరావు బలవంతాన ఆలోచనలకు ఆనకట్టవేసి కిటికీలోనుంచి చూశాడు, బయట చీకటి, ఆకాశంలోనుంచి ఏదో అదృశ్య రాక్షస హస్తం సిరా ఒలకబోసినట్టు చిక్కగా వ్యాపించివుంది.

ఆయనకు హఠాత్తుగా గుండెలు దడదడ లాడాయి. విశ్వనాథం తనకన్నా చిన్నవాడు. తనకన్నా ఆరోగ్యవంతుడనే చెప్పాలి కూడా. అయినా ఎంత హఠాత్తుగా ఇదంతా జరిగిపోయింది? వ్యవధి లేకుండా సూచన అయినా లేకుండా మృత్యువు వచ్చి మీదపడి కబళించుకుపోవడం ఎంత చిత్రం?

తనకు నిద్ర రావడంలేదు. ఒస్తే బాగుండి పోను. ఈ ఆలోచనల సుడిగుండంలోపడి మునకలు వేయడం తప్పుతుంది. అయినా నిద్రకూ, చావుకూ తేడామాత్రం ఎంత? ధనంజయరావు గుండెలు జల్లు మన్నాయి. ఆయన ఒక్కక్షణం "నిద్రపోతున్న శేఖరాన్ని లేపి కూర్చోబెడదామా" అనుకుని మళ్లీ అంతలోనే ఆ ప్రయత్నం విరమించుకున్నాడు.

*　　　*　　　*

తెల్లవారుతూవుండగా మెలకువ వచ్చి కళ్లు విప్పి చూచేసరికి కిటికీలోనుంచి ఆకాశం నిర్మలంగా కనిపించింది. ధనంజయరావుకు ఒళ్లంతా నొప్పులుగా అనిపించింది. రాత్రిఅంతా సరియైన నిద్ర పట్టక బాధ పడ్డాడాయన. తెల్లవారుజాము వేళకు నిద్రాదేవత కొంచెం దయతలచింది కాని, ఆ నిద్ర అంతా ఏవేవో అర్థంలేని కలలతో చికాకు కలిగించింది. తెల్లవారిన తర్వాత తీరికగా కూర్చుని జ్ఞాపకం చేసుకుందా మనుకుంటే ఆ కలలలో ఒక్కటి గూడా గుర్తురాలేదు.

ఆయన ఆవులించి ఒళ్లు విరుచుకుని లేచి లోపలి గదిలోకి వెళ్లాడు. అనూరాధ తలఎత్తిచూసి ఏమీ మాట్లాడకుండా వూరుకున్నది. ఆయన నేరుగా పెరటిలోకి వెళ్లి దంతధావనం ముగించి లోపలికి రాగానే కాఫీ అందించి, "నేను పెందరాళే వంట ముగించుకుని ఆసుపత్రికి వెడతాను నాన్నా! నువ్వు స్నానంచేసి విశ్వనాథంగారి ఇంటికి వెళ్ళు......ఆ అబ్బాయి తెల్లవారుతూనే మన ఇంటికి వచ్చాడు. పాపం! బొత్తిగా ఢీలాపడిపోయి ఉన్నాడు!" అన్నది.

ధనంజయరావు ఉలికిపడి "చక్రపాణి మన ఇంటికి వచ్చాడా?" అన్నాడు ఆశ్చర్యంతో. తర్వాత ఒక్క క్షణం ఆగి "మరి నన్నెందుకు లేపలేదు?" అని అడిగాడు.

ఆమె గిన్నెలు సవరిస్తూ కొన్ని క్షణాలు మెదలకుండా వూరుకుని మళ్లీ "నాకు జాలి వేసింది నాన్నా!

నేను మెలకువ రాగానే వరండాలోకి వెళ్ళేసరికి బిక్క మొహం వేసుకుని వీధి గుమ్మంముందు అటూ యిటూ తిరుగుతూ కనిపించాడు. నేను అన్నయ్యను లేపి వెళ్ళి మాట్లాడ మన్నాను. అన్నయ్య అతనితో మాట్లాడి పంపించేశాడు'' అన్నది.

రాజశేఖరం లోపలికి వస్తూ, ''డబ్బు కావాల్సి వచ్చిందిట నాన్నా! మొదట్లో 'నువ్వు రాలేదే'మని అడిగాడు. 'ఆయనకు ఈ విషయం విన్నప్పటినించీ మనసు ఏమీ బాగుండలేదు. అంతకంటె మరేమీ లేద'ని చెప్పి సర్దేశాను. ఇవాళ వెళ్ళు నాన్నా! లేకపోతే బాగుండదు. మధ్యాహ్నం నుంచీ ఆఫీసులో పని పూర్తి చేసుకుని నేనూ వస్తా నక్కడికి'' అన్నాడు.

ధనంజయరావు పంతులు కాస్సేపు నిశ్శబ్దంగా కూర్చుని తర్వాత లేచి ముందు గదిలోకి పోతూ ''రాజా! ఇలా రా, ఒక్కసారి......'' అన్నాడు. రాజశేఖరం తండ్రి ననుసరించాడు.

ఆయన తన గదిలోకి వెళ్ళి ''డబ్బు ఎంత కావా లన్నాడు?'' అని ప్రశ్నించాడు.

రాజశేఖరం ''రెండువందలు కావా లన్నాడు. నేను నిన్ను అడిగి మధ్యాహ్నంనుంచీ తీసుకు వస్తానని చెప్పాను'' అన్నాడు.

ధనంజయరావు చిరాకుపడుతూ ''దీనిక్కూడా నా అనుమతి కావాల్సిందేనా? అయినా నువ్వు ప్రతిదానికీ ఇక నన్ను సంప్రదించ నక్కరలేదని ఎన్నిసార్లు చెప్పానురా నీకు? మధ్యాహ్నం వచ్చేటప్పుడు 'డ్రా' చేసుకురా. నే నక్కడే ఉంటాను'' అన్నాడు.

రాజశేఖరం తల వూపి వెళ్ళిపోయాడు.

తర్వాత ధనంజయరావు పంతులు స్నానం ముగించుకుని కుర్చీలో కూర్చున్నాడు. అనూరాధ ముందు గదిలోకి వచ్చి, ''అదేమిటి నాన్నా! ఇంకా కూర్చున్నావేం? వెళ్ళకూడదూ అక్కడికి?'' అన్నది.

ఆయన పరధ్యానంగా తలవూపి ''వెడతాను లే..'' అని బదులు చెప్పాడు. కాని మరో అరగంట తర్వాత కూడా ఆయన బయలుదేరలేదు. ఆయన మనసంతా 'ఫలానా' అని చెప్పరాని విచిత్రావస్థకు లోనై వుంది. రెండు మూడుసార్లు లేచి బయలు దేరబోయి, శక్తి చాలని వాడిలా మళ్ళీ కూర్చుండిపోయాడు. ఎందుకో కాళ్ళలో వణుకు పుట్టుకుని వస్తున్నది. అకారణంగా గుండెలు దడదడలాడుతున్నాయి. మనసంతా మాటిమాటికీ బరువెక్కిపోతున్నది. ఏమీ ఆలోచించకుండా కళ్ళు మూసుకుని వూరికే నిట్టూరుస్తూ కూర్చోవా లనిపిస్తున్నది.

అనూరాధ తన పనులన్నీ ముగించుకుని ఆసుపత్రికి వెళ్ళేందుకు తయారై వచ్చి ఇంకా అలాగే కూర్చునివున్న తండ్రిని చూసి నివ్వెరపోయింది. ''అదేమిటి నాన్నా? నువ్వింకా వెళ్ళనే లేదా?'' అని అడిగింది.

అప్పుడాయన చివాలున లేచాడు. త్వర త్వరగా చేతికర్ర అందుకుని ''ఇదుగో వెడుతున్నాను'' అంటూ పెద్ద పెద్ద అంగలువేస్తూ వరండా మెట్లు దిగి వీధి తలుపు దగ్గరికి లాగి రోడ్డుమీదికి వెళ్ళాడు.

* * * *

ఆ ఇల్లు అసలే చిన్నది. అక్కడే చిన్న పంచలో ఒక ప్రక్క మంత్రాలు వినిపిస్తున్నాయి. చక్రపాణి తడిపంచె కట్టుకుని కర్మకాండ నిర్వహణలో మునిగి తేలుతున్నాడు. అతని భార్య చాలా చిన్నపిల్ల. ఆమె అటూ, ఇటూ దిగులుగా తిరుగుతూ కావలసిన వస్తువులు అందిస్తున్నది. ఇద్దరు మధ్యవయస్సు వ్యక్తులు —ఎవరో దూరపు బంధువులు కాబోలు—అరుగుమీద కూర్చుని ఉన్నారు. లోపల మరికొందరు ఆడవాళ్ళు వంట పనిలో ఉన్నారు. పదిహేను, పదహారేళ్ల కుర్రవాడొకడు అటూ యిటూ తిరుగుతున్నాడు.

ధనంజయరావు పంతులును చూడగానే చక్రపాణి మొహం విప్పారింది. అతడు అక్కడినుంచే ''నిర్మలా'' అని భార్యను కేకవేసి పిలిచి ''ఆయన వచ్చారు చూడు... ఎక్కడైనా కూర్చోబెట్టు'' అని చెప్పాడు.

ఆమె లోపలినుంచి పాత వాలుకుర్చీ తెచ్చి గుమ్మం ప్రక్కనే వేయబోతూవుండగా ధనంజయరావు వారించి ''అమ్మా! అవేమీ వద్దులే......నువ్వు నీ పని చూసుకో. నే నిక్కడ కూర్చుంటాలే'' అన్నాడు. ఆయనకు ఇంత వయసు వచ్చినా ఇటువంటి సందర్భాలలో ఎలా ప్రవర్తించాలో, ఏమి మాట్లాడాలో బొత్తిగా తెలియదు. పైగా ఆ పాత వాలుకుర్చీ ఆమె వేసిన చోటనే వేసుకుని కూర్చుంటూ ఉండేవాడు విశ్వనాథం. ధనంజయరావుకు అక్కడ కూర్చునేందుకు మన సొప్పలేదు. గుండెలు ఎందుకో జల్లుమన్నాయి.

ఆ ఇద్దరు వ్యక్తులూ ధనంజయరావు వంక చూశారు. నిన్నటినుంచీ చక్రపాణి, అతని భార్యా కొన్ని వందలసార్లు ''ఆయన రాలేదే, ఇంకా!!'' అనుకోవడం

వారు విన్నారు. అందుకనే "ఇంత ముఖ్యమైన మనిషి అసలైన సమయం తప్పించి ఇవాళ వచ్చాడేమిటా?" అని చూస్తున్నారు వారు.

ధనంజయరావు కేమీ తోచలేదు. కాస్సేపు ఆకాశం వంక చూశాడు. పలుచ పలుచగావున్న మబ్బులు క్రమ్ముకుని వస్తున్నాయి. వర్షం కురిస్తే బాగుండిపోను. అయినా ఇప్పట్లో వర్షం కురిసే సూచన అంతగా కానరాలేదు.

ఆయన మూలగా పడివున్న సుద్దముక్క చేతి లోకి తీసుకుని అరుగుమీద గుండ్రంగా ఒక సున్నా గీచాడు. ఇంకా అంతటితో ఆగక గీతలు గీయడం ప్రారంభించాడు. చివరకుచూస్తే అవి పులిజూదం గీతలు. అవతలి వ్యక్తులిద్దరూ ఆశ్చర్యంతో చూస్తున్నారు.

ధనంజయరావు పంతులు అరుగు ప్రక్కగా క్రిందికివంగి చిన్న చిన్న రాళ్లు ఏరి చేతిలోకి తీసుకున్నాడు. అవి మేకలు. మరికొంచెం పెద్దరాళ్లు మూడు ఏరి తీసుకున్నాడు. అవి పులులు.

తర్వాత ఆ ఇద్దరిలో ఒకరి నుద్దేశించి పూడుకుపోతున్న కంఠస్వరంతో 'ఆ ఇది ఆడటం వచ్చా మీకు?" అని అడిగాడు.

ఆ వ్యక్తి కళ్లు పెద్దవిచేసి చూసి తల అడ్డంగా వూపాడు. తర్వాత ధనంజయరావు చుట్టూ చూసి దగ్గరలో నిలబడివున్న ఆ కుర్రవాణ్ణి పిలిచాడు. అతనికి ఆ ఆట వచ్చులా వుంది. వెంటనే వచ్చి కూర్చున్నాడు.

ఇద్దరూ పులి జూదం ఆడటం ప్రారంభించారు. ఆ కుర్రవాడు పులులు తీసుకున్నప్పుడు ధనంజయరావుగారి మేకలన్నీ వెంట వెంటనే బలి అయిపోయాయి. అతడు మేకలు తీసుకున్నప్పుడు పులులను ఇట్టే కట్టివేసేవాడు. ఆవిధంగా దాదాపు ఒక అరగంటసేపు ఆ ఇద్దరు వ్యక్తులూ విరక్తి నిండిన కళ్లతో చూస్తూ ఉండగా, ఆయన కోసమని నిర్మల తెచ్చి ఉంచిన కాఫీ చల్లగా చల్లారిపోగా, ఆటసాగింది.

అంతలో తలుపు తీసుకుని రాజశేఖరం లోపలికి వచ్చాడు. అతడు తండ్రిని చూసి కొయ్యబొమ్మలా కొన్ని క్షణాలు చేష్టలుడిగి నిలుచుండిపోయి తర్వాత తేరుకుని విసురుగా ముందుకు వెళ్లి ఆ రాళ్లన్నిటినీ పోగుచేసి క్రిందికి విసిరి పారేసి, ఆ గీతలన్నిటినీ తుడిచివేసి, ఆ" ఏమిటి నాన్నా! మరీ చిన్నపిల్లలై పోతున్నా రేమిటి?" అన్నాడు ప్రక్కవారికి వినిపించకుండా.

అంతలో హఠాత్తుగా ధనంజయరావుకు దుఃఖం పొంగివచ్చింది. ఆ మనసులో ఎన్నో అగ్ని పర్వతాలు బద్దలైనట్టూ, ఎన్నో సముద్రాలు ఘోషించినట్టూ అయింది. కళ్లవెంట జలజలమని అశ్రువులు ప్రవహించాయి. ఆయన ఉన్నట్టుండి మొహం చేతులతో కప్పుకుని 'బావురు' మన్నాడు.

రాజశేఖరం చక్రపాణిని చాటుకు పిలిచి డబ్బు చేతుల్లోవుంచి, "ఆయనకు నిన్నటినుంచీ మనస్థిమితం లేదు. నువ్వేమీ అనుకోకు" అని చెప్పాడు. చక్రపాణి తలవంచుకుని నిలబడిపోయాడు.

తర్వాత రాజశేఖరం తండ్రి చేయి పట్టుకుని లేవదీస్తూ "పద నాన్నా! ఇంటికి పోదాం. మళ్లీ సాయంకాలం వద్దాంలే" అన్నాడు.

ధనంజయరావు లేచి కళ్లు తుడుచుకుని ఒక విధంగా తేలిక పడిన మనసుతో నిట్టూర్చి చక్రపాణి వంక ఒక్కక్షణం చూసి కొడుకువెంట బయటికి నడిచివెళ్లిపోయాడు.

వారిద్దరూ ఇంటికి వెళ్లేసరికి అనూరాధ గుమ్మంలో కూర్చునివుంది. ఆ ఇద్దర్నీ చూడగానే ఆమె లేచి ఎదురువచ్చి "నాన్నా! శుభవార్త...... నీకు మనుమడు.....పండులా ఉన్నాడు.....ఒరే అన్నయ్యా! ఆలస్యంగానైనా మొత్తానికి మొగపిల్లవాడి తండ్రి వనిపించుకున్నావు రా....బొత్తిగా ఇన్నాళ్ల నుంచీ అంతా 'మైనస్సే' అని బాధపడుతున్నావు. ఇప్పుడు 'ప్లస్' వచ్చి చేరి సరి సమానమైందిలే......" అన్నది గుక్క తిప్పుకోకుండా.

ధనంజయరావు వాలు కుర్చీలో కూర్చున్నాడు. మనసులో గందరగోళం తగ్గి ప్రశాంతత నెలకొన్నది. ఉన్నట్టుండి తలపంకించి 'విశ్వనాథం' అనుకున్నాడు.

అది పైకి వినిపించి మిగిలిన ఇద్దరూ ఆయన ఉద్దేశం అర్థం చేసుకున్నారు. వాళ్లు కూడా తేలికగా నిట్టూర్చారు. బయట మబ్బు విడిచిన బంగారురంగు ఎండ ఆహ్లాదకరంగా వ్యాపిస్తున్నది.

# చిన్నయసూరి సూత్రాంధ్ర వ్యాకరణము

శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రి

'సూరిగారి సూత్రాంధ్ర వ్యాకరణములు' అను శీర్షికతో 1940 నవంబరు భారతిలో నేనొక వ్యాసం ప్రకటించియున్నాను. ఆంధ్ర సాహిత్య పరిషత్తులో కార్యకర్తగా ప్రవేశించిన ఒకటిన్నర సంవత్సరముల కా వ్యాసము వ్రాయుట జరిగినది. త్రిలింగ లక్షణ శేషము, శబ్దరత్నాకరము బయలుదేరుటకు మూలము, బ్రౌన్‌దొర, గాజుల లక్ష్మీనరసింహులు సెట్టిగార్ల ప్రోత్సాహముతో ప్రారంభించి 1848 మొదలు 1861 వఱకు ఒక్క చేతిమీఁద పనిసాగించి, అసమగ్రముగా నిలిచిపోయిన చిన్నయసూరి నిఘంటు వ్రాతప్రతులలోని విషయములు అని యా వ్యాసములో దిఙ్మాత్రముగ సూచించియున్నారు. ఆనాఁటికింకను నేను సూరి నిఘంటు ప్రతులలోని ఆంధ్ర వ్యాకరణ సూత్రముల నన్నిటిని సేకరించు పని జరుగలేదు. తరువాత 1942 మొదలు 1946 వఱకు శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటు నిర్మాణ కార్యాలయములో పనిచేయునపు డనుదినము సూరి స్వహస్తముతో వ్రాసికొన్న అకారాది నిఘంటు వ్రాతప్రతులను పరికించుచు, ఆ యా ప్రయోగములందుఁ గానవచ్చెడి విశేషములనుబట్టి సూరి తా నీవఱకు రచించిన సంస్కృతాంధ్ర సూత్రములకు మార్పులు చేర్పులుగా వ్రాసికొన్న సూత్రములు వ్రాసికొని యుంటిని. వానిలోఁ గొన్నిటిని భారతి మూలమున నేఆంధ్ర పాఠక సహృదయుల కందిచ్చుటకు యత్నించుచున్నాను.

1963 లో శ్రీ శ్రీభాష్యం భాష్యకారాచార్యుల వారు త్రిలిఙ్గ లక్షణశేషమును తత్త్వబోధినీ వ్యాఖ్యాసహితముగ ప్రకటించియున్నారు. దానిలో వ్యాఖ్యాతలే సూరిసూత్రములచేతనే గతార్థములగు విషయములను చూపించి త్రి. ల. శేషములోని కొన్ని సూత్రముల వివరణములు అనావశ్యకములనుచు వచ్చి ప్రౌఢ వ్యాకరణ తత్త్వమును నిరూపించినారు. 1964 జూలై భారతిలో శ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారు 'త్రిలిఙ్గ లక్షణ శేషణము' అను పేరితో ఈ మూల వ్యాఖ్యానముల రెండిటిమీఁద విపులమగు విమర్శనము వ్రాసియున్నారు. ఆ విమర్శనములో ప్రౌఢ వ్యాకరణములోని 108 సూత్రములకు చేయవలసిన వివరణలను సవరణలను సూచించియున్నారు. 1964 డిసెంబరులో శ్రీ దువ్వూరి వెంకటరమణశాస్త్రిగారు సూరి బాల వ్యాకరణమునకు 'రమణీయము' అను అన్వర్థనామముగల వ్యాఖ్యానమును రచించి, ప్రకటించి చిన్నయసూరి రచనలలో వెల్లివిరిసెడి లాక్షణిక హృదయమును దలస్పర్శిగ శోధించి వివరించియున్నారు. ఆ గ్రంథావతారికలో శ్రీ శాస్త్రిగారు ప్రసంగవశమున ప్రౌఢ వ్యాకరణములోని సూత్రముల నెత్తికొని, వానికి మూలభూతములయిన సూత్రములు సూరి సూత్రాంధ్ర వ్యాకరణములలో నేవేవి యుండినవో, వాని స్వరూపమును సహేతుకముగ నిరూపించినారు. త్రిలింగ లక్షణ శేషమునకు వ్యాఖ్య వ్రాయునపుడు మిగిలిన సూత్రములనుగూర్చి మరికొన్ని మాట లనుకొందమనియుఁ దెలిపినారు.

ఈ రెండు విమర్శన గ్రంథము లీవిధముగ వెలువడుట యుద్బోధకముగా, సూరి నిఘంటు వ్రాత

ప్రతులనుండి నే నెత్తి వ్రాసికొనియుంచిన సూత్రములు వివరణములు త్రి. ల. శేష రచన కెట్లు మార్గదర్శకములయినవో, నాకుఁ దెలిసినంతవఱకు ఆంధ్ర భాషాభిమానులకుఁ దెలుప వలెననిపించినది. త్రిలిఙ్గ లక్షణ శేషము మొదటి కూర్పులోని ఉపోద్ఘాతము తత్త్వబోధినిలోఁ జేరలేదు. దీని తత్త్వమేమో యెఱుఁగరాదు. ఆ యుపోద్ఘాతములోని కొన్ని వాక్యములు గమనింపవలసియున్నవి. బ. సీ. ఆచార్యులవారు తాము విద్యగరచిన గురువుల నెవ్వరిని, ఎచ్చటను స్మరించినట్లు కనఁబడదు. అది వారికి సంప్రదాయమే యేమో? "తదనంతరము విద్యా విచార తత్పరుండనై కొన్ని హాయనంబులు కడపి, యంత నాంధ్ర శబ్ద రత్నాకరంబను నకారాది నిఘంటు వొకటి వ్రాయనుద్దేశంబుతో గ్రంథశోధనంబు సేయం దొరంకొని.... తుద కిప్పుడు తద్భారతాది గ్రంథ పరిశోధనంబుచే దొరికిన విశేష లక్షణ ప్రయోజనముల నేర్చి కూర్చి త్రిలిఙ్గ లక్షణ శేషంబను నీ యపూర్వ వ్యాకరణమును దీని వ్రాసితిని." ఈ రెండు వాక్యములందును ఆచార్యులవారు వ్రాయుట సాగించినట్లు తెలిపినారే గాని రచించినట్లు తెలిపియుండలేదు. అట్టి వ్రాఁత చిన్నయసూరి కూర్చుకొన్న గ్రంథములనుండియే కావచ్చునేమో యని యనిపింపకపోదు. చిన్నయసూరి నిఘంటు వ్రాఁతప్రతువు నొక్కమాఱు చూచినవారు శ్రీ దువ్వూరి వెంకటరమణశాస్త్రిగారు. బహువత్సరములు పలుమాఱు చూచినవారు శ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారు, తదితర సూ. ని. కార్యకర్తలయిన పండితులును. అట్టి సూరి నిఘంటు వ్రాఁత ప్రతు లీనాఁడు అజ్ఞాత స్థితిలో నెచ్చటనో పదిలముగ నుండుటచే ఆ ప్రతులున్న కాలములో నేను వ్రాసికొనియున్న కొన్ని విషయములు తెలుపవలసి వచ్చినది.

సూరి 1848 మొదలుగ, భారతములోని ఆదిపర్వ మాదిగ కూచిమంచి తిమ్మకవి వఱకుఁగల కవుల ప్రబంధములలోని పదముల నెత్తి వ్రాసికొనినపుడు, యతిప్రాస నిబద్ధములయిన ప్రామాణిక పదములనే యెన్నుకొనినాఁడు. అతనిచూపు కవి ప్రయుక్త శబ్దములందలి ప్రామాణికత్వము వైపునకేగాని, కవి మీఁదికిఁ గాదు. కనుకనే మార్కండేయ పురాణ కర్తయైన మారన యంతటివాని ప్రామాణికత్వమును గూర్చి తెలుపుచు, 'గ్రంథ కారోఽయం లఘ్వలఘ్వోః రేఫయోః వళిప్రాసస్థలే అనాదృత్య కృతి మకరోత్' అని ప్రాసములలో రేఫ శకట రేఫ సాంకర్యముగల రెండు కందపద్యములనుదాహరించినాఁడు. "కూర్మపురాణం బలాక్షణికగ్రంథం బగుటవలన నందలి యుదాహరణంబులు గ్రహింపఁబడ వయ్యె" అనినాఁడు. రంగనాథ రామాయణము బసవ పురాణము భాగవతము— వీనిలో యతిప్రాస నిబద్ధములయిన పదములను ముందుగ గ్రహింపక, నిఘంటు సంపుటములలోఁ దరువాత చేర్చి, తుదిని 'లక్షణము' అను శీర్షికలోఁ కొన్ని పదముల ప్రామాణికత్వా ప్రామాణికత్వములను గూర్చి తానేమేమో చెప్పదలఁచి, కొన్ని పదములను పద్యోదాహృతులను వ్రాసికొనినాఁడు. లాక్షణికులను గాని అలాక్షణికులనుగాని కవులను వారి రచనలను సమానదృష్టితో పరికించి వారి వారి గ్రంథములలోని ప్రామాణిక ప్రయోగములను గ్రహించి, ఆ యా ప్రయోగ విశేషములనుబట్టి క్రొత్త లక్షణముల నాతఁడు సంతరించుకొనుచు వచ్చినాఁడు.

## సూరి రచించిన వ్యాకరణ సూత్రములు

ఆంధ్ర సాహిత్య పరిషత్తువారు 'నారాయణ వనం వకుళాభరణము' అను సూరి శిష్యుల హస్త పుస్తకము (Hand book) నుండి సంగ్రహించి 1931 లో ప్రకటించిన సూరి సూత్రాంధ్ర వ్యాకరణములలోని విషయమునుబట్టి వాని క్రమమిట్లు నిర్ణీతమైనది. 1. పద్యాంధ్ర వ్యాకరణము. 2. సంస్కృత సూత్రములు. 3. ఆంధ్ర శబ్ద శాసనము. 4. శబ్దలక్షణ సంగ్రహము. 5. బాల వ్యాకరణము. 6. నిఘంటు పద సూచికలలోను నిఘంటు సంపుటములలోను వ్రాసికొనిన సూత్రములు. ఈ విషయము శ్రీ సూర్య రాయాంధ్ర నిఘంటు కార్యాలయములోఁ బనిచేయుచు సూరి నిఘంటు సంపుటములను ప్రత్యేక దృష్టితోఁ జూచినవారికిఁ దెలియును. వీని యునికినిగూర్చి తెలిసియున్నవారు 'చిన్నయసూరి జీవితము' అను గ్రంథమును రచించిన శ్రీ నిడుదవోలు వెంకటరావుగా రొకరు. వారు 1950, 1951 సం. లలో గిడుగు సీతాపతిగారితోఁ గలిసి సూర్యరాయాంధ్ర నిఘంటువు 5, 6, సంపుటముల ముద్రణము సాగించు పని చేయునపుడు చిన్నయసూరి నిఘంటు వ్రాఁతప్రతులను మదరాసులోఁ జూచితిమని నాతో ననినారు. ఆ నిఘంటు వ్రాఁత ప్రతులలోని సూత్రములు త్రిలిఙ్గ లక్షణ విశేషమునకు మూలమయిన విధమునుగూర్చి ముచ్చటించు కొందము.

# చిన్నయసూరి సూత్రాంధ్ర వ్యాకరణము

## 1

సూ. నకారంబ సాధారణంబు త్రి. లి. శే.; సంజ్ఞా—7.

ప్రత్యయాగమావ్యయాత్మకమై యుత్వవిశిష్ట మయిన నకారంబు ద్రుతసంజ్ఞకంబని యర్థము.

దీనికి మూలభూతమయిన సూత్రము సూరి నిఘంటు వ్రాతప్రతిలో

సూ. విభక్త్యాగమ సముచ్చ యాత్మా ను ర్ద్రుతః.

సూత్రాంధ్ర వ్యాకరణ సూత్రములో ఈ సూత్రమునకే పాఠాంతరములు — విభక్త్యాగమ చార్థో ను ర్ద్రుతః—అనియు, విభక్త్యాగమ టికాన్త చార్థో ను ర్ద్రుతః—అనియు కొంచెము మార్పు చెందినవి. ఈ మూఁడిటిలోను చార్థః=సముచ్చయార్థకమే గ్రహింపఁబడినది. త్రి. లి. శేషకర్త సముచ్చయార్థక మనుటకు మాఱుగా అవ్యయాత్మకము అని మార్చియు ఉదాహృతులలో మాత్రము, అన్నయును తమ్ముఁడును, మఱియును ఏనియును అని సముచ్చయార్థకమునే గ్రహించియున్నారు. అటులనే విభక్తి పదమునకు మాఱుగా, ప్రత్యయ పదమును గ్రహించుట జరిగినది. సూరి యభిప్రాయమునుబట్టి పాణినీయ సూత్రమయిన 'విభక్తిశ్చ—సుప్తిఙౌ విభక్తిసంజ్ఞౌ స్తః' అనుదానిచే బోధింపఁబడిన వానిని గ్రహించి, అది ప్రత్యయోపలక్షక మనుకొనినాఁ డనవలెను. బాల వ్యాకరణమునందు సూరి 'నకారంబు ద్రుతంబు' అని సూత్రీకరించినను, ముందుగ సుప్తిఙ్వి భక్త్యన్తరూపముల నుదాహరించి, ఆ వెనుక తుమర్థకమయిన నుఙ్యతమును ద్రుతాంతములయిన శత్రానంతర్య చేదాద్యర్థకములను ద్రుత ప్రకృతికములనుగాఁ బేర్కొనుట చేతను, అవసాన ద్రుత కార్యాది విధానముచేతను త్రిలింగ లక్షణ శేషకర్తలు సూత్రించిన అసాధారణ నకారమునే ద్రుతముగా భావించెననుట స్పష్టము. సూరి సూత్రించిన విషయమునే వీరు గ్రహించినారనుట తెల్లమగుచున్నది.

కాని త్రి. లి. శే. కర్తలు ప్రత్యయాత్మకమైన నకారమునకు—తాను నేను పదముల నుదాహరించియున్నారు. ఈ పదముల దగ్గఱ ప్రకృతిప్రత్యయ విభాగము చేసియుండవలసినది. సూరి మాత్ర మీ పదములు రెండిటిని ద్రుతప్రకృతిక సూత్రములో ప్రత్యేకముగ నుదాహరించియున్నాడు. సర్వనామ శబ్దములకు ప్రకృతి ప్రత్యయ విభాగము చేయుట కనుగతి కుదురకయే చాలవఱకు నిపతించుచు వచ్చినాఁడు. బాలవ్యాకరణోద్యోతములో వఝులవారు నేను తాను పదంబులు కళలే యనియు, ను లోని ఉకారమునకు లోపము చేయఁగా మిగిలిన పొల్లు నకారము ద్రుతమనియు భిన్న ప్రస్థానమున నీ ప్రకరణమున వివరణము సాగించియున్నారు. వారయినను నేను తాను పదముల దగ్గఱ ప్రకృతి ప్రత్యయ విభాగము నిచటు దెలిపియుండలేదు.

తెలుఁగు భాషకు వ్యాకరణమును రచించుట కష్టసాధ్యమైన పని. ఎందుచేతననఁగా అనుగతమయిన శబ్ద స్వరూపము లభింపదు. అప్పకవి అహోబలుఁడు కూచిమంచి తిమ్మకవి బహుజనపల్లివారు తమకుఁ దోఁచిన విధముగ ప్రాచీన ప్రయోగములకు పాఠములు కూర్చిపెట్టినారు. తత్తత్సంస్కారముతోనే తరువాతి వారు భారతాది గ్రంథములను పరిష్కరించి ప్రకటించుచు వచ్చుచున్నారు. ఒక్క చిన్నయసూరిదక్క వెనుకటివారిలో లక్షణకర్తలెవ్వరును లభించునంతవఱకు నితర ప్రతులతో సంప్రతించి పాఠ నిర్ణయము చేసికొని, లక్షణమును నిర్మింపవలెనను చూపు గలవారుగాఁ గానరారు. లభించినంతవఱకు నితర ప్రతులతో సంప్రతించి శబ్ద స్వరూప నిర్ణయము చేసికొని, శాస్త్రీయ పద్ధతిలో అన్యూనాతిరిక్తముగ సూత్రరచన సాగించి, దానిని మరల మరల మార్చుకొనుచు సరిఁజేయుచు వచ్చి, విచారసహమైన వ్యాకరణము తెలుఁగునకును గలదని లోకమునకు జాటి చెప్పినవాఁడు చెప్పఁగలవాఁడు చిన్నయ్యసూరి యొక్కఁడే యనవచ్చును. బహులక్ష్యములు పలుమాఱు సావధానముగఁ బరికించి బాల వ్యాకరణము రచించిన సూరి నేను తాను పదములను ద్రుత ప్రకృతికములలో ప్రత్యేకముగఁ బఠించుటలో నాతని చూపెట్టిదో విమర్శకు లింకను విచారింపవలయునని నా మనవి. ఇంతకు సూరి వ్రాసికొనిన సంస్కృత సూత్రమే, త్రి. లి. శేషములో నకారం బసాధారణంబు ద్రుతంబు అను సూత్రముగను తదర్థముగను రూపొందినదనుట తథ్యము.

## 2

సూ. తద్భవములందును అలఘురేఫము గలదు. త్రి. లి. శే.; సంజ్ఞా—౫.

కఱకంఠుఁడు—కాఱియ—గఱి—గొఱపము—గ్రెఱె—గోఱజము—జీలకఱ్ఱ—పిఱికి—పెఱ—మొఱకు—ఱాగ మొ.

దీనికి మూలము నిఘంటు వ్రాతప్రతిలోని ఈ క్రింది వాక్యము—

సూ. కాఱియ = యాతన—ప్రా.కారిఆ. క్వాపి తద్భవేఽప్యలఘు రేఫో దృశ్యతే. చిన్నయసూరి వ్రాసికొనిన ఈ వాక్యము వార్తికమువంటిది. ఇదియే త్రి. ల. శేషములో సూత్రముగా రూపొందినదనుట తథ్యము. కాని కాఱియ శబ్దమునే ముందుగ నుదాహరించుట భావ్యము కాదని కాఁబోలు, కఱకంఠుడు అను శబ్దమును ముం దుదాహరించి, యది గరకంఠ శబ్ద తద్భవ మనినారు ఆచార్యులవారు. కంఠశబ్దములో ఠకారము వినవచ్చునంతవఱకు అది గఱకంఠ శబ్దభవమగుట యసంభవము. కావుననే దీనిని సూరి అనిన్ద్యగ్రామ్యముగా నిరూపించియున్నాఁడు.

కఱకంఠుఁడు అను శబ్దములోని 'కఱ' యనునది గర శబ్ద భవమా? లేక కాల శబ్ద భవమా? యనునదియే తేలని విషయము. దానికి సంస్కృత ప్రాకృత భాషా వ్యాకరణ పరిజ్ఞాన మెంతేనిఁ గావలయును. ద్రావిడ భాషావాదము విమర్శకుల మనుకొనువారి మనస్సులలో బాగుగ రూఢ మూలమయిన ఈ రోజులలో తత్సమ తద్భవ సిద్ధాంతములే పనికి రావనుకొనునిప్పుడు, ప్రాకృత భాషలను గూర్చి పరిశ్రమించువారెవరు? ఒకవేళ యే కొలదిమందియైన నుండిన వారు ప్రాచీన వ్యాకరణ సిద్ధాంతానుసారముగ ఏ శబ్దమునుండి యే శబ్ద మెట్లు తద్భవముగా రూపొందెనో నిర్ణయించుట యెట్లు? కావుననే బాల వ్యాకరణ రమణీయములో శాస్త్రిగా రీ సూత్రోదాహరణములను గూర్చి వ్రాయుచు, "మేనమామ పోలికలతో తద్భతములును, సీస మాలికల కొండగుఱుతలతో శకట రేఫములు నిష్కృష్టముగా నిర్ణేయములు కాఁజాలవు. ఇదియొక పట్టునఁ దేలునదికాదు" అనినారు. కనుకనే సూరి 'క్వాపి' అను శబ్దమును జేర్చుకొని, ఈ నిర్ణయము చేయుట కష్టమని సూచించినాఁడు.

3

సూ. కారము క్షార శబ్దభవము. త్రి. ల. శే. సంజ్ఞా—10.

ఇందు సారూప్యము గనఁబడెడి ఖారశబ్దము కటు శబ్ద పర్యాయంబునగు. దీనినిబట్టి చిన్నయ్యసూరి 'కారము' అను శబ్దము 'కారో' అను ప్రాకృత శబ్దమునకు సమమని తెలుపఁగా ఆచార్యులవారు తద్భవమని మనినారు. క్షారశబ్దముతో సామ్యము కలదు గనుక అనినారు. క్షారశబ్దమునకు కటువు అను నర్థ మెట్టు అని ప్రశ్నించుకొని, ఆపస్తంబ సూత్రములో కటు శబ్ద పర్యాయమయిన క్షార శబ్దము కలదని సమాధానము తెలిపినారు. సూరి బాల వ్యాకరణమునందు కారము అనునది ప్రాకృతసమమనుటకు కటుః—కారో—కారము—అని తెలిపినను, నిఘంటు పద సూచికలో మాత్రము=కారము ఒఱ్ఱి. ప్రా. కారో. సం. కటుః అని వ్రాసికొనినాఁడు. మరికొన్ని ప్రాకృత సమ పదముల కిట్లే ముందు ప్రాకృత పదములను తరువాత వానికి మూలమయిన సంస్కృత పదముల నిచ్చుటయే సాగించుచు వచ్చినాఁడు. క్షార శబ్దము కటు శబ్ద పర్యాయము కలదని సూరికి తెలియ దనుకొందమా? ధర్మ శాస్త్ర గ్రంథ విశేష పరిచయ మాతని కున్నట్లు హిందూ ధర్మశాస్త్ర సంగ్రహము అను గ్రంథము తెలుపుచునే యున్నది. సంస్కృత ప్రాకృతాంధ్రములలో సూరికి విశేష పరిజ్ఞానము కలదని ఆచార్యులవా రంగీకరించిన విషయమే. కాని సూరి చెప్పినది కాదనుటయే ఆచార్యులవారి కభిమతమైనట్లు కానవచ్చుచున్నది. ఇంతకు కారము అను పదము 'కారో' అను ప్రాకృత పదమునకు తత్సమము కాదనుటయెట్లో తెలిపిన బాగుండెడిది. అట్లు చేసి యుండ లేదు. 'కారో' అను ప్రాకృతరూపమునకు కటుః అను శబ్దము ప్రకృతి కాదనియేని నిరూపింపరైరి. ఖార శబ్దమునకు చేఁత యుప్పు అను నర్థము సర్జికాక్షారము యవక్షారము మున్నగువానిలో ప్రహతమై యుండుటచే కటు శబ్దార్థకమయిన ఒఱ్ఱి అను నర్థములోనిది 'కారో' అను ప్రాకృతమున కిది సమమనియు, దానికి 'కటు' శబ్దమే ప్రకృతియనియు సూరి భావించియున్నాఁడు. అది యట్లు కాదనవలసియుండిన దాచార్యులవారికి. ఇంతకు ఈ సూత్రము త్రిలింగ లక్షణ శేషము బాల వ్యాకరణ శేషమనుట కుపయోగించునుగాని మఱియొక దానికి గాదనిపించును.

ఆంధ్రదేశములో 'కారము' అను పదము కటు శబ్దార్థమునందే విశేషముగ వాడుకలో నున్నది. చేఁత యుప్పులయిన సురాకారము వెలిగారము మొదలయిన పదములను కేవలము 'కారము' అను పదముతో

వాడుటలేదు. ఒజ్జి అను నర్థములో నైషధములో 'మిరియపుఁగారంబువోలె' ననియు, 'వండిన కారపుఁ గాయగూరలు' అని ఉత్తర రామాయణములోను,చమ. 4.32 లోను ప్రయోగములు కానవచ్చుటచే, సూరి చెప్పిన మార్గమే యిచట న్యాయ్యమనిపించుచున్నది. సూ. ని. లో కారము (సం. క్షారః. ప్రా. కారం. క.కారవు. త. కారమ్) కటువు. అను నర్థము నిచ్చి యున్నారు. చవుడు అను నర్థమున శాంతి 3.364 పద్యమును సూ. ని., శ. ర. లు రెండును నుదాహరించి నవి. చవుడు, చేతయుప్పే యగును. అకల్పమున సూ.ని.లో తెలిపిన నిష్పత్తి క్షార శబ్ద భవమైనకారము నకు, సూరి చెప్పిన కటుః—కారో—కారము—ఒజ్జి అను నర్థమునకును సరిపడుననిపించుచున్నది. విమర్శకు లాలోచించి నిర్ణయింతురుగాక.

## 4

సూ. కోటపేఁటలు వైకృతంబులు త్రి. ల.శే.; సంజ్ఞా—11.

సూరి బాల వ్యాకరణములో నీ రెండు శబ్ద ములను దేశ్యములుగా లెక్కించినాఁడు. కాని, బాల వ్యాకరణము తరువాత రచించిన నిఘంటు పదసూచికలో 'కోట=ప్రాకారదుర్గము. సాలము, నగర ప్రాకారము. సం. కోట్టమ్. 'కోట్ట దుర్గే పున స్సమే' ఇతిహేమ చంద్రః'. అని వ్రాసికొనియుండుటచే, ఈ కోట శబ్దము తద్భవమని సూరియు భావించియుండెననియే స్పష్టముగఁ దెలియుచున్నది. ఆతని నిఘంటు సంపుటము' లున్నచో 'పేఁట' శబ్దమున కేమి వ్రాసెనో తెలిసియుండెడిది. బాల వ్యాకరణము సూరి జీవించి యుండఁగా 1858 లో ప్రథమ ముద్రణము నంది నది. ఆ తరువాతనే అకారాది నిఘంటు సంపుటములు వ్రాయుట జరిగినది. దానిలో కోట శబ్దము తద్భవ మగుట గాంచియే కాఁబోలు ఆచార్యుల వా రీ సూత్ర మును వాకొనినారు. కాకున్న కోట్ట శబ్ద పర్యాయం బుగా సంస్కృతంబున కోట శబ్దంబు నొక్కండు గానంబడియెడి ననినారు. ఎక్కడఁ గనఁబడెనో తెలిపిన పాఠకులకు సంశయము తీఱియుండెడిది గదా! వీరికి కోట్ట శబ్దము కనఁబడినది సూరి నిఘంటువులో కాదా? సూరికి సంస్కృత ప్రాకృతముల రెండి టను మంచి జ్ఞానము కలదనుటకు ఆతని వ్యాక రణ సూత్ర రచనలు, నిఘంటు పద సూచికలే గాక, ఆతఁడు తన నాఁటికి ముద్రితములు కావలసినవిగా వ్రాసికొనిన సంస్కృత ప్రాకృత వ్యాకరణ గ్రంథ పట్టికలు కూడ తార్కాణించుచున్నవి. ఆ పట్టిక లలో మొదటి వరుసలో సంస్కృత నిఘంటువులు, రెండవ వరుసలో సంస్కృత కావ్యములు, మూఁడవ వరుసలో అలంకార నీతి వ్యాకరణ శాస్త్ర గ్రంథములు తుదిని ప్రాకృత వ్యాకరణ గ్రంథములు వ్రాసియు న్నవి. వ్యాకరణములలో ముగ్ధబోధము కూడనున్నది. ప్రాకృతములలో ప్రాకృత మనోరమ, త్రివిక్రమ వ్యాక రణము, హేమ చంద్ర వ్యాకరణమును గలవు. ఏ గ్రంథ మునయినను జూడకుండ వ్రాయునలవాటు సూరికి బొత్తిగా లేదు. కావున నాతనికి సంస్కృత ప్రాకృత వాఙ్మయముతో విశేష పరిచయము గలదనుట సత్యము.

## 5

సూ. ఇ ప్రత్యయాంతావ్యయంబునకు సంధియుఁ జూపట్టెడి. త్రి. ల. శే.; సంధి—2.

ఈసూత్రము—''నక్త్వః—క్వాపి స వర్ణే దృశ్యతే'' అను సూరి సూత్రాంధ్ర వ్యాకరణ సూత్రమునుండి యవతరింపలేదని యెవ్వరును ననలేరు. 'దృశ్యతే' అను శబ్దమునకు వివరణమైన' చూపట్టెడి' అను శబ్దమే దీనిని పట్టియిచ్చుచున్నది. ఈ సూత్రమును గొని వచ్చినప్పుడు, సూరి నిఘంటు పద సూచికలలో కళాపూర్ణోదయములోని పదముల నెత్తిన కాగితము లున్నచోట వ్రాసికొనిన ఈ సూత్రముల కాతఁడు గావించిన' వివరణ వాక్యములను గూడ పొందుపఱచిన ప్రౌఢ వ్యాకరణము బయలుదేరిననాఁటినుండి యీనాఁటి వఱకు దీనిపై సాగుచుండిన విమర్శన పరంపర, పద్య పాఠముల ప్రామాణికత్వాప్రామాణికత్వ పర్యాలోచ నము నింత లేకుండెడి దేమో యనిపించును. అచటి సూత్ర వివరణ మీ క్రింది విధముగ సాగినది.

సూ. నక్త్వః—క్త్వార్థ స్యేకారస్య సన్ధి ర్న స్యాత్. వచ్చి యేగి—అరసి యరసి. ఆమ్రేడిత స్యా వ్యయం నిషేధః. పర్జన్యవ దన్యత్రాపి దృశ్యతే. ఇతః కిమ్? ఏగ కేగక.

సూ. క్వాపి సవర్ణే బహుళమ్-క్త్వార్థస్యేత స్స వర్ణే౽ చి క్వాపి బహుళం సన్ధి స్స్యాత్. క్వాపీత్యనే నాస్య ప్రయోగవైరళ్యం సూచితమ్.

సూత్రాంధ్ర వ్యాకరణ సూత్రములో సవర్ణ మైన అచ్చుపరమైనపు డొక్కొకచో క్త్వార్థకే కారమునకు సంధి చూపట్టెడినని సూత్రించియు,

నిఘంటు పదసూచికలో బహుళముగావచ్చు ననినాఁడు సూరి. మరియు 'క్వాపి' అనుటచే నిట్టి ప్రయోగ ములు విరళములని కూడఁ దెలిపియున్నాఁడు. క్త్వార్థ కేకారమునకు సంధి రాదనినప్పుడు వ్యాకరణ పరిభాషను జోడించి దళ సార్థక్యమునకు సైతముదాహరణముల నిచ్చిన సూరి ఈ సూత్రమునకు విశేషముగ వివర ణము వ్రాసి యుదాహరణము నొక్కటియైన నీయ కుండుట కేమి కారణమో? కవిత్రయ ప్రయోగముల నాతఁడు పసిగా పరికింపలే దందుమా? అట్లనుటకు వీలులేదు. ఆతని వ్యాకరణ రచన కనుగత శబ్దసిద్ధి విశేషముగ లభించినది కవిత్రయ ప్రయోగములందే కదా! తిక్కన విరాట్పర్వమునందలి ఈ క్రింది పద్య మునకు సంబంధించిన వ్యాకరణ విశేషమును గమ నించిన ఆతఁడు తన వెనుకటి సూత్రములకు సవరణ లెట్లు చేసికొనెనో మనకు తెలియవచ్చును.

చ. ధరణియుఁ బట్టణంబు హయ
దంతి రథంబులు గోవులున్ భటో
త్కరము సమాత్యవర్గమును
గాఁగల రాజ్య మితండ యేలు ని
ర్భరముగ నేనుఁ బుత్రులును
బంధులుఁ దమ్ములుఁ గొల్చియుండెదం
గరిపురి కెత్తునట్టి పని
గల్గిన నోపినయంత చేసెదన్.

భార. విరా. 5 ఆ.

'కొల్చి యుండెదన్' ఇత్యేకత్వం దృశ్యతే. అత్రా త్మార్థవ దస్మచ్ఛబ్దస్యాపి కార్య మితి జ్ఞేయమ్.

ఇక్కడ 'కొల్చియుండెదన్' ఏక వచనము కనఁ బడుచున్నది. ఆత్మార్థకమయిన తాను శబ్దమునకు వలె అస్మచ్ఛబ్దార్థకమైన నేను అనుదానికిని కార్యము వచ్చునని తెలియవలెనని భావము.

సూ. ఆత్మార్థం బభిహితం బగుచో తల్లింగ సంఖ్యాభిధాయి వచనంబు ధాతువున కగు. బాల. క్రియా. 121.

రాముఁడు రావణుం బరిమార్చి సీతయుం దాను సౌమిత్రి సహితంబుగం బుష్పకారూఢుండై సాకేతంబున కేతెంచె—అను నీ యుదాహరణము ఆత్మార్థకమయిన తాను శబ్దమున కయినపుడు అస్మదర్థకమయిన నేను శబ్దమునకు 'నేనుఁ బుత్రులును బంధులుఁ దమ్ములుఁ గొల్చియుండెదన్' అనునది యుదాహరణము. ఇది బాల వ్యాకరణమునకు శేష పూరణము. ఈ సూత్రము త్రిలింగ లక్షణ శేషమునం దెట్లవతరించెనో పరి కింతము.

సూ. ఒకానొకచో సహార్థంబున యుష్మ దస్మ దర్థంబు లభిహితంబులగునపుడు క్రియలు తత్కర్తృ కంబులు విభాషనగు. త్రి. ల. శే.; క్రియా—26.

ఈ సూత్రము దీని యుదాహరణములు పై సూరి వాక్యము నూఁతగఁ గొనియే యవతరించె ననవచ్చును.

ఈ విధమయిన సూత్ర నిర్మాణక్రమమును పరికించిన ఆచార్యులవారు సూరి నిఘంటు వ్రాత ప్రతులను, వానిలో సూరి వ్రాసికొనిన సూత్రము లను చూడకుండ నీ త్రిలింగ లక్షణ శేషమును రచించి నారని యనలేము. ఈ క్రింది సూత్రములను పరి కించిన నీ విషయము స్పష్టమగును.

సూ. పకారంబు కొన్ని యెడల శత్రర్థక చువర్ణంబునకుం గానంబడియెడి.

త్రి. ల. శే.; క్రియా—17.

సూ. చును మిచోః పత్వం క్వాపి దృశ్యతే. కవి త్రయ గ్రంథేషు తు. న మూలం మృగ్యమ్.

సూరి నిఘంటు పద సూచిక.

ఈసూరి సూత్రము మార్పు లేకుండఁగనే ప్రౌఢ వ్యాకరణమున ప్రవేశించిన దనుటలో నెవ్వరికిని సందియ ముండఁబోదని నా మనవి. ఈసూత్రమును బట్టియే లక్షణ నిర్మితికి సూరి కవిత్రయేతర కృతులను సైతము గ్రహించుననియు, నిష్ప్రమాణమైన యంశ ముల నాతఁడు గ్రహింపఁడనియు స్పష్టమగుచున్నది.

దీనినిబట్టి విరాట పర్వమునందలి 'చాపము నా కందిమ్మనుడు' అను ప్రయోగమును సూరి 'క్వాపి సవర్ణే బహుళమ్' అను దాని కుదాహరణముగ నీయ కుండుటనుబట్టియే యాతఁడు దీనినే తదుదాహరణ ముగ భావింపలేదనుకొనవచ్చును. భాగవతాది ప్రయో గముల నాతఁడు లక్షణ నిర్మితికి స్వీకరింపలేదను టయు సరియైనమాట కాదు. నిఘంటు పదసూచిక తుదిని 'లక్షణము' అను శీర్షకమున రంగనాథ రామాయణము, ఉత్తర హరివంశము, జైమినిభార తము, భోజరాజీయము, ఉత్తర రామాయణము, కవి త్రయ భారత భాగములు, భాగవతము అను వీనినుండి పదముల నెత్తి, పదపద్యోదాహృతుల నిచ్చియున్నాఁడు.

# ఆశలో ఎదుగుతున్నాను!

శ్రీ పరిగి రాధాకృష్ణ

కళ్ళల్లో నీళ్ళు సుళ్ళు దిరుగుతున్నా,
కంఠం పాడలేక బిగుసుక పోతున్నా,
వెక్కిళ్ళు రావటం లేదు నాకు;
ఘక్కు-మని నవ్వాలనిపిస్తోంది;
నవ్వొస్తూంది:
ఏం చేయను చెప్పు!

కండల్లో శక్తి కరిగేవరకూ కష్టపడుతున్నా,
కటిక దరిద్రం కడుపును పొడుస్తున్నా,
కూలిపోతానేమోనన్న బెంగ క్రుంగదీస్తున్నా,
భగవంతుని అస్తిత్వం మీద
నా నమ్మకం చెదరిపోవటం లేదు:
ఏం చేయను చెప్పు!

వేళ్ళు రాయడం మానలేదు
కలలు తుడిచిపెట్టుకపోతున్నా,
కట్టుకున్న గాలిమేడల పునాదులు
కదలిపోతున్నా,
చేపట్టిన ఆదర్శాలు చివికి ఛిన్నాభిన్నమౌతున్నా,
నా రాత నన్నే అవహేళన చేస్తున్నా,
నా వేళ్ళు రాయడం మానలేదు:
ఏం చేయను చెప్పు!

నోళ్ళు వెక్కిరిస్తూనే వున్నాయి
చాటుగా మాటుగా వీపు మీదుగా;

నా బ్రతుకు మీద మట్టి విసరడానికి
ప్రయత్నాలూ సాగుతున్నాయి;
అయినా నాలో విశ్వాసం
కించిత్తయినా సడలి పోవటం లేదు;
కాంతి కిరణాలు నన్ను చేరటం మాన లేదు.

ఏదో సత్యాన్ని వెతుక్కుంటూనే వున్నాను,
ఎప్పటికయినా నింగి నందుకుంటాననుకుంటున్నాను,
బ్రతుకాలనే వాంఛను
గడియ గడియకీ రెట్టింపు చేసుకుంటున్నాను,
ప్రతి చిన్న అనుభవంలోనూ
జీవిత స్వరూపాన్ని తెలుసుకుంటున్నాను.

కాఠిన్యాన్ని చూసి కలవరపడటం లేదు,
మోసాన్ని చూసి జుట్టు పీక్కోవటం లేదు,
జీవితాన్ని చూసి జడుసుకోవటం లేదు,
ఎందుకో తెలుసా ?
నే నాశలో ఎదుగుతున్నాను;
ఆకాంక్షలో పెరుగుతున్నాను.



# నా చిత్రాలు

## శ్రీ ఎస్. వి. రామారావు

నేను చిత్రకారుణ్ణి అంటే ఒక్కరూ నమ్మరు. నేను ఏ లా విద్యార్థినో, పాలిటిక్స్ విద్యార్థినో లేక ఎకనమిక్స్ విద్యార్థినో అని అనుకుంటారు. దీనికి కారణం బహుశః నేను అలాంటి వ్యక్తులతో రాజకీయాలు చర్చిస్తూ ఉండడం, చిత్రలేఖనానికి తప్ప తక్కిన నానా విషయాలకూ సంబంధించిన పుస్తకాలు నా గదినిండా ఉండడమేనేమో! నేను, ఇలా ఇతరులను కలుసుకుని వివిధ విషయాలు ముచ్చటించడంవల్ల నా చిత్రలేఖనానికి బోలెడంత విషయం చేకూరుతుంది. వారి భావాలు, అభిప్రాయాలు నా భావాలతోను, అభిప్రాయాలతోను కలుస్తాయి. కాని, నేను నేనే—ముందు ఎలా ఉన్నానో, ఇప్పుడూ అలానే ఉన్నాను.

నా చిత్తరువులలో భారతీయత ఎంత ప్రస్ఫుటంగా వుందో పలువురు విమర్శకులు నాతో అన్నారు. లండన్‌లో నాదాపు రెండున్నర సంవత్సరాలపాటు



వసంత ఋతువు



ఉ షో ద యం

వూపిరిసలుపనంత విరామం లేకుండా, తపస్సులాగ, అసంఖ్యాకంగా చిత్రాలు గీసిన తర్వాత గూడ నేను నా చిత్రలేఖనంలో భారతీయతను కోల్పోలేదు.

ఈ భారతీయత మొట్టమొదట నేను తొలిసారిగా లండన్‌లోని స్లేడ్ లలితకళా పాఠశాలలో కని పెట్టిన లిథోగ్రఫీ—చిత్రరీతిలో ప్రస్ఫుటమయింది. ఈ రీతి చిత్తరువు తక్కిన వర్ణచిత్రాలవైఖరి కంటె ఎంత భిన్నం! ఈ లిథోగ్రఫీ రీతిలోని సుతారం నన్ను ముగ్ధుణ్ణి చేసింది. దానితో నేను మన సుతారమైన, జిలుగు పనితనంగల చిత్రాలను, వాటిని రచించిన వారి అనల్పకల్పనావిస్తృతిని, ఉజ్జ్వలానుజ్జ్వలవర్ణాల పరస్పర సామరస్య సమ్మేళనల ఉత్కృష్టతను గ్రహించడానికి మరింత లోతుగా తరచి చూడడం ప్రారంభించాను. నేను ఆలేఖ్య విషయంకన్నా ఆలేఖ్య స్వరూప స్వభావాలనే హెచ్చుగా నమ్మేవాడిని గనుక నిరంతరం కదలిపోతున్న మొయిళ్లను, మనం ప్రకృతిలో అనుదినం చూస్తున్న వస్తువుల రూపాలను ఇంద్రజాలంవలె తలపిస్తూ, వాటి సహజ స్వరూపాన్ని మనం వూహించేట్టుచేస్తూ అనుక్షణమూ మారుతున్న ఆ మొయిళ్ల రూపాలను చూచి ఎంతో ఆనందిస్తుంటాను. ఇలా నిరంతరయాత్ర, అనంత ప్రవాహం నన్ను మరులు కొలిపిస్తాయి. ఈ పరిశోధనవల్ల నేను గంభీరంగా పారే నదులను, మందగతితో కదిలే కాలువలను, అవి కొండలను గుట్టలను చుట్టివేసే తీరును, అవి అక్కడక్కడ దీవులు కల్పించే అందాన్ని చూస్తుంటే ఎంతో మురిసిపోతాను. నేను లండన్‌లో ఉన్న తొలిరోజులలో బ్రిటిష్ మ్యూజియంలోని సుందర అమరావతి నాగార్జునకొండ శిల్ప సముదాయంలోను—ముఖ్యంగా స్తంభాల బోదెలమీద పొట్టి యకులు బుద్ధదేవుని అర్చనకోసం తమ ఆకారానికి మించిన పెద్ద పెద్ద పూమాలలను మోసుకొని పరుగెత్తు

తున్నట్టు చెక్కిన శిల్పాలలోను—ఈ ఆకర్షణే—మంజుల ప్రవాహశీలతే—నాకు కనిపించింది. ఈ ప్రవాహశీలతను నా లిథోగ్రఫీ—చిత్తరువులలో చూపడానికి ప్రయత్నించాను. నేను ఆ చిత్తరువులలో పెక్కు వర్ణాల రూపాలను, పరస్పరం మించిపోయే ఉజ్జ్వలానుజ్జ్వల వర్ణరూపాలను కుక్కిపెట్టాను. అవి నాకు విజయం చేకూర్చాయి. పలువురు కళా విమర్శకులు నన్ను ప్రశంసించారు. 1964 లో స్లేడ్ కళా పాఠశాలలోను లిథోగ్రఫీ చిత్రాలను రచించినందుకు నాకు నభినందనలు అందాయి.

కాని, సామాన్యంగా లిథోగ్రఫీ చిత్తరువులను తక్కిన వర్ణ చిత్రాలకన్నా గౌణంగా పరిగణిస్తారు; ప్రముఖంగానూ, చిత్రలేఖనంగానూ పరిగణించరు. కాని, ఈ లిథో చిత్రరీతి వివిధ వస్తువులను ఇరుగు పొరుగున గీచడం, పునరుల్లేఖించడం వివిధ స్వరూపాలలో చూపడం మున్నగు అనేకానేక రచనలకు అవకాశమిచ్చి చిత్రలేఖనంలో వివిధ విషయాల పరస్పర నూతన సంబంధాలను కనుగొనడానికి కొత్త మార్గాలు తీర్చింది. లిథోగ్రఫీ అంటే ఇష్టం ఏర్పడినందువల్ల నేను ఈ రీతిని, తత్ఫలిత ప్రభావాలను తక్కిన వర్ణ చిత్రాలలోను తేవడానికి ప్రయత్నించాను. ఎన్నో పొండు చిత్రాలు (స్కెచ్చులు) గీచాను. విధ విధాలుగా గీచాను. ఆకారాలు మార్చాను. రంగులు మార్చాను. రచనా పద్ధతి మార్చాను. ఆఖరుకు తుది దశలో కాన్వాసు నుంచి రంగును తీసివేసి, లిథోగ్రఫీ టెక్నిక్‌ను పూర్తిగా అనుసరించాను.

నా వర్ణచిత్రాలలో భావనా ప్రవాహశీలత ఉండాలని నా ఆకాంక్ష. భావన అనేది ఎటుబడితే అటు ప్రసరించి, కొత్త విషయాలను ఎన్నిటినో ఆత్మీయం చేసుకుంటూ, తటస్థపడే అవకాశాలలో



ప్రతిబింబం



## రంగలలో లిథోగ్రాఫ్

విక్రియ చెందుతూ, గతిని మారుస్తూ ఉన్నప్పటికీ, వ్యక్తిత్వపు వాస్తవ స్వరూపాన్ని అభివ్యక్తి చేసేదిగానే ఉంటుంది. మనకు కొందరు చిత్రకారులు నచ్చుతారు. వారి చిత్రాలు, చిత్రలేఖన రీతులు, వారి శైలి చిత్రాలలోని కొన్ని అంశాలు, భాగాలు, వాటి అనంతర ప్రభావాలు నచ్చుతాయి. దీనివల్ల ఫలానా చిత్రకారుడన్నా, అతని చిత్రాలన్నా మనకు ఆత్మీయత ఏర్పడుతుంది. వాటిని ఆత్మీయంగా భావించడం ప్రారంభిస్తాము. ఇలాటి ఆత్మీయత రూపొందడానికి లండన్, పారిస్, న్యూయార్క్ వంటి కేంద్రాలు చాల సహకరిస్తాయి. నేను గొప్ప చిత్రకళా ప్రదర్శనాలను, ముఖ్యమైన చిత్రకళా ప్రదర్శనాలను చూచాను. పలువురు చిత్రకారులతో చర్చించాను. పలువురు విమర్శకుల వ్యాసాలు చదివాను. ప్రసంగాలు విన్నాను. దృశ్యవిద్య, కంటితో ప్రత్యక్షంగా చూడడం మనకు జ్ఞానభండారం ప్రసాదిస్తుంది. చిత్రాలు చిత్రకారుని దృష్టిలో ఎలా వున్నవని మాత్రమేకాక మన అభిప్రాయాల ప్రకారంగా ఎలా ఉన్నాయో అని కూడ మనం తప్పక చూడవలసి వస్తుంది. చిత్రకారునితో మనం ఏకీభవించకపోయినా లెక్కచేయం. ఈలాటి పరిశీలనవల్ల మనలో కొత్త చూపు ఏర్పడుతుంది. కొత్త కిటికీ తెరుచుకుంటుంది. ఈ చూపుతో—మనం స్వంతంగా కనుగొన్న చూపుతో—మనం కోరినట్టు చూస్తాము. ఇదొక గొప్ప అనుభవం. ఈ దృశ్య రచనా పద్ధతిని—ఈ చాక్షుష జ్ఞానాన్ని—నేను లండన్‌లో అభివృద్ధి పరచుకొన్నాను. నేను లండన్‌లోవున్న రెండున్నర సంవత్సరాలు వస్తువులను వాటి స్వరూపంలోను—దృశ్యమానతలోను—మాత్రమే కాక చాక్షుష దృష్టితోను చూసేట్టు చేశాయి. ఏ చిత్రకారుని సంప్రదాయం ప్రకారమో చిత్రలేఖనం నేర్చుకోడమనే ప్రశ్నే లేదు. ప్రశ్న అంతా ప్రతిదాన్ని నూతన మార్గంలో, ప్రత్యక్ష మార్గంలో చూడడం

నేర్చుకోవి, ఈ నూతన దృశ్యాన్ని ఏ దృశ్య విద్యా సాధనంతో తెలుపడ మన్నదే.

ఇప్పుడు, నాకు, నేను చూసే ప్రతి వస్తువులోను సౌందర్యం దృగ్గోచరం అవుతుంది— గులకరాతిలో నూతనాకారం, మేఘమాలికపై వర్ణరేఖ, తుక్కుపట్టిన ఇనుప ముక్కమీది అందమైన దొంతరలు—సుందరంగా కనిపిస్తాయి. ప్రతివస్తువులోని ఆంతరసౌందర్యం చూడడం మన విధ్యుక్తధర్మం. నన్ను మోహపరిచేది ఒక్క సినిమాతార అందమే కాదు, మనం అందవికారం అనుకునే దానిలోని ఆంతర సౌందర్యమూ నన్ను ముగ్ధుణ్ని చేస్తుంది. ఇది సత్యాన్వేషణ. ఈ దృష్టివిశేష విధానాన్ని చిత్రాలలో చూపదలచాను: విచిత్ర రీతులలో పల్లవించిన జిలుగు పనితనపు చిత్రకళపట్లగల గాఢ ప్రేమను, అతిగూఢమైన ప్రకృతిని సన్నిహితంగా పరిశీలించడాన్ని, శాశ్వమని భాసించే ప్రాపంచిక విషయాల అశాశ్వతత్వం పట్ల నాకు గల విచిత్ర దృష్టిని, భ్రమప్రమలను, వస్తువులను వాటి స్వరూపంతోను, నా దృష్టితోను చూడడంలో కలిగే పెనుగులాటను—నా చిత్రాలలో చూపదలచాను. ఇంతవరకు నాలో కలిగిన ఈ దృష్టి విశేషం, భావాలు నా చిత్తరువులలో అత్యాశ్చర్యకరంగా ప్రతిభాసించాయి. ఇదే కారణ మనుకుంటాను—నా చిత్తరువులు ఇతరుల చిత్రాలకంటె భిన్నంగా ఉండడానికి. నేను ఇంగ్లండులో ఉన్నప్పుడే నా చిత్ర రచన పరిణత దశను పొందినా, నా చిత్రాలలో పొందిక, చిత్రాల విషయ గాంభీర్యం, భారతీయమే. ఇతర విధాలుగా ఉండాలని నేను కోరను.

చిత్రాలలో నా వ్యక్తిత్వాన్ని, నా భావాలను తెలుపడానికి చేసే ఈ అధ్వరంలో నేను చూచేది 'ఏమి'' చిత్రిస్తున్నానని కాదు; ''ఎలా'' చిత్రిస్తున్నా ననేది. చిత్రించాలనే భావం, చిత్రకర్మ, చిత్ర కర్మలో కలిగే సంతోషం—ఇవే నావి. నా చిత్రాలు ఏ సందేశమిస్తాయో, నాకు పరిచితమైన వస్తువులను ఎలా అవభాసింపజేస్తాయో నాకు పనిలేదు. ఏమిటి మీా చిత్రం?—అని ఎవరైనా అడిగినప్పుడు, నేను మూగవాడయిపోతాను. ఎందుకంటే, అదేమిటో నాకే తెలియదు. మాటలు దానిని వివరించలేవు. నేను నా మనసులో ఉండేదంతా మాటలలో చెప్పగలిగితే నేను కవిని, రచయితను కావాలి. ప్రస్తుతానికి నేను చిత్రకారుణ్ణి. నా అభిప్రాయాలు మౌనంగా చెప్పేవి నా చిత్రాలేనని నేను నమ్మి ఉండాలి. అలా చెప్పడంలో అవి విజయం పొందడం నా విజయానికి తార్కాణం. వాటి పరాజయం నా పరాజయమే.

నా పరిసరాలలో విస్తరించినదంతా, నన్ను ఆవరించినదంతా—ప్రజలు, ఈ విశ్వ ప్రకృతి, నా దృష్టిగోచరమవుతున్న ప్రతి విషయమూ—నాకు సంబంధించినదే.స్పష్టంగా, సూక్ష్మంగా చూచేవారికి వీటి ప్రతిభానం నా చిత్రాలలో ఉందనే నా అభిప్రాయం. భారతీయతను మరుగుపరచడం సాధ్యంకాదు; నా కళాశిక్షణేమో పాశ్చాత్య దేశాలలో; తీవ్రమైన దృక్పథం నాది : ఈ మూడింటి సమ్మేళనం నా చిత్రాలలో ఉన్నది. నేను 1965 ఏప్రిల్ నెలలో లండన్‌లో ఏర్పాటు చేసిన ఏక వ్యక్తి చిత్ర ప్రదర్శనాన్ని చూచిన కళా విమర్శకుడు శ్రీ నైగెల్ గోస్లింగ్ ''ది అబ్జర్వర్'' పత్రికలో నా యీ భావాలన్నిటినీ ఈ ఒక్క మాటలో తెలిపారు:—

''రామారావు స్వదేశీయ సంప్రదాయ సిద్ధమైన జ్ఞానేంద్రియానుభూతి మాధుర్యాన్ని పాశ్చాత్య సంప్రదాయ పరిజ్ఞానంతోను, స్వకీయమైన వాస్తవమైన బోధతోను మేళవిస్తారు.''

కప్పురభోగివంటకము కమ్మని గోధుమపిండి వంటయున్
గుప్పెడు పంచదారయును గొత్తిగగా చినయాలనే పెస
ర్పప్పును గొమ్ము నల్లనటి పండ్లును నాలుగునైదునంజులున్
లప్పలతోడ గ్రొంబెరుగు లక్ష్మణ వజ్ఝులయింట రూాకకున్.

(వల్లభరాయడు—క్రీడాభిరామము)

# అసుర సంధ్య

శ్రీ ఆర్. ఎస్. సుదర్శనం

(గతసంచిక తరువాయి)

"ఏమో ! ఆడవాళ్ల సంగతి ఆడవాళ్లకే అర్థంకావాలి! నాకు మాత్రం ఏమిటీ గొడవంతా అనిపిస్తుంది! మన తాత ముత్తాతలు, పూర్వులు యిలానే అర్థాలు అన్వేషిస్తూ సంసారాలు చేశారా?.."

"వాళ్ల యింత అమాయకంగా చేతగాకుండా ఎప్పుడూ లేదు! ప్రేమ, వ్యక్తిత్వం, అంటూ కళ్లకు నినాదాల్తో గంతలు కట్టుకుని సుఖాన్ని అన్వేషించలేదు. కోపంవస్తే భార్యని గట్టిగా మందలించేవాళ్లు లేకపోతే కొట్టేవాళ్లు... నిరాశతో 'అర్థం కాలేదు'...'అర్థంకాలేదు' అంటూ తలపట్టుకుని కూర్చోలేదు." చంద్రావతి తలపట్టుకుని కూర్చోవటం చూస్తే శ్రీధర్‌కు నవ్వాగలేదు.

"నువ్వటు పూర్వుడివీ కావు, యిటు నవ్యుడివీ కావు. జీవితం మీద పట్టువదిలావు. మళ్లీ దాన్ని ఏవిధంగా స్వాధీనం చేసుకోవాలో నేర్చుకోవటానికి బద్ధకిస్తున్నావు..."

చంద్రావతి అభినయంతో సహా చెబుతూ ఆమె ఊహాల్తో పాటు బంగారు తీవెలా చలిస్తూ ప్రకాశిస్తోంది. అందులో బాల్యం తాలూకు ముగ్ధత్వమూ, చిలిపితనమూ, స్త్రీత్వపు మార్దవమూ ఆకర్షణా, యౌవనపు విలాసమూ పొంగూ, కాంతి రేకలుగా రూపు కట్టుతున్నాయి. శ్రీధర్ మంత్రముగ్ధుడిలా వింటున్నాడు.

"సరే, తారసంగతి అలావుంచి నీ సంగతి కనుక్కుందాం. ఆదర్శాలతో నమ్మకం వుండే నవ్యుడివి, మరి నువ్వెందుకు ప్రేమించి పెళ్లిచేసుకోలేదు? నీ ఊహలకు అనుగుణంగా వుండే అమ్మాయికోసం ఎందుకని స్వయంగా వెదుక్కోలేదు?" అని ప్రశ్నించింది చంద్రావతి.

"నేను అప్పుడు ప్రేమను గూర్చి ఎక్కువ ఆలోచించలేదు. అదీగాక తారను చూడగానే యిష్ట పడ్డాను, తప్పక చేసుకోవాలనిపించింది... ఇక ప్రేమిస్తే మాత్రం అంతే కద!"

"మనం శాస్త్రీయంగా ఎనలైజ్ చేసి తర్కిస్తున్నాం కాబట్టి నేను కొన్ని ప్రశ్నలువేసినా ఏమీ అనుకోగూడదు.. మగవాళ్లకుండే చాంచల్యం నీకెప్పుడూ కలగలేదా?"

శ్రీధర్ తోటలోకి, దూరంగా చెట్లవైపు ఆకాశంవైపు చూశాడు. ఆమె ప్రశ్నకు జవాబు చెప్పాలని లేదు అతనికి.. ఎవరీ చంద్రావతి? ఏమిటి తనకూ ఈమెకూ సంబంధం?.. ఇంతసేపూ లేని ఒక సంకోచం, అవరోధం అతనిలో మొలకెత్తింది.

"ఈ ప్రశ్నల వల్ల లాభమేమిటి? ఇలా పొరలు పొరలుగా వూడదీస్తే మనిషిలో మిగిలే దేమి వుంటుంది? ఇక ఈ ప్రశ్నలూ జవాబులూ చాలించి మరేమైనా మాట్లాడుకుందాం" అన్నాడు శ్రీధర్ కొంతవిసుగ్గా.

చంద్రావతి అతణ్ణి తదేకంగా గమనిస్తోంది: "అలాగే. నే నడిగింది ఆఖరుప్రశ్న— యిక ప్రశ్నలు లేవు!" అన్నది చిరునవ్వుతో సమాధానంకోసం బలవంతం చేస్తున్నట్లుగా.

శ్రీధర్ మౌనం వహించాడు.

"మనిషి అంతర్యానికీ, సంఘంలో ప్రకటితమయ్యే అతని వ్యక్తిత్వానికీ మధ్య ఏ తెరా వుండకూడదనీ, రెండూ ఒకటి కావాలనీ ఆరోజు వాదించావే జ్ఞాపకం వుందా? నీకీ విషయమై మాట్లాడటం యిష్టంలేదని యిప్పుడు తెలుస్తోంది కదా ! సహజమే!.. పోనీ ఆ ప్రశ్నను యింకోదృష్టితో అడుగుతాను— మాతృత్వంతో స్త్రీ మనస్తత్వంలో ఎంతో మార్పువస్తుంది. పితృత్వంతో పురుషుని మనస్తత్వంలో ఏం మార్పు వస్తుంది? అది సవ్యమైనదా, అపసవ్యమైనదా? దానివల్ల దాంపత్యం ఎలా మారుతుంది? నీ అనుభవమేమిటి?"

"ప్రత్యేకంగా చెప్పదగిన మార్పేమీ లేదనుకుంటాను నా మనస్తత్వంలో."

"కొందరికి పితృత్వమనేది సహజపరిణామం కాదనిపిస్తుంది శ్రీధర్! మావారు నాకు పెళ్లవక పూర్వమే బాగా తెలుసు. ఇద్దరి కుటుంబాలకీ పూర్వమైత్రి వుంది. వివాహమైన మూడేళ్లకి బాబు పుట్టాడు. వాడు పుట్టిన తర్వాత మావారు మారిపోయారు. ఆయనకు సంసారంలో ఆసక్తి కంటె ఉద్యోగ వ్యవహారాల్లో ఆసక్తి బాగా ఎక్కువైపోయింది. మా బాబుని పదినెలల పసివానిగా మా అమ్మ దగ్గర వదిలి పెట్టి చూశాను. కాని నాజీవితం పూర్వంలా లేదు. రానురాను సోమరితనమూ, ఒంటరి తనమే ఎక్కువైపోతున్నాయి. అందుకే బి. టి. చదివి ఒక వ్యాసంగం ఏర్పాటు చేసుకుందామనుకున్నాను... పట్టు వదలిన జీవితాన్ని స్వాధీనం చేసుకోవటానికే యీ ప్రయత్నం.." చంద్రావతి లేచి వెళ్లిపోయింది. శ్రీధర్ ఆమె కన్నీళ్ల పర్యంతం కావటం గమనించాడు.

అయిదు నిముషాల తర్వాత చంద్రావతి తిరిగి వచ్చి "శ్రీధర్, నాకు వంటింట్లో కొంచెం పనివుంది.. ఇప్పటికే ఆలస్యం అయింది. క్షమిస్తావు కదూ.. రేపు కలుసుకుందాం.." అన్నది.

"అలాగే" అని శ్రీధర్ మేడదిగి వచ్చేశాడు.

డబ్బు వుండటమూ, పెద్దగా బాధ్యతలు లేకపోవటమూ అనే పరిస్థితిలో కూడా జీవితం సమస్యల్ని సృష్టిస్తూనే వుంటుంది అన్నసంగతి శ్రీధర్‌కు క్రొత్తగా తెలిసి వచ్చింది. చంద్రావతిని తనవదినె రుక్మిణమ్మతో పోల్చి ఆలోచించాడు. ఎప్పుడూ యింటి బరువు బాధ్యతల్ని మోస్తూ క్షణం తీరికలేని రుక్మిణమ్మ జీవితంలో శూన్యభావం, నిస్పృహ అంటే ఏమో ఎరుగదు. మధ్యతరగతి కుటుంబాలలోని వ్యక్తులకు— స్త్రీలకుగాని పురుషులకుగాని— జీవితం 'పట్టువదలటం' అంటూ ఎక్కడవుంది? జీవితం వాళ్లని క్షణం ఊపిరి పీల్చుకోనివ్వకుండా రంగులరాట్నంలా గిరగిరా త్రిప్పివేస్తూ వుండటమే కారణం.. చంద్రావతి వంటి వాళ్ళు ఏమీ తోచకపోతే, సంఘసేవో రాచకీయాలో ఏదో ఒక వ్యాపకం తప్పకుండా కల్పించుకోవాల్సి వస్తుంది! కాని అందరికీ ఆ కలాపాల్లో అభిరుచీ మెలకువా వుండవద్దూ? చంద్రావతి బి. టి. చదవటానికి నిర్ణయించుకోవటం బాగానేవుంది. అంతకంటె ఆమె తనకొడుకుని దగ్గరేవుంచుకుని వాణ్ణి పెంచేభారం వహిస్తేనే ఆమె మనస్సులోని అశాంతి తగ్గుతుందేమో అని తోచింది శ్రీధర్‌కు.

చంద్రావతి భర్తలో పితృత్వం ఒక సహజపరిణామంగా భాసించక పోవటమేమిటో శ్రీధర్‌కు అర్థంకాలేదు. డబ్బా వ్యవహారాల మీద మనస్సుని లగ్నం చేసేవాళ్ల ప్రవృత్తి అలానే వుంటుంది కాబోలు! ఇదంతా చూస్తే ఆపేక్షలూ, అనుబంధాలూ మధ్యతరగతి కుటుంబాల్లోనే ఎక్కువ ప్రాముఖ్యం వహిస్తున్నట్లూ, పై తరగతివాళ్ల జీవితాల్లో అలా జరగటం లేదనీ, హృదయగతమైన అనుభూతికంటె వాళ్లు నాగరికతకూ, సుఖలాలసతకూ ఎక్కువ ప్రాధాన్యం యిస్తున్నట్లూ తోచింది శ్రీధర్‌కు..ఈ విషయమై చంద్రావతితో ఈసారి విపులంగా చర్చించాలి అనుకున్నాడు.

మరునటి రోజు సాయంత్రం హాస్టలులో ఏదో మీటింగు వుండటంతో శ్రీధర్ చంద్రావతి యింటికి వెళ్లలేదు. రెండు రోజుల తర్వాత మామూలు వేళకు వెళ్ళాడు. శ్రీధర్ వరండాలో నిల్చుంటే తోటమాలి లోపలికి వెళ్ళాడు. అతిథులతో యిల్లు సందడిగా వున్నట్లు కన్పించింది. లోపల హాల్లోనుంచీ మగవాళ్ల ఆడవాళ్ల కంఠాలు వినిపిస్తున్నాయి. ఇద్దరు పిల్లలు తోటలో ఆడుకొంటున్నారు.

చంద్రావతి వరండాలోకి వచ్చింది. "శ్రీధర్ క్షమించాలి, చాలా బిజీగా వున్నాను.. బంధువులు వచ్చారు.. ఆదివారం మనం ఏదైనా మేటినీకి వెళ్దాం, ఏం?" అన్నది.

శ్రీధర్ తిరిగి వచ్చేస్తుంటే తోటమాలి అతనితో గేటు దాకా వచ్చాడు.

"మీరు కాలేజిలో సదువుతారా బాబూ? ఏవూరు?"

"అవును.. మదనపల్లి"

తోటమాలి గేటు మూశాడు మెల్లగా.. శ్రీధర్ పానగల్ పార్కువైపు నడిచాడు. అతని మనస్సుకేమిటో కొరతగా వుంది. బంధువులు వచ్చారు, చంద్రావతికి మాట్లాడటానికి తీరికలేదు. సరే! లోపలికి ఆహ్వానించి బంధువులకి తనని సహాధ్యాయిగా ఆమె పరిచయం చెయ్యగూడదా?.. అయితే వాళ్లకి తనమీదగాని, తనకు వాళ్లమీదగాని ఆసక్తి ఎందుకుంటుంది? అందువల్ల ఆమె చేసిందీ సమంజసమే!.. తనకూ ఆమెకూ మధ్యనున్నది కేవలం స్నేహ బంధమే కద!

అది మామూలు స్నేహబంధం కాదే !

శ్రీధర్ హృదయంలో ఒకక్రొత్త బాధ మెదిలింది. స్నేహానికీ బంధుత్వానికీ మధ్య గల దూరాన్ని గూర్చిన అసంతృప్తి, వ్యక్తికీ వ్యవస్థకూ మధ్యగల భేదాన్ని గుర్తించిన అసూయ.. చంద్రావతి తనకు ప్రియ బాంధవి, ఆరాధ్యదేవత, తనవలెనే బాధాతప్త హృదయం ఆమెదీ; ఆమెను గూర్చి యీ బంధువుల కేం తెలుసు? కాని సంఘందృష్టిలో ఆమె మీద తనకు ఏహక్కూ లేదు! ఈ బంధం సంఘానికీ వ్యవస్థకూ అర్థంకాదు!.. అర్థం కాకపోవటం వల్లనేనా యిది మధురాతి మధురమైన అనుబంధం?

ఆదివారం కోసం ఎదురు చూశాడు శ్రీధర్.

ఆ రోజు 'ఫాంటాసియా' అనే పిక్చరుకి వెళ్ళారు. నాదానికీ, సంగీతంలో స్వరాలకూ వర్ణరేఖలతో చేసిన ఊహాత్మక రూపకల్పన మొదటిభాగం. తర్వాత సృష్ట్యాదిని సూర్యమండల, భూమి, చంద్రుడు మొదలైన గ్రహాలు ఏర్పడటం చిత్రించిన మనోహరమైన వర్ణదృశ్యకల్పన రెండవభాగం. మానవుడి ఆగమనానికి పూర్వం భూమిమీద వుండిన జంతుకోటి చరిత్ర మూడవభాగం.

టాక్సీలో తిరిగి వస్తూండగా శ్రీధర్ ఆ ఊహా సౌందర్య లోకపు ప్రభావం నుంచి యింకా తేరుకోలేదు. అతనిప్రక్కన కుడివైపున చంద్రావతి నెమిలికంఠంరంగు పట్టుచీరతో శరత్కాలపు ఆకాశంలో చంద్రునిలా మనోజ్ఞంగావుంది. ఎడమ వైపు పరుగిడుతున్న మద్రాసునగరం....

"శ్రీధర్, నిన్న నా రిస్టువాచీ రిపేర్ చేయించాను. మధ్యమధ్య ఆగిపోతూన్నట్లు అనుమానంగావుంది, చూడు వర్కుచేస్తోంది దేమో!"

చంద్రావతి వాచీవున్న ఎడమచేతిని శ్రీధర్ భుజాల మీదుగా పోనిచ్చి అతని ఎడమ చెవిమీద మణికట్టుని ఆన్చింది. శ్రీధర్ వాచీశబ్దం వినటానికి ప్రయత్నించాడు. ఆమె బాహుబంధం నాగపాశంలా తనను చుట్టి చుట్టనట్లువుండి ఆమె స్పర్శ కలిగిస్తున్న ఉద్వేగంలో అతనికి వాచీశబ్దం వినిపించనే లేదు.

"ఏమిటి, శబ్దం లేదు కదూ?" అన్నది చంద్రావతి.

"ఏమో ట్రాఫిక్ రొద ఎక్కువగా వుంది"

శ్రీధర్ ఆమె మణికట్టు పట్టుకొని చెవికి దగ్గరగా అదుముకొన్నాడు. ప్రస్తుతాన్ని విస్మరించి నిశ్శబ్దంలో కాలం చేసే లయబద్ధమైన సవ్వడికోసం కేంద్రీకరించిన మనస్సుతో యోగిలా అన్వేషించాడు.. శబ్దం వినిపించింది.

"వర్కు చేస్తోంది."

ఆమె చేతిని తనమీదనుంచి తొలగిస్తూ కొంతదూరంగా జరిగి కూర్చున్నాడు. తర్వాత కుడిచేత్తో ఆమె మణికట్టు పట్టుకుని వాచీవైపు చూచి "టైము సరిగానే వుంది" అన్నాడు.

"ఈ వాచీలోవున్న గమ్మత్తు అదే! సరిగానే నడుస్తున్నట్టుంటుంది, ఎప్పుడు నిల్చిపోతుందో ఎప్పుడు మోసం చేస్తుందో తెలీదు."

"పోనీ క్రొత్తది కొనరాదా?"

"పాత వస్తువులతో బంధం త్రెంచుకోవటం అంత సులువు కాదు శ్రీధర్! కాని త్రెంచుకోవలసే వస్తుంది ఒక్కొక్కసారి విధిలేక!.. అవును కదూ?.. క్రొత్తదే కొంటాను!" చంద్రావతి అతని కళ్లల్లోకి చూచి నవ్వింది ఆత్మీయంగా.

శ్రీధర్ బయటికి చూస్తూ వుండిపోయాడు.

యథాప్రకారం టీ తీసుకుంటూ మేడమీద కూర్చున్నారు.

"మీ వారిని నాకు పరిచయం చెయ్యవా?" అన్నాడు శ్రీధర్.

"ఎప్పుడు చేసేది? యివాళ ఆయన బొంబాయిలో వున్నారు.. ఆయన ఎంగేజ్‌మెంట్సు, ఎంజాయ్‌మెంట్సు, ఆ లోకమే వేరు!.. నాకు ఆలోకంతో సంబంధం లేదు!"

"బి. టి. చదవటం కంటె ఏదైనా సాంఘికసేవ, అంటే శరణాలయం వగైరాలాంటి కార్యకలాపాల్లో ప్రవేశించి నీ లోకం నువ్వు ఏర్పాటు చేసుకోకూడదా?"

"సంఘసేవ చేసే సీతాకోకచిలుక లంటే నాకు మంట, అసహ్యం! అందులో చిత్తశుద్ధి నిస్వార్థం ఏకోశాన లేవే! అదంతా ఒక భేషజం, నటన. ఒక విధమైన చపలనాతితనం. నీకు తెలీదు శ్రీధర్, వీళ్లు డబ్బుకోసం, అధికారంకోసం, పరాయి మగవాళ్లకోసం ఎలా తాపత్రయ పడతారో!.. ఛీ! ఛీ!! అందుకే నాకు మా సొసైటీలో ఆడవాళ్లు స్నేహితు లెవ్వరూ లేరు. అందుకే నేను బి. టి. లో చేరి ఉద్యోగం చెయ్యాలని నిశ్చయించుకోవటం. అలాచేస్తే మనం చేసే పనేమిటో శుభ్రంగా తెలిసినట్టుగా వుంటుందని.. జీవితంమీద నేను పోగొట్టుకొన్న అధికారమూ, ఆత్మసంతృప్తి లభిస్తే చాలు.. ప్రస్తుతం సంఘసేవ అంటే ఎక్కడ చూచినా గాంధీగారి పేరే కదా!.. అందుకే గాంధీ మతప్రచారం మీద నాకు విరక్తి.. నాకు వ్యక్తిగా బ్రతకటంలోని హాయి కావాలి.. ప్రచారమూ యీకుళ్ళూ అక్కరలేదు!"

కోపం, అసహ్యం, తీవ్రమైన ఉద్రేకం చంద్రావతి యిదివరకెప్పుడూ అతని ముందు యిలా ప్రకటించలేదు. శ్రీధర్ కుతూహలంగా ఎన్నో ప్రశ్నలు వేశాడు స్త్రీల సాంఘిక కలాపాల్ని గూర్చి, చంద్రావతికి తెలిసినవాళ్లని గూర్చి. చంద్రావతి చెప్పిన సంగతుల్ని బట్టి అతనికి సంఘంలోని పై తరగతి వాళ్ల జీవితం కేవలం మేడిపండులా కనిపించింది.

## 11

దసరా సెలవుల్లో శ్రీధర్ బందరువెళ్లాడు. కృష్ణకు క్రొత్తనీళ్లు వచ్చి, నది నిండుగావుంది. ఈ మూడునెలల్లో తారకకూడా వళ్లుచేసి క్రొత్తగా కన్పించింది. ఆమె మాటల్లో వాడితనం అక్కడక్కడా చురుక్కుమంటూనే వున్నా శ్రీధర్‌కు పూర్వంవలె బాధ కలుగలేదు. చంద్రావతితో స్నేహం ప్రారంభమయ్యాక అతనికి స్త్రీలు ఒకక్రొత్త దృక్పథంనుంచి అర్థం అవుతున్నారు. వివాహితలు, పిల్లలతల్లులు ఎదురైనప్పుడు వారి వైవాహిక జీవితాలు సుఖప్రదంగా వున్నాయా లేవా అనే కుతూహలంతో వాళ్ల ముఖకవళికల్ని హావభావాల్ని అన్వేషించటం పరిపాటైంది శ్రీధర్‌కు. ఇలా గమనిస్తూవుంటే చాలమందిలో అతనికి అసంతృప్తి మాత్రమే కనిపిస్తోంది. వివాహబంధాన్ని కాదంటూ సంఘాన్ని విమర్శించే తిరుగుబాటూ తీవ్రభావాలూ వాళ్లలో కనిపించకపోయినా, మొత్తంమీద ఎవరి మటుకు వాళ్లకు పరిస్థితుల్లో ఏదో ఒక కొరత, ఏదో ఒక లోపం వుంటూవున్నట్లే అతని పరిశీలన దృఢపరుస్తోంది.

రైల్లో ఏదైనా కుటుంబం ఎదురైతే, వాళ్ళ మాట్లాడుకునే దాన్నిబట్టీ, వాళ్లలోవాళ్లు పరస్పరం వ్యక్తం చేసుకునే ప్రేమాదరాల తీరునుబట్టీ శ్రీధర్‌కు సులభంగా సమస్య ఏమిటో తెలిసినట్లైపోతుంది. ఒక ఆమెకు నగలమీద ప్రీతి, కాని భర్త సంపాదన అందుకు చాలటంలేదు. ఇంకొక స్త్రీకి విరామం లేకుండా పిల్లలు కలగటంతో పిల్లల మీదా భర్తమీదా కూడా విసుగూ, చిరాకూ. మరొక చదువుకున్న యువతికి వివాహం కావటంతో ఉద్యోగం చేసే అవకాశం లేకపోయిందన్న అసంతృప్తి. సమష్టి కుటుంబాల్లో మరదులు, ఆడబిడ్డలూ, అత్తమామలూ జోక్యంవల్ల కలిగే ఘర్షణ ప్రభావం కొందరిలో కనిపిస్తూ వుంటుంది. ఒక్కొక్కరిలో సంతానం కలగక పోవటమే పెద్ద అసంతృప్తిగా వుంటుంది. పై చెప్పిన కారణాలవంటివేమీ లేకపోయినా చంద్రావతి కూడా అశాంతిలో బాధపడుతూనే వుంది! తనకూ తారకకూ మధ్య సమస్యేవిటో ఎంత తరచినా అతనికి అంతుపట్టటమే లేదు!.. పోతే సుఖపడుతున్న వాళ్లెవరు?

జీవితంలో ఏ ఆదర్శం ఎన్నికచేస్తే బాగుంటుంది, సంఘ సంస్కరణకు దోహదమిస్తే మంచిది అనేధోరణిలో శ్రీధర్ యిప్పుడు ఆలోచించటం లేదు. జీవితం కథంతా వివాహమైన తర్వాతే ప్రారంభమౌతుంది; సంఘజీవనంలో ముఖ్యమైన భాగం వివాహితులకే చెందిందనే అభిప్రాయానికి వస్తున్నాడతను. అందులో నిలకడా, సంతృప్తి సాధించడ మెలాగ ? కవిత్వమూ కథలూ, చదువూ సినిమాలూ అవివాహితుల మనస్తత్వాన్ని, వాళ్ల ఆదర్శాల్ని 'ప్రేమ' లాంటి సమస్యల్ని చాటి చెప్పినంతగా వివాహితుడైన వ్యక్తి ఆంతరంగిక జీవితాన్ని గూర్చి చెప్పవలసిన యదార్థం చెప్పటంలేదే, ఎందుచేత?···అనిపిస్తోంది అతనికి... వివాహితులైన వాళ్లని గూర్చి కథలూ పుస్తకాలూ లేకకాదు, ఎన్నో వున్నాయికాని శ్రీధర్‌దృష్టిలో అతనికి కావలసిన విషయాన్ని గూర్చి చర్చించిన సాహిత్యమే కనిపించటం లేదు.. పూర్వగ్రంథాల్లో 'సంసారం మహాసాగరం' అంటూ భక్తిమార్గాన్నీ వేదాంతాన్నీ ఉద్బోధించటమైతే వుందిగాని, సాగరం ఎలా ఈదాలో, యిప్పటి పరిస్థితుల కన్వయించదగిన పరమార్థమేదో అదిమాత్రం అతనికి లభించటంలేదు! నవ్యసాహిత్యంలో సంఘానికీ వ్యక్తికీ సంఘర్షణ రెండురకాలుగా—'సెక్స్' లేక 'ఆర్థిక' సమస్యగా—రూపొందింది. లేచిపోయిన ఆడవాళ్ళూ, భగ్నప్రేమికులైన మగవాళ్ళూ, సంఘ దురన్యాయానికి బలైపోయిన పేదవాళ్ళూ, సంఘసంస్కరణ కోసం అష్టకష్టాలుపడ్డ యువకులూ, రాజకీయవాదులూ చిత్రింపబడ్డారుకాని సాంఘిక వ్యవస్థని ఆమోదించి లోబడి

దానితో ఘర్షణ పడకుండా జీవించటానికి ప్రయత్నించే వ్యక్తే వుంటే అతను ఎందుకు సుఖ సంతోషాలకి నోచుకోక అసంతృప్తి పాలౌతాడో, 'దురదృష్టం' అంటే ఏమిటో వివరించి చెప్పే కథగాని, నవలగాని శ్రీధర్‌కు కనిపించలేదు.

నిజానికి వ్యవస్థతో రాజీపడి బ్రతకదలచుకునేవాళ్ళే లోకంలో అధికసంఖ్యాకులు. అయితే వాళ్ళలో చాలమందికి మన శ్శాంతి లేకపోవటానికి కారణ మేమిటి? డబ్బు లేకపోవటం, చాలకపోవటం అనే కారణం ఎక్కడపడితే అక్కడ ఎదురవుతున్నా అసంతృప్తికి దానికంటె మూలకారణం వుందనే శ్రీధర్ అభి ప్రాయం. ఏమంటే చంద్రావతి విషయంలో డబ్బుకి లోటు లేదు, సంఘంతో సంఘర్షణేమీ లేదు, సంతానాన్ని గూర్చిన కొరత లేదు. భర్తవైఖరి సంపాదనవైపు మళ్ళినా ఆమెకు భర్త మీద గౌరవానురాగాలున్నాయనటంలో సందేహమూ లేదు. అయినా ఆమెలో నిర్వేదం వుంది! ఏమిటీ నిర్వేదం? 'జీవితం మీద పట్టు తప్పిపోయింది' అంటుం దామె. ఆ వాక్యానికి అర్థమే స్ఫురించటం లేదు ఇదమిత్థమని. అయితే అలాటిదేదో తనకూ అనుభవమే ఒకవిధంగా. జీవితం తనకూ స్వాధీనంలో లేదు. ఎప్పు డేం జరుగుతుందో! ఒకసారి బాగానే వున్నట్లుంటుంది, ఒకసారి అంతా తలక్రిందు లైనట్లు వుంటుంది, మరి యీ అనిశ్చిత పరిస్థితికి అంతమెప్పుడు? ఇలా బహుశా యిద్దరిసమస్యా ఒక్కటే నేమో!

అనుకోకుండానే సెలవులు సంతోషంగా సుఖప్రదంగా గడిచిపోవటం శ్రీధర్‌కు ఆశ్చర్యం కలిగించింది! మామగారు బాగా ఆదరించారు. ఎక్కడా బాధ కలిగేమాటగాని సూచనగాని రాలేదు. మరి యిదంతా తను అనుకోకుండానే ఇలా సవ్యంగా జరగటం ఎందువల్ల?

సెలవుల్లో విశ్వనాథవారి ''వేయిపడగలు'' నవల చదివాడు శ్రీధర్. ఒకవ్యవస్థ, దానినంటి పెట్టుకున్న ఒకతరహా జీవనమూ నాగరకతా, దాని విలువలూ ఎలా మారుతూవచ్చాయో ఆవేదనతో చిత్రింపబడిన ఆ నవలలో కూడా శ్రీధర్ ప్రశ్నకు సమాధానం లభించలేదు. వ్యక్తి జీవితంలో అసంతృప్తి పాతసాంఘిక ఆధ్యా త్మిక వ్యవస్థ పతనం కావటంవల్ల ఏర్పడిందా? అయితే ఆ వ్యవస్థ స్వరూపం మారి, వేయిపడగలూ ఒక్కొక్కటి విరిగి పడటానికి కారణం. కేవలం విదేశీయుల పరిపాలన, పాశ్చాత్య నాగరకతా ప్రభావం, ఆర్థిక వ్యవస్థలో మార్పు అన్న సమాధానం అదీ సంతృప్తికరంగా లేదు శ్రీధర్‌కు! భారతీయమైన హైందవ మైన ఆ వ్యవస్థే గొప్పదైతే, దానికంటే గొప్పదికానిదానిముందు అది పతనం కావటం ఎందుకో! కాలప్రభావమా? అంటే దాని కర్థమేమిటి?.. అందువల్ల శ్రీధర్‌కు ఆ నవల వ్యక్తంచేసిన చారి త్రక చలన దృశ్యం హృదయంలో ఒక ఆవేదననూ విచారాన్నీ కలిగించిందేకాని, అతనిలో రేకెత్తిన ప్రశ్నమాత్రం సరియైన సమాధానం స్ఫురింప జేయలేదు.

సెలవుల్నించి మద్రాసు తిరిగి వచ్చిన తర్వాత ఒకనాడు చంద్రావతితో ''వేయిపడగలు'' నవలను గూర్చి ప్రస్తావించాడు శ్రీధర్.

''ఒక మహావ్యక్తి మరణిస్తాడు.. అతన్ని గూర్చి స్మరించ టమూ, అంజలి ఘటించడమూ సహజమే.. కాని అదే ధ్యాసతో నిరంతరమూ ఉండటం మనజీవితాన్ని, విధ్యుక్తధర్మాన్ని మనం నిర్లక్ష్యం చెయ్యడమే అవుతుంది.. అలానే ఒక వ్యవస్థ మారింది.. ఏడ్చి లాభమేమిటి? నా కా నవల రుచించలేదు!'' అన్నది చంద్రా వతి.

''మహావ్యక్తికీ వ్యవస్థకూ పోలిక పెట్టడం సరికాదను కుంటాను. ఏమంటే ఎంతటి వ్యక్తి అయినా మృత్యువుని తప్పించు కోలేడు గదా! వ్యవస్థ అనేదీ, ధర్మము అనేదీ ఎందుకు నశించాలి? అది చిరస్థాయిగా వుండవలసిందే కద! అది ఆర్థిక వ్యవస్థకు అతీత మైనది కాదా?''

''ఇందులో ఒకభ్రమ వుంది శ్రీధర్! వ్యక్తి అంటే ఏమిటి నిర్వచనం? అతని దేహమా? మనస్సా? పోతే ఆత్మ అం టారే అదేమిటి? ఇదంతా జిజ్ఞాసచేసి సంపాదించవలసిన జ్ఞానం; ఇందులో మృత్యువుకూ మార్పుకూ అతీతమైన వస్తువు ఏమైనా వుందో లేదో—ఆత్మ అలాటిదని అంటారే— అది ఎవరికి వారు తెలుసుకోదగిన సంగతి. ఒకరు చెబితే నమ్మి ఊకదంపుడుగా మాట్లాడవలసిన సంగతి కాదు.. అలాగే యివాళ హైందవవ్యవస్థా, సంస్కృతీ, వానితోబాటు మూలధర్మమూ బ్రతికేవున్నాయో గతించి శల్యావశిష్టమయ్యాయో, లేక వ్యవస్థమారినా మూల ధర్మం అలానేవుందో ఎవరికి వారే నిర్ణయించుకోవాల్సిన సంగతి. అందువల్లే అది వివాదగ్రస్తమైన సంగతికూడా.. నామటుకు నాకు వ్యవస్థ మారుతుందీ, నశిస్తుందీ, దాన్ని గూర్చి పెద్దగా దుఃఖించ నక్కరలేదు అనిపిస్తుంది. దుఃఖించడము మానవ సహజమేగాని, ఆ దుఃఖములో మరేమీ చూడలేకపోవటం బల హీనత, చేతకానితనం. అదే జీవితంమీద అధికారం లేకపోవటం కూడా!.. ఆ నవలలో కనిపించేది వ్యవస్థయొక్క బాహ్యస్వరూపమే తప్ప దాని మూలధర్మంకాదు. ఎవరో అన్నట్లు అందులో పడగలు తప్ప పాములేదు!.. శ్రీధర్, మనలో గొప్పలోపం మనకు జీవితం మీద గాఢవిశ్వాసం లేకపోవటం....''

''అంటే ఏమిటి? అదెలా వస్తుంది?''

''ఏమో నాకూ అది తెలీకనే కదా ఈ అవస్థ!''

*   *   *

డిసెంబరు నెలలో ఒక ఆదివారం ఉదయమే శ్రీధర్‌ని తనయింటికి రమ్మని ఆహ్వానించింది చంద్రావతి. ఎప్పుడైనా ప్రొద్దుటిపూట సినిమా 'షో'కి వెళ్ళాలనుకుంటే అలానే రమ్మనేది. ఈసారి శ్రీధర్ వెళ్ళేటప్పటికే బయలుదేరటానికి సిద్ధంగా వుంది చంద్రావతి. ఏమీ చెప్పకుండానే కారులో కూర్చోమన్నది. శ్రీధర్ ముందుసీట్లో కూర్చున్నాడు. అతనెప్పుడూ చంద్రావతి వాళ్ళ కారులో వెళ్ళలేదు. కారుని చూడగానే బహుశా చంద్రావతి భర్తకూడా సినిమాకు వస్తాడనీ, అలా అయితే భార్యాభర్తలు వెనకసీట్లో కూర్చోవటం బావుంటుందనీ అలా చేశాడు. ఇంతలో లోపలినుంచీ చంద్రావతి అయ్యరు కుర్రవాడితో 'లంచ్‌బాస్కెట్' పట్టించుకొని వచ్చి వెనకసీట్లో పెట్టించింది.

''ఎక్కడికి? ఏదో ప్రయాణంలా వుందే?'' అన్నాడు శ్రీధర్.

"చెబుతా.. పిక్నిక్" అని లోపలికి వెళ్ళింది చంద్రావతి.

తర్వాత కొంతసేపటికి ఆమె తిరిగివచ్చి స్టీరింగ్ దగ్గర కూర్చుంది.

"నీకు డ్రైవింగ్ వచ్చు నన్నమాట!.. మీ డ్రైవర్ ఏమ య్యాడు? మీవారు కూడా వస్తా రనుకున్నాను".

కారు బయల్దేరింది.

"మావా రెక్కడున్నారు? ఇవ్వేళ రంగూన్‌లో వుంటారు. డ్రైవర్‌కి సెలవు".

"ఎక్కడికీ ప్రయాణం?" అన్నాడు కొంత ఆశ్చర్యంతో శ్రీధర్.

"ప్రపంచానికి కాస్త దూరంగా పారిపోదామని..."

"అడయారు వైపా?"

చంద్రావతి సమాధానం చెప్పలేదు. శ్రీధర్ కామెధోరణి క్రొత్తగా తోచింది. అలా ముభావంగా వుండటం ఆమె స్వభా వానికే వ్యతిరేకం. బహుశా డ్రైవ్ చేస్తూండటంవల్ల ఏకాగ్రత చెడుతుందని ఆమె ముక్తసరిగా వుందేమోనని శ్రీధర్ కూడా మౌనం వహించాడు.

కారు గిండీ దాటింది.

శ్రీధర్ మళ్ళీ అడిగాడు గాని సమాధానం రాలేదు...

ఒక యువతి డ్రైవ్ చేస్తున్నకారులో తను ఆమె ప్రక్కనే కూర్చుని ఎక్కడికో తెలీని ప్రదేశానికి వెళ్ళిపోతూ వుండటం— అలా ఊహించుకొని చూస్తే ఎదురుచూడని ఆ అనుభవంలోని క్రొత్తదనం అతణ్ణి ముగ్ధుణ్ణి చేస్తోంది.. కాని మరోవైపు ఏమిటో సంకోచమూ అనుమానమూ..

కారు తాంబరం రైల్వేస్టేషన్ దాటింది.

శ్రీధర్‌కు తను నాగరాజు ఆహ్వానంమీద క్రిస్టియన్ కాలేజిహాస్టళ్ళ వార్షికోత్సవానికి వెళ్ళిన సాయంకాలం— మాయ లత— ఆమెతో సంభాషణ— అన్నీ జ్ఞాపకం వచ్చాయి— మాయ లతతోబాటు మొగలి అత్తరు పరిమళమూ....

శ్రీధర్ కారులో యిటునటు చూచి, వెనుకసీటులో వున్న చంద్రావతి నల్లటిబ్యాగ్‌ని వంగి తీసుకున్నాడు......

చంద్రావతి ప్రశ్నార్థకంగా అతని వైపొకసారి చూచి మళ్ళీ రోడ్డువైపు దృష్టిమళ్ళించింది.

శ్రీధర్ బ్యాగ్ తెరిచాడు. అద్దం, దువ్వెన, చేతిరుమాలు, అయిదు పదిరూపాయలనోట్లు —యధాప్రకారం, పూర్వం ఆమె తనకు ఆ బ్యాగ్ యిచ్చినప్పుడున్నట్లే వున్నాయి. కాని శ్రీధర్ అన్వేషణంతా అందులో పూర్వం కనిపించిన మొగలిరేకు కోసం! ఆ మొగలిరేకు కనిపించలేదు! శ్రీధర్ తెరచివున్న బ్యాగ్‌ని ఆఘ్రాణించాడు. అతనికి అందులో మొగలివాసన ఛాయా మాత్రంగా కూడా గోచరం కాలేదు. ఇంకేదో అనిర్దేశితమైన అపరిచితమైన పరిమళం తోచింది.

చంద్రావతి మళ్ళీ అతనివైపు చూచింది... నవ్వుతూ.' "ఏమిటి అంతవింతగా పరీక్షచేస్తున్నావ్! ఆ బ్యాగ్ రహస్యాలన్నీ ఛేదిస్తున్నావ్!... అంతగా యిష్టమైతే పోనీ తీసేసుకోరాదూ! ఆడవాళ్ళ బ్యాగ్ అంటే అంత ఆకర్షణేమిటీ నీకు?"

"అదికాదు.. ఇదివరకు యిందులో ఒక మొగలిరేకు చీలిక చూచాను. ఇప్పుడది లేదు, దాని వాసనా లేదే!"

చంద్రావతి పడిపడి నవ్వుతోంది.

"తర్వాత తీరిగ్గా నవ్వవచ్చు, డ్రైవింగ్ జాగ్రత్త మేడమ్!"

"అదికాదు...నీకు మొగలిరేకుల వాసన అంటే అంత యిష్టమని నాకు తెలీదు! చూడు, నిన్ను గురించి యిన్నాళ్ళూ ఎన్నో విషయాలు తెలుసుకొన్నా, ఈ ఒక్కవిషయం తెలీలేదే!.... వైవిధ్యం వుండాలి కదా ఎందులోనైనా.... అప్పుడు మొగలిరేకు సరే, యిప్పుడు యింకో వాసన!..... ఏం బాగులేదా?...ఈ పరి మళ మేమిటో పోల్చుకోలేదా?"

"లేదు, ఏదో క్రొత్తగా వుంది!"

"ఏం? క్రొత్త అంటే నీకు సరిపడదా?....ఈవెనింగ్ ఇన్ పారిస్.... పేరే చాల గమ్మత్తుగా వుంది కదూ?.... ఇది అంద రికీ తెలిసిందే, ప్రసిద్ధమైందే..... ఒక్క శ్రీధర్‌కు తప్ప!"

కృత్రిమమైన ఈ అత్తరుల కంటె పువ్వులనుంచి వచ్చే పరిమళమే నాకిష్టం......"

"శ్రీధర్, ఏది కృత్రిమం? ఏది కాదు? అసలీ విభేద మేమిటంట? ఒక పరిమళం తాలూకు అనుభూతి ఎలావుంది అనే ప్రశ్న ముఖ్యంకాని, దాని గుణ నిర్ణయానికి అది పువ్వునుంచీ వచ్చిందా కోల్‌టార్ నుంచీ వచ్చిందా అన్నప్రసక్తి కేవలం అన వసరంకాదు!.... తర్కించే కొద్దీ నాకు కనిపిస్తున్న దేమిటంటే జీవితానుభవాల విషయంలో చూడవలసింది అనుభూతే తప్ప ఆ అనుభూతికి మూలమైన కారణమైన పరిస్థితుల యొక్క, వస్తువులయొక్క గుణ విమర్శ కాదు.... నాకో తమాషా ఉదాహ రణ జ్ఞాపకం వస్తోంది. ఆలిస్— వండర్‌లాండ్ కథలో ఒక చమ త్కారపు సంగతి వుంది, పిల్లి నవ్విందట. ఆలిస్ ఆశ్చర్యపడి చూస్తూంటే మిగిలింది నవ్వేనట కాని పిల్లి అక్కడ లేనేలే దట... అలాగే జీవితాన్ని విశ్లేషించి చూస్తే, సత్యంగా నిలిచి గోచర మయ్యేది అనుభూతి ఒక్కటేకాని అనుభవాలు కావు... పువ్వు లెన్నోరకాలు, మధు వొక్కటే!... ఏమంటావ్?"

శ్రీధర్ జవాబు చెప్పలేదు. చంద్రావతి ఆలోచన తీసే పరుగుల్ని అతను తరచు అందుకోలేడు గాని, చంద్రావతి కూడా యించుమించు నాగరాజు ప్రతిపాదించిన సిద్ధాంతం వంటిదాన్నే జీవితానుభూతి అంటూ ఏదో సిద్ధాంతాన్ని ప్రతిపాదిస్తోంది కాబోలు!

శ్రీధర్ జ్ఞాపకంలో ఆచివరి దృశ్యం— తను నాగరాజుతో పోట్లాడిన దృశ్యం నిలిచింది......

నాగరాజు— సిసీలియా— భ్రూణహత్య—

మద్రాసునుంచి వెళ్ళిన తాను, మళ్ళీ మద్రాసుకే ఎందుకు తిరిగి వచ్చినట్లు? శ్రీధర్‌కు ఆశ్చర్యం కలిగింది. ఒకదాని వెంబడి ఒకటి కారణాల తోరణాలు, సంఘటనల వరుస ఆవర్తమై అతను వదిలిపెట్టి వెళ్ళిన చోటికే మళ్ళీ అతణ్ణి తెచ్చి నిల్చోబెట్టాయి...

నాగరాజు బదులు చంద్రావతి... అంతేనా భేదం? లేక ఆ భేదం భేదమే కాదా?

ఎక్కడికో చెప్పకుండా, ఉన్నట్టుండి యింత ధైర్యంగా కారు స్వయంగా డ్రైవ్‌చేస్తూ, పిక్నిక్ బయల్దేరదీసిన చంద్రావతిని ఎలా అర్థం చేసుకోవాలి?.....

కలిసి సినిమాలకు వెళ్ళటం వేరు. ఆత్మీయత వేరు. ఇలా కారులో ఎక్కడికో దూరంగా ఏకాంతంగా పిక్నిక్ వెళ్ళటంవేరు. లోకం ఏమనుకుంటుంది?

"మనం ఎక్కడికీ వెళ్ళేది? ఆచో ఏదో ఆసంగతి ఎందుకని నాతో చెప్పకుండా దాచావ్?" అన్నాడు శ్రీధర్.

"మహాబలిపురం... ఇదుగో చెంగల్పట్టు వచ్చేశాం.. నువ్వు కనుక్కుంటావో లేదో చూద్దామనుకున్నాను... కాని లాభం లేదు. నీకు ఈ పిక్నిక్‌ను గురించి సరదానే వున్నట్టులేదు" అన్నది చంద్రావతి.

"మహాబలిపురమైతే నాకూ యిష్టమే! నాకు చూడాలని ఎన్నాళ్ళనుంచో వుంది!"

అలా అని అన్నాడే కాని శ్రీధర్ మనస్సు మనస్సులో లేదు. జరుగబోతున్న దేమిటి? మహాబలిపురంలో శిల్పాలను చూచివచ్చి వెయ్యటమేనా?...ఇది బహుశా తనకు ఒక పరీక్ష.. దీనికి పర్యవసానం ఎలా వుంటుంది?......

"ఇదే పక్షితీర్థం... ఇంకోసారి ఎప్పుడైనా రావచ్చు యిక్కడికి! అంటూ చంద్రావతి, పక్షులు రావటాన్ని గూర్చిన సిద్ధాంతాలు నమ్మకాలు విమర్శిస్తోంది.

ఏది ఏమైనా స్నేహాన్ని యధాతథంగా వుంచే ప్రయత్నం చెయ్యాలి తను! ఈ బాధ్యత తనదే, తనదే! ఇక్కడ తనకు ఓటమి సంభవించకూడదు!....

కారు మహాబలిపురం చేరుకున్నది....

ఒక గంటకుపైగా తిరిగి శిల్పాల్ని, శిథిలాల్ని చూశారు.

సముద్రానికి దగ్గరగావున్న ఒక దేవాలయ ప్రాంగణంలో ఏకాంతస్థలాన్ని ఎన్నిక చేసుకుని అక్కడికే 'లంచ్ బాస్కెట్' తెచ్చుకున్నారు.

లంచ్ ముగిసింది. సంభాషణ యావత్తూ మహాబలిపురం చరిత్రమీద, శిల్పవైశిష్ట్యం మీద సాగింది. శ్రీధర్ మనస్సుకు హాయిగా సంతృప్తిగా వుంది.

ఎదురుగా సముద్రం కనిపిస్తోంది. చలికాలం కావటంతో ఎండ తీవ్రంగా లేదు. మధ్యాహ్నం రెండుగంటలైంది.....

"నువ్వెప్పుడైనా సముద్రస్నానం చేశావా? కొండల్లో వుండేవాడివి..." అన్నది చంద్రావతి.

"ఆఁ.. ఒకసారి గ్రహణం సమయంలో విద్యార్థులం వెళ్ళాము..." విద్యార్థుల కొంటెతనమూ, వాళ్ల ప్రవర్తనా మాటలూ, స్నానంచేస్తున్న ఆడవాళ్లపట్ల వాళ్లు ఆసమయంలో చూపిన కుతూహలమూ శ్రీధర్‌కు జ్ఞాపకంవచ్చి, సిగ్గుపడ్డాడు. ఆ విషయాన్ని గూర్చి ప్రసంగం అంతటితో ఆపివేశాడు.

"అయితే అల వచ్చినప్పుడేం చెయ్యాలో వగైరా విషయాలు తెలుసన్నమాట!... నేనూ మావారూ చాలాసార్లు సముద్రస్నానం చేశాం.. మాకెంతో సరదా!" అన్నది చంద్రావతి.

శ్రీధర్ సముద్రంవైపు చూస్తున్నాడు బెరుగ్గా. అతనికి సముద్రంలో దూరాన నౌకలాంటిది కన్పించినట్లయింది. అది నావేనో కాదో అని పరకాయించి చూస్తూ పరధ్యానంగా వున్నాడు.

చంద్రావతి లేచివెళ్ళి బాస్కెట్‌లోనుంచి ఒక ప్లాస్టిక్ కేస్ తీసుకువచ్చింది.

"స్నానంచేద్దాం... కారులో టవల్స్ వుంచాను తీసుకువస్తావా? నేనంతలో డ్రెస్ మార్చుకుంటాను..." అన్నదామె.

"నువ్వింకో చీరా అన్నీ తెచ్చుకున్నా వేమిటి? మరి నేనేమీ తెచ్చుకోలేదే!" అన్నాడు. ఈ స్నానం ప్రసక్తి అతనికి సుతరామూ యిష్టంగా లేదు.

చంద్రావతి ప్లాస్టిక్‌కేస్ తెరిచి 'బేదింగ్‌సూట్' బయటికి తీసి చూపించింది అతనికి.

శ్రీధర్‌కు మతిపోయినట్లైంది. ఏమనాలో తోచక చంద్రావతి వైపు చూచి, తర్వాత ఎటో చూశాడు. అతనికి వళ్లంతా చెమట పోస్తున్నట్లయింది.

చంద్రావతి శ్రీధర్‌ను గమనిస్తోంది. చివరకు—

"నీకు నాతో స్నానం చెయ్యటానికి సిగ్గు కాబోలు!" అన్నదామె నవ్వుతూ.

శ్రీధర్ తలవంచుకుని, మనస్సు చిక్కబట్టుకుని, "అవును, అయినా ఉప్పునీటి స్నానం బావుండదు నాకు, వళ్లంతా బంక పట్టుతుంది... విశ్రాంతి తీసుకుని ఇంకో గంటకు వెళ్లిపోదాం... స్నానం గీనం వద్దు!" అన్నాడు గబగబా.

"అలాగే... నువ్వు విశ్రాంతి తీసుకో... నాకు సముద్రంలో అలలతో ఆడుకోవటమే బాగుంటుంది... నువ్వటు వెళ్ళి టవల్సు తెచ్చిపెట్టు... నేను డ్రెస్ మార్చుకుంటానేం?" అన్న దామె బేదింగ్ సూట్ విప్పుతూ....

శ్రీధర్‌లో ఆవేదనా, దుఃఖమూ పొంగివచ్చాయి.

"వద్దు.. నువ్వీ దుస్తుల్లో సముద్రస్నానం చేస్తావని నేనెప్పుడూ ఊహించలేను!.. నా కిష్టం లేదు!...వద్దు!! వెస్ట్‌లో ఆదేశాల్లో, వాళ్లేమైనా చెయ్యనీ, మనకక్కరలేదు...." అతని మాటలో ఉద్వేగం, ఆజ్ఞాపిస్తున్న ధోరణి వ్యక్తం అయింది.

చంద్రావతి అతని ఉద్వేగాన్ని గమనించీ గమనించనట్లే నెమ్మదిగా అన్నది: "ఇందులో తప్పేమిటి శ్రీధర్? సముద్రస్నానం ఆరోగ్యానికి మంచిది... బరువైన మామూలు దుస్తులతో ఎలా స్నానం చెయ్యటం? దీనికి తూర్పు పడమరలతో ఏమీ సంబంధం లేదు!"

శ్రీధర్ ఆమెవైపు చూడలేకపోయాడు. సముద్రంవైపే చూస్తూ కొంతసేపటికి ప్రాధేయపూర్వకంగా అన్నా డామెతో:

"నాకు నీలా వాదించే శక్తిలేదు!... నేను సెంటిమెంటల్ క్రీచర్‌నే కావచ్చు.... కాని...కాని.. నాకిది సవ్యమైన విషయంగా కన్పించటంలేదు చంద్రావతి!.... నామనస్సులో ఏమున్నదీ యిది

వర కొకసారి చెప్పాను ఆరాత్రి బీచ్‌లో.. ఇప్పుడూ చెబుతాను— ఎంత అప్రస్తుతంగా సెంటిమెంటల్‌గా కన్పించినా సరే— నిన్ను మా వదినెతో పోల్చుకున్నాను ఎన్నోసార్లు... మా వదినె నాకంటె పెద్దదే కాదు, నన్ను వాత్సల్యంతో చూస్తుంది కూడా.. ఆమె మీద నాకు గౌరవభావం— నీమీద నాకు గౌరవభావమేకాదు, ఆరాధనా భావం కూడా— నేను యింటరులో వున్నప్పుడు భారతదేశం అంటే ఒక స్త్రీమూర్తిగా ఊహించుకొన్నాను...ఆమెను నిత్యమూ మావదినె మంచితనంలో గొప్పతనంలో చూచేవాణ్ణి.... మళ్లీ నీలో చూచాను, ఎంతో గొప్పగా, ఉజ్జ్వలంగా, మేధాశక్తితో తత్త్వవిచారణ చేయగలిగిన బుద్ధికుశలతతో, నాకు ఉపదేశం చేసే గురువుగా కనిపించావు— ఇదంతా సెంటిమెంటే, సందేహం లేదు—కాని ఈసెంటిమెంట్‌ని, ఈ కలని నిర్దాక్షిణ్యంగా అంతమొందించవద్దనే నేను కోరుతున్నాను.... నువ్విలా వుండాలనీ, లేక యిలా చెయ్యకూడాదనీ ఆంక్ష పెట్టే అధికారం నాకు లేదు— కాని మనస్నేహం చూచి నాకి పరీక్ష పెట్టవద్దని కోరుతున్నాను..''

చంద్రావతి నవ్వుతూ అన్నది!

''నన్ను అంతలా అందల మెక్కిస్తే క్రింద పడకుండా ఎలా ఉండగలను శ్రీధర్ ! నువ్వు విచిత్రవ్యక్తివి ! నీ సెంటిమెంట్స్‌కి బాధ కలిగించటం నా కిష్టంలేదు ! నాకూ ఉన్నాయి బాబూ సెంటిమెంట్స్ ! .... కాని ఉద్రేకపడకుండా నిదానంగా, నిశ్చలంగా తర్కించి చూడు .... నేను బేదింగ్ సూట్‌తో సినిమా పోస్టరులా నడివీధిలో నుంచోబోవటం లేదు ! నిన్ను ఆత్మీయుణ్ణిగా ఎంచుకున్నాను కాబట్టే సందేహించలేదు.... ఇది నీకు పరీక్ష అని నువ్వనుకోవట మెందుకో !''

శ్రీధర్ తికమక పడ్డాడు. ఆత్మపరిశీలన చేసుకున్నాడు. ఈ పొరపాటు తనలోనే ఉందా ? తన సందేహంలోనే ఉందా ఈ కాలుష్యం ?

''నేను నీవలె తర్కించుకొని సహేతుకంగా ఏదీ చెప్పలేను. ఈ విషయంలో నా అభిప్రాయ మేమిటో, నా విశ్వాస మేమిటో చెప్పాను. ఇది తర్కానికి అందని విషయం.... విశ్వాసాల్ని తర్కంతో పడగొట్టుకుంటూ పోవటంవల్ల లాభం లేదనిపిస్తుంది..... కొంతదూరం ఉత్సాహంగా వెళ్లగలం కాని ఎక్కడో ఒకచోట ఆగిపోవలసిందే ! లేకపోతే ఏమీ మిగిలేట్టు తోచదు !''

''రైట్ ! ఇక ఆ విషయం అంతటితో వదిలివేద్దాం.... ఈ మహాబలిపురం చూడు, యింతకు మూడింతలో నాలుగింతలో పట్టణం ఉండేదట, కాని ఆ భాగం సముద్రంలో కలిసిపోయింది. మిగిలిం దిది .... ఎన్ని సౌందర్య కల్పనలు-అలాగే సెంటిమెంట్స్; ఎన్ని శిల్పాలూ, ఆలయాలూ—అలాగే విశ్వాసాలూ వ్యవస్థలూ; మానవచరిత్ర అనే సాగరగర్భంలో, కాలంలో అంటే ఎప్పటి కప్పుడు నూతనంగా చొచ్చుకు వచ్చే అభిరుచులకూ, తర్కం అనే అలల తాకిడికీ—కనబడకుండా పొయ్యాయో ! .... ఇది గమనిస్తే, ఏమనిపిస్తోంది ? పోయినవాటికంటె ఈ మిగిలినవాటి ఆధిక్యం ఏమిటి ? అనుకోవచ్చు. అలాకాదు, ఇవి ఏ అదృష్టం వల్లనో యిలా మునిగిపోకుండా మిగిలిఉండటమే వీటి ఆధిక్యం కదా ! అని కూడా అనుకోవచ్చు. మొదటి విధంగా అనుకుంటే అవిశ్వాసమూ, నాస్తికత్వమూ .... రెండోవిధంగా అనుకుంటే విశ్వాసమూ, ఆస్తికత్వమూ .... ఇంతే భేదం శ్రీధర్ ! .... ఇది మారిన, మారుతున్న మన దేశ సంస్కృతికీ, సంఘ వ్యవస్థకూ సంబంధించిన సత్యమే కాదు— వ్యక్తుల్లోనూ యింతే ! ..... నేను పెళ్లయినా కాలేజిలో చదువుతూ ఉండటం, నీతో సినిమాలకు తిరుగుతూ ఉండటం నీకు ఎబ్బెట్టుగా లేదు— అంతమేర ప్రాత పద్ధతులు నీలో తర్కానికీ, నూత్న భావాలకీ లొంగిపోయినట్లే కదా ! కాని నేను బేతింగ్ సూట్ వేసుకొని సముద్రస్నానం చేస్తాననగానే, నువ్వు ఈ విషయం నీ సెంటిమెంట్స్‌కీ, దృఢ విశ్వాసాలకీ చెందిందని చెబుతూ, అక్కడ తర్కానికి ప్రవేశార్హత లేదంటూ ఆగమన్నావు .... ఇది నీలో మిగిలిన 'మహాబలిపుర' మన్నమాట !''

''పోనీ, యిదైనా నిలవటం మంచిదే కద ! లేకపోతే వట్టి యిసుక మిగిలేది !''

''నిలవటం మంచిది కాబట్టి నిలవాలనే నిర్ణయం, ఎవరు చేస్తున్నారు శ్రీధర్ ? అదీ నా ప్రశ్న .... నిలిచిందేదో అది గట్టి—దీన్నీ రేపు అలలు పైబడి వచ్చి ముంచివేసి లోపలికి లాక్కుపోతాయా పోనీ—అంతేకాని, మంచిది పోయిందనే ఏడుపు అనవసరం—దేని మంచి అయినా, చేవ అయినా దాని శక్తి ని అది నిరూపించుకోవటంలోనే ఉంది—ఇదీ డార్విన్ సిద్ధాంతం లాంటిదే ! 'జీవించే అర్హత కలిగిన ప్రాణులే మిగులుతాయి' (Survival of the Fittest)—వ్యవస్థ, సంస్కృతి, శిల్పము, నాగరకత వగైరాలకూ అన్వయిస్తుంది !'' ఆమె చేస్తున్నది వాదన కాదు, ఆత్మపరిశీలన అనిపించింది శ్రీధర్‌కు.

ఆమెలో నిర్వేదం గుర్తించాడు శ్రీధర్. కాని, ఆమె మనోవ్యథ యథార్థస్వరూప మేమిటో అతనికి యిన్నాళ్లకు యిప్పటికీ అర్థంకాలేదు..... ఈ పిక్నిక్‌ను తలవని తలంపుగా ఆమె ఏర్పాటు చెయ్యటానికి కారణం ఆ మనోవ్యథేనని మాత్రం గ్రహించగలిగాడు.....

తిరుగు ప్రయాణం సాగుతుండగా శ్రీధర్ ప్రశ్నించాడు : ''ఈ పిక్నిక్ అనుకోకుండా తలపెట్టావే కారణ మేమిటో !''

''నీకు పరీక్ష పెట్టటానికి !'' అన్నది చంద్రావతి.

''ఆ విషయమై వాదన వదిలిపెట్టుకున్నాం కదా, మళ్లీ ఆ ప్రసక్తి, ఎత్తిపొడుపూ న్యాయం కాదు !''

''నిజంగానే శ్రీధర్ ! నిజం చెప్పినా నమ్మవేమి టయ్యా నువ్వు ? మంచివాడివే ! పోనీలే, నాకు మనస్సు బాగాలేక అనుకో.''

ఆమె 'అయ్యా' అన్న ధోరణి అచ్చంగా వదినె రుక్మిణమ్మ మాటవరసలా ఉందనిపించింది శ్రీధర్‌కు.

''పోనీ అదేమిటో అర్థమయ్యేట్లు వివరించకూడదా !''
చంద్రావతి మాట్లాడలేదు.

చెంగల్పట్టులో ఒక హోటలు ముందు కారాపి, కాఫీ త్రాగటానికి లోపల ప్రవేశించారు.! అప్పటికి నాలుగు గంట

లవుతోంది. హోటల్లో ప్రవేశించగానే అందరి కన్నులూ తమ వైపే ఉండటం గమనించారు. ఫామిలీస్‌కు ప్రత్యేకించిన గదిలో వెళ్లి కూర్చున్నారు.

"చూశావా, వాళ్లందరూ ఎలా చూస్తున్నారో మనల్ని! ఈ రోజుల్లో మనం వదినా, మరదీ, లేక అక్కా తమ్ముడూ అంటే ఎవరు నమ్ముతారు ?" అన్నది చంద్రావతి విషాదంగా చిరునవ్వు నవ్వి.

ఆమెమీద ఆప్యాయత పొంగి వచ్చింది శ్రీధర్‌లో.

"నా కిదివరకే వదినె ఉంది, నువ్వు అక్కయ్యవు ! నాకంటె ఎన్నేళ్ల పెద్దదానివీ ?" అన్నాడు.

"ఆడవాళ్లను వయస్సును గూర్చి ప్రశ్నించకూడదనే మేనర్స్ తెలీకపోతే ఎలా ?" .... అంతలో కోపం తెచ్చుకున్న చంద్రావతిని చూచి విస్తుపోయి శ్రీధర్ నిశ్శబ్దంగా కాఫీ పూర్తిచేశాడు.

మళ్లీ కారు బయల్దేరేదాకా యిద్దరూ మౌనంగానే ఉన్నారు .....

"నువ్వు నాకు పెట్టిన పరీక్ష ఏమిటో చెప్పవా ?"

"పరీక్షా లేదు, ఏమీ లేదు ! .... ఒక సంగతి జరిగిన తర్వాత అదంతా నా తెలివేనని చెప్పుకోవటమూ ఒక పద్ధతి, అంతే !—నిజానికి యిలాంటి పరీక్షలు నిత్యమూ అందరికీ జరుగుతూనే ఉంటాయనుకో; పరీక్ష చేసేవాళ్లే ఆ క్షణం లోనే పరీక్షింపబడుతూ ఉంటారు కూడా !—ఈ సోదె అంతా ఎందుకు ? నువ్వే అన్నావు 'పరీక్ష' అనే మాట, దాన్ని పట్టుకొని నేనేదో వూహిస్తూ, అన్నాను, అంతే !— ఏమంటే నువ్వు కనిపించినదాన్నల్లా మంచి ఆదర్శం అంటూ పట్టుక్కూచుంటావ్, తర్కించేటప్పటికి సగానికి సగం వదులుకుంటావు కూడా .... మరి నీలో గట్టిగా నిలిచే విశ్వాసాలు ఏమున్నాయో నా కెలా తెలుస్తుంది ? ఇవ్వాళ కనీసం ఆ ఒక్క సంగతి ఎలాగో కాస్త బయటపడిం దనుకోవచ్చు కదా !"

"ఏమిటేమిటీ ? నేను ఆదర్శాలను వదులుకుంటానా ? ఏ ఆదర్శాన్ని వదులుకున్నాను అలా ? ఇంతవరకూ నాకు తెలిసి ఏ ఆదర్శాన్నీ వదులుకో లేదే ! చర్చించటంవల్ల అందులోని సాధక బాధకాలను గుర్తించవచ్చు కాని వదులుకోవటం ఎన్నడూ జరుగదు...... పోతే నీలో నేను గుర్తించిన లోపం ఏమిటో చెప్పనా—ఎడతెగని విమర్శ, అదీ విధ్వంసక విమర్శ చేస్తూ ఉండటం—ఇదంతా మానేసి మనస్సు నిర్మలం చేసుకుంటే బావుండదూ !"

"రైట్ ! నాలోని లోపం విశ్వాసాల్ని విమర్శిస్తూ వాటిని నిలుపుకోలేకపోవటమే, నిజంగా అంతే ! కాని అందు క్కారణం నేను కాదు, బహుశా నా అదృష్టమేమో ! ..... ఏమో చెప్పలేను, నేనే కావచ్చు కూడా, అదృష్టాన్ని అనటం ఎందుకు ? .... ఇది తేలే విషయం కాదు చూస్తే."

తర్వాత యిద్దరూ ఎవరి ఆలోచనల్లో వాళ్లుండిపోయారు.

ఆమె అదృష్టం విషయ మేమిటో అడగాలని ఉన్నా ఆమె ముఖంచూచి శ్రీధర్ మళ్లీ ప్రశ్నించలేకపోయాడు. ఇప్పుడు కాదు, మరోమాటు అడగాలి అనుకున్నాడు. కారు గిండీ చేరువకు వచ్చేసింది.

"నన్ను హాస్టలుకు దగ్గరగా దారిలోనే దింపేస్తే బావుంటుందేమో ! లేకపోతే మళ్లీ అంతదూరమూ వెనక్కి రావద్దూ !" అన్నా డామెతో.

"అలాగే."

## 12

శ్రీధర్ హాస్టల్ చేరుకునేటప్పటికి ఆరుగంటలైంది. ఆది వారం సాయంత్రంకావటంతో హాస్టలు ఇంచుమించు నిర్మా నుష్యంగా వుంది. స్నానం చేసివచ్చి కిటికీ దగ్గరగా కుర్చీలాక్కుని కూర్చున్నాడు గదిలో. ఆ సాయం సంధ్యా నిశ్శబ్దంలో ఆరోజు జరిగినదంతా ఆలోచిస్తూ ఉండిపోయాడు. అతనికి చాల విషయాలు అర్థంకాలేదు. కాని ఆరోజు చంద్రావతితో ఆమెను గూర్చి తనకుగల భావమేమిటో స్పష్టంగా చెప్పగలిగినందుకు అతనికి తృప్తిగా ఉంది......చంద్రావతిని అర్థం చేసుకుని ఆమెకు తనేదో సలహా ఇవ్వగలనన్న అభిప్రాయం మొదట్లో ఉండినా, ఆ అభిప్రాయాన్ని ఇప్పుడు పూర్తిగా వదులు కున్నట్లే! మెరుపుతీగె ఎప్పుడెలా ప్రకాశిస్తుందో ఎలా మిరు మిట్లు గొలుపుతుందో అనూహ్యమైన విషయమే! ఆమెకు దారి చూపటం తన తరమా? ఆమెను గురించి యిదమిత్థ మని తను వూహించలేకపోయినా ఆమెమీద విశ్వాసం, గౌరవం, అభిమానం మాత్రం తనలో ఎప్పుడూ ఉంటుంది......అదే ఆమెను గూర్చిన సత్యం......

శ్రీధర్ మెస్‌కు వెళ్లేసరికి అతని రూమ్‌మేట్ రామా రావు అప్పుడే టవున్‌నుంచి సరాసరి మెస్‌కు వచ్చాడు. శ్రీధర్‌ను పలకరించాడు ప్రక్కన కూర్చుంటూ :

"ఏమండీ శ్రీధర్, ప్రొద్దుటినుంచీ పత్తాలేదే దివ్వాళ? ఏమిటి ప్రోగ్రాం?"

"తెలిసిన వాళ్లింటికి వెళ్లాను."

"స్నేహితులా, బంధువులా?"

"రెండూ" అన్నాడు శ్రీధర్ నవ్వుతూ.

"రెండూ ఎట్లా?" అన్నాడు రామారావు అరటి ఆకు కడిగి, ఆ నీళ్లను క్రిందికి జార్చుతూ. రామారావు సాధారణంగా ముక్తసరిగానే వ్యవహరిస్తాడు. ఇతరుల విషయాల్లో జోక్యం కల్పించుకోడు. అనవసర ప్రసంగాలు చెయ్యడు. శ్రీధర్ కూడా అతనితో అలానే ఉంటాడు. అందువల్ల రామారావు ధోరణికి శ్రీధర్ కొంత ఆశ్చర్యపడ్డాడు.

"స్నేహితులైన బంధువులు, లేక బంధువులైన స్నేహి తులు అనుకోండి. బంధుత్వంకంటె స్నేహమే ముఖ్యంకాదా?"

"అయ్యర్! నెయ్యి తీసుకురా" అంటూ అన్నం కలు పుతూ రామారావు శ్రీధర్‌వైపు తిరిగి "ఏమిటో వేదాంతం మాట్లాడుతున్నారు. ఇంతకీ చెప్పటం ఇష్టం లేదన్నమాట..... పోన్లెండి, అడగటం నాదే తప్పు" అన్నాడు.

"ఇందులో ఏముంది! స్నేహితులింటికే వెళ్ళాను, బంధువులకంటె ఎక్కువేననుకోండి......మీతో మాటవరసకు అలా అన్నాను."

"ఎవరు స్నేహితులు?"

శ్రీధర్ జవాబు చెప్పలేదు. రామారావు ఏదో క్రొత్తగా ప్రవర్తిస్తున్నాడనిపించింది అతనికి.

గది చేరుకున్న తర్వాత శ్రీధర్ తన పుస్తకాలు సర్దుకుని చదువుకోటానికి సిద్ధమవుతూ, పత్రిక చదువుతూన్న రామారావుతో "నా డిక్షనరీ చూశారా మీరు?" అన్నాడు.

"లేదే! మొన్న పజిల్స్ సాల్వ్ చెయ్యటానికని పేరిశాస్త్రీ సత్యనారాయణా వాళ్లరూమ్‌కి పట్టుకెళ్లలా! మళ్లీ యిచ్చారా?"

"అవును కదూ, వాళ్ల దగ్గరే వుంది"

శ్రీధర్ పేరిశాస్త్రి రూమ్‌కి వెళ్లాడు.

పేరిశాస్త్రి ఏవో పద్యాలు చదివి వినిపిస్తున్నాడు. సత్యనారాయణ మంచంమీద పడుకుని వింటున్నాడు. వాళ్లిద్దరూ ఎప్పుడూ ఒకరినొకరు ఎడబాయని జంట; రూమ్‌మేట్స్. పేరిశాస్త్రి చటవడంఆపి శ్రీధర్‌కు కుర్చీ చూపిస్తూ "కూర్చోండి, ఏమిటీ విశేషాలు......వూరక రారు మహాత్ములు" అన్నాడు.

పేరిశాస్త్రి ధోరణి కొంత హాస్యయుక్తంగానే ఉంటుంది ఎప్పుడూ......"ఏమిటో కవితాస్వాదన చేస్తున్నారు?" అన్నాడు శ్రీధర్ శాస్త్రి ధోరణికి తగ్గట్టుగా......

"వనితా మధురాధరాస్వాదన సౌభాగ్యం లేనివాళ్ళు ఇదైనా చెయ్యవద్దా?......ఏంలేదు, సత్యానికి మనుచరిత్రలోని రసవత్తర ఘట్టాలు చదివి వివిపిస్తున్నాను......చూడండి, ప్రవరుడు పెద్ద ఫూల్‌లాగా ప్రవర్తించటంతో గంధర్వుడు ఎలాంటి ఛాన్సు కొట్టేశాడో......"

"ఫూల్‌లాగా ప్రవర్తించట మేమిటండీ! గొప్పగా నిగ్రహంతో ప్రవర్తిస్తేనూ?" అన్నాడు శ్రీధర్.

"నిగ్రహం మాట నేను చచ్చినా నమ్మను! ఇంటిదగ్గర సంసార మేమైపోతుందో, మళ్లీ వెళ్లగలుగుతానో లేదో అనే భయం కారణమనండి నమ్ముతాను.....ఏమి నిగ్రహమండీ? వీడేమి విశ్వామిత్రుడు వగైరా ఋషులకంటె గొప్పవాడా? ఉప్పు కారం తింటున్న గృహస్థే కద!"

"గృహస్థు కాబట్టే సులభంగా నిగ్రహం చూపించి ఉంటాడులెండి! అంతేకాదు, ఎవరికైతేమాత్రం కనిపించిన ఆడదానిమీదల్లా మనసుపోతుందా? వరూధిని నచ్చలేదేమో!"

"వరూధినేమి సామాన్యమైన అందగత్తా?...... అదీగాక తమరు మహా బుకాయిస్తున్నారుగాని, వంటరిగా ఆడది దొరికితే, ఆ అవకాశమేవుంటే విడిచి పెడతారా? విడిచే మగా డెవడండీ? నేను నమ్మను......వేరే భయమో, ఇంకేదో అత్యవసరమైన కార్యమో, కారణమో అడ్డంవస్తే తప్ప! అందుకే ప్రవరుడు ఇంటిదగ్గరేం మునిగిపోతుందో అనే ఆదుర్దా ఎక్కువై వరూధిన్ని విడిచిపెట్టా డంటాను. ఏం సత్యం, నువ్వేం మాట్లాడటంలేదు!" అన్నాడు శాస్త్రి.

"అంతా నువ్వే మాట్లాడుతున్నావు గా, ఇంక నేనెందుకూ? ఎవడూ పెద్దమనిషి కాదు ఆమాటకొస్తే! ఆడవాళ్లకే కాస్త నీతి, నియమం, సిగ్గూ, లజ్జా, కనీసం ఏవో కొన్ని కట్టుబాట్లంటూ లేకపోతే ఎవడి భార్య పతివ్రత, ఎవడి తల్లి ఉత్తమురాలు?.....ఛీ, ఛీ, పుస్తకాల్లో రాతలూ అలానే ఉన్నాయి, మనుష్యుల బుద్ధులూ అంతే!......ఇంక మూసిపెట్టు ఆ పుస్తకం, ఏదైనా పనికొచ్చే సంగతి మాట్లాడు....." అన్నాడు కోపంతో, ఉద్రేకంతో గొంతు పెద్దదిచేస్తూ సత్యనారాయణ. అతని ధోరణి చాల అప్రస్తుతంగా కనిపించింది శ్రీధర్‌కు....

సత్యనారాయణతో శ్రీధర్‌కు పెద్దగా పరిచయంలేదు. శాస్త్రితో ఎప్పుడైనా హాస్యంగా నాలుగు మాటలు మాట్లాడటం ఉందిగాని సత్యనారాయణతో ఆపాటి పరిచయం కూడా లేదు. ఏదో చర్చించబోతే సత్యనారాయణ ఉద్రేకం చూపడంతో అతనికి సభ్యత తెలీదనిపించింది.

"శాస్త్రిగారూ, నా డిక్షనరీ తెచ్చారు గదండీ, అది కావాలి!" అన్నాడు శ్రీధర్.

"సత్యం దగ్గరే ఉండాలి" అంటూ, శాస్త్రి 'మనుచరిత్ర' పుస్తకాన్ని తన షెల్ఫులో పెట్టడానికి అటులేచి వెళ్లాడు.

శ్రీధర్ సత్యంవైపు చూశాడు. సత్యం తన కేమీ పట్టనట్లు పైకప్పుకేసి చూస్తూ పడుకొనిఉన్నాడు.

"సత్యనారాయణగారూ, డిక్షనరీ కావాలి"

"ఎవరి నడుగుతారు? నేను తేలేదు!"

"అదేమిటండీ, ఆరోజు మీరిద్దరూవచ్చి తీసుకొచ్చారా లేదా?"

సత్యనారాయణ మాట్లాడలేదు.

"శాస్త్రిగారూ, ఏమిటీ మర్యాద? పుస్తకం తెచ్చుకొన్నవాళ్లు మళ్లీ తెచ్చిఇవ్వటం పోయి, నేనే స్వయంగా వచ్చి అడిగితే ఇలానా ప్రవర్తించటం?"

"నేను చూచి ఇస్తాను ఉండండి" శాస్త్రి సత్యనారాయణ పుస్తకాల షెల్ఫు తడివి డిక్షనరీ పట్టుకొచ్చి శ్రీధర్‌కిస్తూ "స్వయం జాగ్రత్త లేకపోతే పోతాయండీ యివి! పుస్తకం, వనితా, విత్తం, పరహస్తాల్లో పడితే ఇంకేముంది!" అన్నాడు.

"శాస్త్రీ నోరు మూస్తావా మూయించాలా?" అంటూ గర్జించాడు సత్యనారాయణ.

శాస్త్రి శ్రీధర్‌తో గది వెలుపలికి పంపిస్తూ, "మావాడివ్వాళ మహాకోపంలో ఉన్నాడు లెండి......" అన్నాడు.

శ్రీధర్ తన గదివైపు నడుస్తుండగా లోపలికి వెళ్లిన శాస్త్రి అంటున్న మాటలు తేలిపోతూ వినిపించాయి : "నామీద పడతా వేమిటి సత్యం? ఏమిటో సామెత చెప్పినట్లు ఎదురుగా......"

సత్యనారాయణ అసభ్య ప్రవర్తనకు ఆశ్చర్యపోతూ శ్రీధర్ గదిని చేరుకోగానే జరిగిన విషయాన్ని కుతూహలంగా రామారావుతో చెప్పాడు.

"మీరు చాల అమాయకుల్లా ఉన్నారు శ్రీధర్! అయితే ఈ సంగతి మీకేమీ తెలీదా? మీరేమీ వూహించుకోలేరా?" అని ప్రశ్నించాడు రామారావు.

రామారావు తనని అమాయకుడన్నందుకు శ్రీధర్‌కు కోపం వచ్చింది: "నాకు ఒకళ్ల గొడవలు పట్టవు! నేనెందుకు వూహించుకోవాలి! సత్యనారాయణ అంత మేనర్సులేని మూర్ఖు డేమిటా అనిపించి మీతో చెప్పాను. ఇందులో నా అమాయకత్వాని కేమొచ్చింది?"

"మీరు నిజంగా అమాయకులే! మనకు ఒకళ్ల గొడవలు అక్కరలేకపోయినా, అందరికీ మన గొడవ కావలసివస్తుంది. ఆ శాస్త్రి చాల ప్రమాదకరమైనవాడు, సత్యనారాయణని తన చేతిలో బొమ్మలా ఆడిస్తూ ఉంటాడు. ఇంతసేపూ శాస్త్రి మీతో మాట్లాడిన మాటలూ, ఆవిసుర్లూ ఎవర్ని గురించీ, దేన్ని గురించీ అనుకున్నారు?"

శ్రీధర్ ఆశ్చర్యంగా వింటూ, "దేన్ని గురించి?" అన్నాడు.

"ఏమిటండీ?! మీరూ చంద్రావతీ కలిసి సినిమాలకు వెళ్లటం, మీరు తరచు వాళ్ల ఇంటికి వెళ్లిరావటం ఎవరికీ తెలీనే తెలీ దనుకుంటున్నారా? ఏమిటి, కొంపదీసి? గమనించటమే కాదు, ఇప్పుడది ఇంచుమించు 'స్కేండల్' క్రిందే తయారైంది.......తెలీదంటా రేమిటి? దీనికంతా ఆ శాస్త్రీ, సత్యనారాయణా సూత్రధారులు.....వాళ్లే మిమ్మల్ని గురించి ఆరాలు తియ్యటం, వార్తలు మెల్లగా క్రింద క్రింద ప్రసారం చెయ్యటం......"

శ్రీధర్‌కు గుండె జారినట్లయింది......కొంతసేపు ఏమీ మాట్లాడలేకపోయాడు......

"ఎందుకంటారు వాళ్లకు నామీద కక్ష?" అన్నాడు చివరకు.

"ఈ సత్యనారాయణకు మీ ఫ్రెండు చంద్రావతి బంధువట........వరుసకు వదినె అవుతుందట......'అన్నాప్రెగడ వాళ్లట వాళ్లూ వీళ్లూను......ఆమె భర్త ఇతనికి అన్న వరుస' ఏదో బీరకాయపీచు, దగ్గరో దూరమో!.......కాని అసలీ సంగతి మీకు తెలీనే తెలీ దన్నమాట! మీకు తెలుసేమో అనుకున్నాను. కాలేజిలో చేరిన మొదట్లోనే బంధుత్వాలు తిరగేసి సత్యనారాయణా, శాస్త్రీ ఆమెతో మాట్లాడారట. తర్వాత ఆమె ఇంటిక్కూడా ఒకసారి వెళ్లారట. కాని వీళ్ల ధోరణి నచ్చక కాబోలు ఆవిడ ఉదాసీన చెప్పినట్లుంది. అదీ కోసం! సత్యనారాయణ స్వతహా మంచివాడే, శాస్త్రి ఉన్నాడే వట్టి కొంపలు ముంచే రకం......మళ్లీ తియ్యగా, హాస్యంగా మాట్లాడుతాడు......అది సరేగాని, మీరుమాత్రం మీ ప్రవర్తనతో ఎందుకు కాస్త జాగ్రత్తగా ఉండకూడదు! కాలేజిలో చదువుతున్నపుడు ఆమెతో మీరు సినిమాలకు వెళ్లటం, అదీ ఆమె భర్తవెంట లేకుండా, కొంత అపోహలకు అవకాశ మిస్తుందా లేదా? అనుమానాలకూ అనవసర కల్పనలకూ అదే మూలం....మన నీడ మనం చూడకున్నా లోకం చూస్తూనే ఉంటుందండోయ్!"

"థాంక్స్ ఫర్ ది ఎడ్వైస్!" అనేసి శ్రీధర్ నిస్పృహగా మంచంమీద పడుకున్నాడు ఆలోచిస్తూ. అతడు అనుకోని క్రొత్త దృక్పథం ఒకటి ఎదురుగా ప్రత్యక్షమైంది......

"ఇవ్వాళ ఎక్కడికి వెళ్లారని ఇందాక మెస్‌లో అడిగితే నాతో చెప్పనే లేదు మీరు! ఆమె కారు డ్రైవ్‌చేస్తూ మీరు ప్రక్కన కూర్చుని ఎక్కడికో వెళ్లారట కదూ! మధ్యాహ్నం మెస్‌లో శాస్త్రి మెల్లగా నన్నడిగాడు ఆరాతియ్యటానికో లేక తను తెచ్చిన వార్త ప్రసారంచేసే ఉద్దేశమో......తర్వాత తనే చెప్పాడు—శాస్త్రీ, సత్యమూ యిద్దరూ ఎక్కడికో వెళ్తూ ఉదయం 8½ గంటల ప్రాంతాన ప్రత్యక్షంగా మీరు కారులో వెళ్లటం చూశారట! మీ రిద్దరేనట, ఆమె డ్రైవ్ చేస్తోందట......నేను నమ్మలేదు. వట్టి పుకార్లు పుట్టిస్తున్నా డేమో ననుకున్నాను......అందుకే మిమ్మల్ని అడిగాను...వీరు వాళ్ల గదికి వెళ్లితే జరిగిన గొడవంతా దానికి సంబంధించిందే నన్నమాట.....మీరు కారులో వెళ్లటమే నిజం కాబోలు."

"ఆఁ......నిజమే!......రామారావ్, ఆమె నాకంటె పెద్దది. నే నామెను 'అక్కయ్యా' అని పిలుస్తాను. మీరు చెప్పిన ఈ 'లోకం' దృష్టి నా కెప్పుడూ తట్టనే లేదు సుమండీ! ఇవ్వాళ ఆదివారం కదా అని ఆమె రమ్మంటే వెళ్లాను. అకస్మాత్తుగా మహాబలిపురం చూడాలని తీసుకెళ్లింది......వెళ్తూ ఎందుకో అనుకున్నాను కూడా, ఇది లోకం దృష్టిలో ఏమీ సబబుగా కనిపించదేమోనని! కాని నా కీ క్షణందాకా తెలీదు ఇంతగా విష ప్రచారం మమ్మల్ని గురించి ఎన్నాళ్లనుంచో జరుగుతుందని!... ఇప్పుడేమిటి చెయ్యటం?"

"ఏమిటండీ చేసేది?! ఆవిడ అంతగా రమ్మంటూంటే వెళ్లారు. ఆమెకే ఉండాలి ఆమాత్రం యింగితజ్ఞానం! కాని వ్వండి, పబ్లిగ్గా తిరగటాన్నిగూర్చి ఆమెకులేని భయం మీకేమిటి? కాని లోకం సంగతీ, చుట్టూ ఏమనుకుంటున్నారో కాస్త కనిపెట్టి ఉండాలి. మరీ అమాయకంగా వుంటే లాభం లేదు. శాస్త్రి, సత్యాన్ని ఎలా రెచ్చగొడుతున్నాడో గమనించారు కదా! కాస్త జాగ్రత్తగా ఉండండి!........ఏమైనా అందరి దృష్టిలో మీరు అదృష్టవంతులే!"

శ్రీధర్‌కు తను నిలుచున్న భూమి అకస్మాత్తుగా కాళ్ల క్రిందనుంచి జారిపోయినట్లయింది......

ఇప్పు డెవరిని చూచినా ఎవరితో మాట్లాడినా అతనికి వాళ్ల మనసుల్లో తనను చంద్రావతిని గూర్చిన అపోహ గుర్తువస్తూ జంకు కలిగిస్తోంది. వాళ్లతో పూర్వంలా సహజంగా కలసి మెలసి ఉండలేకపోతున్నాడు.

చంద్రావతికీ, తనకూ గల స్నేహానికి అశ్లీలమైన అర్థాన్నితప్ప ఇంకో అర్థాన్ని కల్పించటం సాధ్యం కాదా సంఘానికి?......పైనుండి చూచే వాళ్లకి వ్యక్తిగతమైన స్నేహబంధంలోని ప్రత్యేకత పవిత్రత ఎలా గ్రాహ్యమౌతుంది మరి?... స్త్రీ పురుషులమధ్య ఆకర్షణకు అతి సామాన్య కారణమేదైతే ఉందో దాన్నే వూహిస్తారు వాళ్లు!.....శ్రీధర్ ఆలోచనకు

ఇతరులు తననుగూర్చి ఎలా అనుకుంటున్నారో అన్వేషించటమే, వాళ్ళ మాటల్లో సూచనగా ఆ విషయం వ్యక్తమవుతూ ఉందో లేదో గమనించటమే ప్రధానమైంది. దాన్తో అతని మనసు రెండు విధాలుగా విడిపోయినట్లయి అవి ఒక దాన్నొకటి తరచు విమర్శించటం ప్రారంభించాయి......రెండు ముక్కలుగా పగిలిన అద్దంలో ముఖం చూచుకుంటున్నట్లుగావుంది అతనికి!

వెళ్ళి చంద్రావతితో విషయం పూర్తిగా చెప్పాలను కున్నాడు మొదట. కాని ఎలా చెప్పాలో వూహించుకుంటేమాత్రం అది తనకే అసహ్యంగా వుండి ఆమెముందు ఆ ప్రసక్తి తేవటమే అసాధ్య మనిపించింది!.....అంతటితో ఆ ప్రయత్నం మాను కున్నాడు.....తర్వాత ఆమె ఇంటికే వెళ్ళలేదు.

సంఘం చూచే దృష్టితో క్రమంగా చంద్రావతితో స్నేహాన్ని ఆద్యంతమూ విమర్శించాడు. కేవలం స్త్రీ పురుష సంబంధంగా చూస్తే అతనికీ ఆమెకీ మధ్య జరిగినదంతా ఒక క్రొత్త రూపంలో సాక్షాత్కరిస్తోంది—స్నేహాన్ని ప్రారంభించింది చంద్రావతే, తనేమీ ఆమె వెంట పడలేదు ! ఆమె ఉద్దేశం కేవలం తన్ను ఆకర్షించటమే నేమో ! .... ఆమె యింటికి వెళ్ళటం ఎలా ప్రారంభమైంది ? .... రెండోసారి తను స్వయంగానే వెళ్ళినా ప్రథమంగా ఆమె ఆహ్వానించింది కదా ! ఆమె తనపట్ల చూపిన ఆసక్తి, శ్రద్ధ, అభిమానం, వీటికి మూలకారణం తరచి చూస్తే ఏమిటి ? . . . . . ఆమె ఒక్కొక్కసారి అంత సన్నిహితంగా ఎందుకు ప్రవర్తించింది ? .... ఎందుకు తన్ను అలా స్పృశించింది. ? .... పేరిశాస్త్రి ఆమెను వరూధినితో పోల్చటం కొంతవరకు సమర్థనీయం కాదా ! .... తను ఆ పరిస్థితుల్లో ప్రవరుడిలాగే ప్రవర్తించాడు ! అందుకే తనని ఆమె యించు మించు 'ఛాందసుడు' అంటూ ఏవేవో మాటల్లో అనలేదా మహాబలిపురంలో ? .... అశ్లీలంగా వ్యాఖ్యానిస్తే తేలే సంగతు లివీ ! అన్నీ అనుమానాలే ఆమెను గూర్చి !!

కాని ఈ హేయమైన దృష్టి, అన్యాయమైన వూహ అతనికి ఎంతో దుర్భరంగా ఉన్నాయి .... ఒకవైపు ఆమె మీద అభిమానమూ, గౌరవమూ, ఆరాధనా భావమూ, 'సత్య' మిది కాదు, మళ్ళీ ఆలోచించమంటూ పైరకపు దృష్టిని ప్రతిఘటించి తీవ్రంగా ఘర్షణ పడుతున్నాయి..... అపురూపమైన స్నేహానుబంధాన్ని త్రెంచవద్దని ఆమెను తనే ఎన్నోసార్లు ప్రాధేయపడ్డాడే ! ఎంత అరమరికలేని అభిమానం కాకపోతే అంత సన్నిహితంగా ప్రవర్తిస్తుందామె ? దాన్ని కలుషితం చెయ్యటమేనా ? ఆమె చేష్టలలో అసభ్యత తనకు తోచనైనా లేదే ! ఆ అనుభవంలోని పవిత్రత, ఉదాత్తత, అనుభవైక వేద్యమే గాని, యితరులకు—సంఘానికి—ఎలా నిరూపించి చెప్పటం ? సాధ్యంకాదే !

మహాబలిపురం నుంచి వచ్చిన సాయంత్రం తను ఏమనుకున్నాడు ? చంద్రావతి వ్యక్తిత్వం ఒక మెరుపుతీవ; ఆమె మేధాశక్తి అందుకునే ఆకాశపుటంచులు, తీసే సముద్రపు లోతులు తనకు అందవు. అయితేనేం ? ఆమె ఒక తరగని సత్యం. ఆమెమీద తన కెప్పుడూ విశ్వాసం సడలకూడదు అను కున్నాడే, ఇప్పుడా విశ్వాసాన్ని పోగొట్టుకోవటమేనా ?

శ్రీధర్ యిలా విశ్వాసం—అవిశ్వాసం మధ్య వూగిస లాడుతూనే ఉన్నాడు..... ఒకసారి యిటు, ఒకసారి అటు .... ఏకాంతంగా ఉన్నప్పుడు చంద్రావతి ఉజ్జ్వలమూర్తి, ఆమె మాటలూ, విజ్ఞానమూ, ఆమె ఆదరాభిమానాలూ జ్ఞాపకం వచ్చి తను 'విశ్వాసం'లో నిలిచి ఉంటాడు .... కాని, కాలేజీకి వెళ్ళినప్పుడు సహాధ్యాయులతో మాట్లాడవలసి వచ్చినప్పుడూ, చంద్రావతి పదిమందిలో క్లాసులో కనిపించినప్పుడూ ఆమె మీద వైముఖ్యం రేకెత్తి 'అవిశ్వాసం' లో పడిపోతున్నాడు. ఆమె తననేదో వంచించినట్లనిపిస్తోంది అతనికి ఆ సమయంలో.

ఇదంతా అప్రయత్నంగానే అతనిలో జరుగుతున్నది. మనస్సులోని ఈ ఆకర్షణా, అపకర్షణా బొత్తిగా తన స్వాధీనంలో లేకపోవటంతో, ఇదొక ఎడతెగని అలజడిగా రూపొంది ఆలోచనకూ వూహకూ విరామం అంటూ లేక పోతోంది. ఏం చేస్తున్నా, దేనిమీద మనస్సు లగ్నం చెయ్య బోయినా, నేపథ్యంలో చంద్రావతి సమస్య ప్రజ్వలిస్తూనే ఉంది .... ఈ సందిగ్ధావస్థ నుంచి ఏదో విధంగా బయట పడా లనే ప్రయత్నిస్తున్నాడు .... సాయంకాలం గిండీ వైపు రోజూ ఒంటరిగా షికారు వెళ్ళటం—ఆలోచనల్ని బేరీజు వెయ్యటం, ఒక నిశ్చయానికి రావటానికి ప్రయత్నించి చివరకు రాలేక పోవటం, నిత్యం జరుగుతోంది. ఏమైనా పోయిన మనశ్శాంతి మళ్ళీ లభించలేదు శ్రీధర్‌కు.

చంద్రావతిని తప్పించుకుని తిరగటమే కాదు, టౌన్ వైపూ సినిమాలకూ వెళ్ళటమే మానుకున్నాడు శ్రీధర్ పది రోజులుగా.

ఒక సాయంత్రం మసకచీకటిలో మామూలుగానే షికారు నుంచి గిండీ రోడ్డులో నడచి వస్తున్నాడు ఒంటరిగా. సైదా పేట బ్రిడ్జి సమీపించేటప్పటికి ఎదురుగా వస్తూన్న ఒక మనిషి మొరటుగా శ్రీధర్‌మీద తూలిపడ్డాడు.

''ఏయ్, చూచి నడవరాదూ !'' అన్నాడు శ్రీధర్ మంద లింపుగా.

''ఎన్న పేశరే ? ఇంద రోడ్ నీ సొంతంవా ? నీ అబ్బ సొంతంవా ?'' అన్నాడు వాడు నిలబడి దురుసుగా.

శ్రీధర్‌కు కోపం వచ్చింది.

''ఏయ్, ఏమిటా వాగుడు ? మర్యాదగా మాట్లాడ వోయ్, తాగావా ఏమిటి ?'' అన్నాడు శ్రీధర్ దగ్గరగా వెళ్ళి.

''మరియాదా ? ....పెరియ ఆళ్ ! నీ యార్‌దా ఎనక్కు తెరియాదా !'' అంటూ ఎగతాళిగా నవ్వుతూ మీదికి వచ్చి, కళ్ళురిమిచూస్తూ ముఖంలో ముఖంపెట్టి, జబ్బలు తడుపు కుంటున్నాడు వాడు.

శ్రీధర్‌కు త్రాగుడు వాసన కొట్టింది .... తాగిన వాడితో పేచీ ఏమిటనిపించింది అతనికి. ''సరి సరి ఫో'' అంటూ అక్కడినుంచి కదలబోయాడు. వాడు శ్రీధర్ షర్టు పట్టుకుని లాగుతూ ''మరియాద సొల్రె? మూంజి పార్....

నీ ఎంగె పోరె ? మాంబళంవా? మాంబళం ఎందు క్కాడా ?... సార్, అప్రం .... ముత్తాల్ సార్ !'' అంటూ గబగబా కాలర్ పుచ్చుకున్నాడు.

శ్రీధర్ వాణ్ణి గట్టిగా చెంపమీద ఒకటి పెట్టి విదిలించేశాడు. వాడు శ్రీధర్‌మీద కలియబడ్డాడు. ఇంతలో యిద్దరు వ్యక్తులు పరుగెత్తుకుంటూ వచ్చి, విడదీసినట్లే విడదీస్తూ శ్రీధర్ చేతుల్ని గట్టిగా పట్టుకున్నారు. మొదటి వాడు శ్రీధర్‌మీద విజృంభించాడు. శ్రీధర్ వదలించుకో ప్రయత్నించాడు. లాభంలేకపోగా ముగ్గురూ అతనిమీద కలియబడ్డారు. శ్రీధర్‌కు అర్థమైంది, వాళ్ళు ముగ్గురూ ఒక జట్టేనని .... శ్రీధర్ ఇంక లాభంలేదని పోట్లాట్టం మాని రోడ్డుమీద చప్పగా చతికిలపడ్డాడు. మొదటివాడు శ్రీధర్‌ని పైకి గుంజి కొట్టబోతూఉంటే మిగతా యిద్దరిలో ఒకడు వాణ్ణి వారించాడు..... తర్వాత వాడు శ్రీధర్ నుద్దేశించి—

''ఏమి బుద్ధిదా వచ్చిందా ? నువ్వుదా స్టూడెంటు, నీకు ఆండవాళ్లతో కార్లో, టాక్సీలో సుట్టటం ఏందా పని ? నువ్వు దా యారని తెలిస్తివి ? దొర సెప్పినారు జాగ్రత్త ...... సందరావతి అమ్మాళ్ తో దా మాట్లాడినావా, నిన్ను ఈ ఏట్లోదా పూడ్సిపెడ్తము .... లే, లే, లేచి ఫో....ఇద్దా వార్నింగ్ ....''

కొట్టినవాళ్ళు ముగ్గురూ గబగబా వెళ్లిపోయారు. కొంత దూరంలో రోడ్డు ప్రక్కగా సైకిళ్ళున్నాయి. అవి ఎక్కి శ్రీధర్ చూస్తుండగానే వాళ్ళు మాయమయ్యారు.

వాళ్ళు అకస్మాత్తుగా తనమీద కలయబడటం కంటె, వాళ్ళు బయటపెట్టిన ఉద్దేశం శ్రీధర్‌ని ఆశ్చర్యంతో విమూఢుణ్ణి చేసింది ......

ఈ సంఘటనకూ చంద్రావతికీ సంబంధమా ?

ఈ మనుషుల్ని పంపిన 'దొర' ఎవరు ? చంద్రావతి భర్త ? మహాబలిపురం వెళ్లినరోజు అతను రంగూన్ వెళ్లాడని చెప్పిందే చంద్రావతి ..... ఎన్నోసార్లు అతన్ని కలుసుకుందామనే తను ప్రయత్నించాడే. అతనికీ అపోహ తన్ను గూర్చీ, భార్యను గూర్చీ ఎలా కలిగింది ?

కాదు, కాదు, దీనికి కారణం సత్యనారాయణా పేరి శాస్త్రి ! వాళ్లే యీ రౌడీలను పంపించి ఉంటారు ఈర్ష్యా భావంతో .... ఏమో !

తనిప్పు డేం చెయ్యాలి? ప్రతీకారం చెయ్యాలా ? ...

హాస్టలుకు చేరుకునే వేళకు శ్రీధర్ క్రమంగా ఈ విషయము ఇంతటితో మరచిపోవటమే ఉత్తమం అనే నిర్ణయానికి వచ్చాడు.....

ఆ రాత్రే, ఎన్నాళ్ల తర్వాతో, పాఠ్యపుస్తకాలు తెరచి శ్రద్ధగా చదవటం ప్రారంభించాడు ఆలోచనకు స్వస్తిచెప్పి .... ఎన్నడూ కుదరని ఏకాగ్రత ఆరోజు కుదరటం అతనికే వింతగా ఉంది.

ఒకరోజు లైబ్రరీలో పుస్తకాలు చూస్తుండగా చంద్రావతి శ్రీధర్ దగ్గరగా వచ్చి పలకరించింది : ''చదువుమీద శ్రద్ధ అంత ఎక్కువయిందా ఏమిటి, దర్శనమే లేదు ?..... సినిమాలు కూడా మానేసినట్లేనా ?''

''అవును .... తీరిక లేదు ....'' అన్నాడు ముక్తసరిగా.

చంద్రావతి అతనివైపు ఆశ్చర్యంగా చూచి, తర్వాత పుస్తకాలు పరిశీలించటంలో నిమగ్నురాలైంది. కొన్ని క్షణాలు అక్కడే తచ్చాడి శ్రీధర్ బయటికి వెళ్లిపోయాడు.

ఆమెతో తను మాట్లాడిన తీరు, యిచ్చిన సమాధానమూ అతనికే తృప్తిగా లేవు. చాలసేపు మళ్లీ మళ్లీ తర్కించుకున్నాడు. కాని, ఇంకోవిధంగా ఏమని సమాధానం యిచ్చివుంటే బాగుండేదో అతనికి తట్టనే లేదు..... ఆమెతో ఎక్కువగా మాట్లాడటానికీ, వివరించి చెప్పటానికీ అది తగిన చోటు కాదాయె ! తర్వాత అనిపించింది—ఆమెకూ, తనకూ ఏమిటి సంబంధం ? తను రుక్మిణమ్మకూ ఆమెకూ పోలిక పెట్టటం కూడా కేవలం ఒక భ్రమ, అసలు ఎక్కడా పోలికే లేదనిపించింది తర్కించి చూసేకొద్దీ ! రుక్మిణమ్మ చంద్రావతిలా ఎన్నడైనా మాట్లాడగలదా ? ఇద్దరినీ పోల్చటంలో అర్థంలేదు !

శ్రీధర్‌కు ఆ రాత్రి ఒక కల వచ్చింది .... చనిపోయిన సీత ''చి బాబాయ్ !'' అని పిలుస్తూ ఏమిటో చెప్పటానికి ప్రయత్నిస్తోంది .... శ్రీధర్ సీత మాటలు వినిపించుకోకుండా సీత ఎలా తిరిగి వచ్చిందా అనే ఆశ్చర్యపోతున్నాడు :

''చి బాబాయ్ ! నన్ను కొట్టావే, అమ్మ చెబితే కొట్టొచ్చా ? ఏదీ అమ్మ ? .... అమ్మ ..... అమ్మ ..... చచ్చిపోయింది బాబాయ్ !'' చేతులు వట్టిగా త్రిప్పి చూపుతూ 'చచ్చి' అన్న పదాన్ని ఒత్తి పలుకుతూ అదేమాట మూడు నాలుగుసార్లు చెబుతోంది సీత.

''నువ్వెలా వచ్చావ్ ? నువ్వు కాదూ చచ్చిపోయింది?'' అడగట మెలాగా అని సందేహిస్తూనే చివరకు అడిగాడు ఆ ప్రశ్న.

''ఊహూఁ .... అదిగో...... అక్కడ ..... అమ్మ ....'' శ్రీధర్ సీతతో బయల్దేరాడు .... ఇంట్లోనుంచి బయటికి వీధిలోకి వచ్చి చూశాడు .... అప్పుడే వర్షం వచ్చిందేమో, వీధిలో మురుగుకాల్వలో నిండుగా ఎర్రటి వర్షపునీళ్లు జోరుగా పోతున్నాయి ..... సీత ఆ నీళ్లని చూపిస్తూ ''అమ్మ .... అమ్మో ..... యీ ఏట్లో పడి చచ్చిపోయింది !'' అంటోంది.

శ్రీధర్ గట్టిగా నవ్వుతూ ఏడుపుమొహం పెట్టిన సీతని చేతుల్లోకి ఎత్తుకున్నాడు ..... నవ్వుతూనే ఉన్నాడు .. గట్టిగా నవ్వటంతో మెలకువ వచ్చేసింది అతనికి.

''ఏమిటి నిద్దట్లో నవ్వుతున్నారు ?'' అంటున్నాడు రామారావు.

''ఏదో కల .... మా అన్నయ్యకూతురు సీత కలలోకి వచ్చింది. ఆ అమ్మాయి చనిపోయి కొన్ని మాసాలైంది.... ఎందుకో కలలో కనిపించి వాళ్లమ్మ చనిపోయింది అని చెబుతూ మురుగుకాలవని చూచిస్తోంది .... అందుకే నవ్వాను .... ఏమిటో మరి, రేపు యింటికి ఉత్తరం వ్రాయాలి !''

శ్రీధర్ తండ్రికి ఉత్తరం వ్రాశాడు.

## 13

శ్రీధర్‌కు తండ్రి దగ్గరనుంచీ ప్రత్యుత్తరం వచ్చింది. ఇంట్లో అందరూ క్షేమం, వదినె రుక్మిణమ్మకు ఆరోమాసం. వంట్లో నలతగా ఉండి యింటిపనులు చేసుకోలేక పోతోంది. వీలైతే తారను మదనపల్లి రమ్మని వ్రాయవలసిం దంటూ శ్రీధర్‌కు వ్రాశా రాయన. డిసెంబరు సెలవుల్లో అతన్ని యింటికి రమ్మన్నారు.

వదినె గర్భవతి అనే వార్త శ్రీధర్‌కు సంతోషం కలిగించింది. వెంటనే తారకు ఉత్తరం వ్రాశాడు. మదనపల్లి బయల్దేరమనీ, తనొక పది రోజుల్లో సంక్రాంతి సెలవులకు అక్కడికి వస్తాననీ వ్రాశాడు. తార జవాబు వ్రాస్తూ తను యిప్పట్లో మదనపల్లికి రావటానికి వీలుపడదనీ, తన తల్లికి ఆరోగ్యం బాగుండటంలేదనీ తెలియజేసింది.

శ్రీధర్‌కు తారమీద కోపం వచ్చింది. ఆమె చూపించిన కారణం కేవలం ఒక నెపం తప్ప నిజంగా తార తల్లికి జబ్బేమీ ఉండదనే అతని నమ్మకం.

సంక్రాంతి సెలవులకు మదనపల్లి వెళ్లాడు శ్రీధర్. రుక్మిణమ్మ చాలా నీరసంగా, వంట్లో బొత్తిగా వోపికలేని స్థితిలో ఉంది. పుట్టింటివైపు నుంచీ ఆమె అమ్మమ్మకు చెల్లెలి వరుస అయిన ఒక ముసలావిడను సాయం తెచ్చుకున్నది. ఆ పరిస్థితుల్లో రామలింగయ్యగారికి సరియైన సదుపాయం జరగటంలేదు. కాని వేసవిలో వచ్చినటువంటి ఉద్ధృత పరిస్థితి మళ్లీ రాలేదనీ, నెమ్మదిగానే ఉందనీ చెప్పా రాయన.

శ్రీధర్‌కు ఇంటి పరిస్థితి చాల దుఃఖాన్ని కలిగించింది. తనకు వివాహమై ఉండి కూడా, తన భార్య యీ సమయంలో ఆదుకోలేక పోవటం అతన్ని ఖిన్నుణ్ణి చేసింది. రుక్మిణమ్మతో ఆమాటే అన్నాడు శ్రీధర్.

"ఏక్కడికి ప్రాప్తమో అంతేనయ్యా ! లోపల కలగాలి గాని బలవంతం చేస్తే ఒకరు చెబితే వచ్చేవి కావు అపేక్షలు. కోరుకుని ఏం లాభం ? పైగా మీ అత్త చలవ నీ భార్యమీద ఉండనే ఉందాయె .... నువ్వు చదువు పూర్తిచేసుకొని రా చూద్దాం ...." అన్నదామె.

కాని అతనికి తారలోనే ఆ గుణం లోపించిన ట్లనిపించింది. మన బంగారం మంచిదైతే కంసాలిని ఆడిపొయ్యట మెందుకు ? మంగమ్మత్త ప్రభావం ఏం చేస్తుంది, తారకు తన కర్తవ్య మేమిటో గట్టిగా తెలిస్తే !

ఆ సెలవుల్లో ఒకరోజు చలమయ్యను కలుసుకున్నాడు శ్రీధర్. చలమయ్య చాలసేపు రాజకీయాలు, సంఘంలోవుండే వర్గభేదాలు, మార్క్సిజమ్ గురించి ప్రసంగించాడు. ఇది అతనిలో ఒక క్రొత్త పరిణామంగా తోచింది శ్రీధర్‌కు.

"రాజకీయ స్వాతంత్ర్యం సిద్ధించింది దేశానికి: ఇక ఆర్థిక స్వాతంత్ర్యం అంటే వర్గ సమానత్వం ఎప్పుడు ఎలా సాధించాలనేదే ముందు ప్రశ్న శ్రీధర్! నిజానికి కమ్యూనిజమంటే మన మేదో అపోహలు పెట్టుకున్నా మిన్నాళ్లూ. చూడు మనలో మాట, నీకూ, నాకూ కమ్యూనిజమ్ వస్తే పోయేదేమీ లేదు, మన సంకెళ్లు తప్ప. మనం కష్టజీవులం శ్రీధర్!" అన్నాడు చలమయ్య.

చలమయ్య కమ్యూనిస్టుపార్టీవైపు మొగ్గుతున్నాడని గ్రహించటానికి ఎంతోసేపు పట్టలేదు: "పోనిద్దూ, రాజకీయాల గొడవ! ఇంకేవైనా సంగతులుంటే చెప్పు!" అన్నాడు శ్రీధర్.

"విశేషా లేముంటాయ్ మన ఊళ్లో...బహుశా నువ్విపాటికి వినే ఉంటావు—లెక్చరరు శేషాద్రి కూతురు లేదూ సుజాతని వెధవముండ, చూట్టానికి దిట్టంగా ఉంటుంది, మహిళామండలి కార్యదర్శినిగా ఊళ్లో తిరుగుతూ ఉండేది, అది లేచిపోయిందట, వంటవాడితో......ఇరవై రోజులైంది, వూరంతా అనుకోవటమే!" తృప్తిగా నవ్వుతున్నాడు చలమయ్య.

"అయ్యయ్యో ! ఎంత అప్రతిష్ఠ శేషాద్రిగారికి!"

"ఏంజేస్తాడు? మరి థియోసఫిస్టూ, పెద్దగా కబుర్లు చెబుతాడూ, ఆ పిల్లకు ఎప్పుడో మళ్లీ పెళ్లి చెయ్యాల్సింది!...... అన్నీ బూర్జువా కబుర్లు....ఈ వూళ్లో ఆయ నీమధ్య ఒక పెద్ద రియాక్షనరీగా తయారయ్యాడులే......పంచాయతీబోర్డు ఎలక్షన్లలో తన కెందుకు జోక్యం చెప్పు!"

"పెద్దవాడు, ఆయన్ని గూర్చి అలా అనటంలో అర్థం లేదు చలమయ్యా!"

"ఏమిటయ్యా పెద్ద? అందరూ పెద్దవాళ్లే ! మర్యాద పేరిట బురఖా వేసుకుని తిరిగే రియాక్షనరీస్ బ్రతుకు ఇలానే బయటపడుతుంది.....ఆ కాలం వచ్చేసింది!"

చలమయ్య తత్త్వం చాలా దూరమే పురోగమించిందే! అనుకున్నాడు శ్రీధర్. బి. ఏ. పరీక్షకు ప్రైవేటుగా చదువుతూ ఎన్నెన్నిసార్లు శేషాద్రిగారి సహాయ్యం అర్థించలేదు చలమయ్య! ఆ విశ్వాసం తాలూకు గౌరవమూ సానుభూతీ అయినా లేదే అని బాధపడ్డాడు. ఏమీ సమాధానం చెప్పకుండానే ఆ ప్రసంగం అంతటితో కట్టిపెట్టి లేచాడు శ్రీధర్.

శేషాద్రిగారి ఇంటికి వెళ్లాడు శ్రీధర్. ఇల్లు తాళం వేసివుంది. విచారించగా రెండు నెలలు సెలవు తీసుకుని బెంగుళూరు వెళ్లారని తెలిసింది.

సెలవులైపోగానే మద్రాసు తిరుగు ప్రయాణం కట్టుతూ శ్రీధర్ ఓబయ్యమామ దగ్గర మరొక అయిదు వందలు పుచ్చుకున్నాడు యథాప్రకారం నోటు వ్రాసి......

శ్రీధర్ తిరిగివచ్చేటప్పటికి అతనికొక అచ్చొత్తిన ఆహ్వానమూ, దానితోబాటు చంద్రావతి స్వయంగా వ్రాసిన లేఖా ఎదురు చూస్తున్నాయి.

"శ్రీధర్,

మా అబ్బాయి సురేష్ పుట్టినరోజు 17 వ తేదీన పార్టీకి ఆహ్వానం ఇందువెంట పంపాను. సెలవులు 15 వ తేదీవరకే కాబట్టి నువ్వు ఆపాటికే మదనపల్లినుంచీ వస్తావనీ, పార్టీకి తప్పక రాగలుగుతావనీ ఆశిస్తున్నాను.

ను వ్వెన్నో సార్లు అడిగిన నీ మేనల్లుణ్ణి చూపించటమే కాదు, మావారినీ పరిచయం చేస్తాను, ఏం? చంద్రావతి"

పార్టీకి వెళ్లటమా? వద్దా అన్న ప్రశ్న ఎదురైంది. ఎందుకు వెళ్లటం; వెళ్లి లేనిపోని అన్యాయాలకూ, అనుమానాలకూ అవకాశం ఇవ్వటం? చంద్రావతి మిగతా సహోద్యాయుల్ని ఆహ్వానించిందేమోనని చూశాడు కాని ఎక్కడా ఆ ప్రసక్తే విని పించలేదు......తను స్వయంగా వెళ్లకపోయినా పిల్లవాడికే మైనా పంపించవలెనని నిశ్చయించాడు చివరకు.

బజారువెళ్లి ఎన్నో వస్తువులు చూచాడుకాని ఏదీ నచ్చ లేదు. అబ్బాయికి నాలుగు పూర్తయి అయిదు వచ్చింది. ఏమిస్తే బాగుంటుంది? చివరకు "వ్యూమాస్టర్" అనే దాన్ని—సినిమా బొమ్మలలాగ ప్రపంచంలో వింత దృశ్యాల సెల్యూలాయిడ్ ఫిల్ముల్నిచూచే 'దర్శిని'—కొన్నాడు. చంద్రావతికీ, తనకూ సినిమా అంటే సరదా. దాన్ని ఈ వస్తువు గుర్తు తెస్తుందని పూహించు కున్నాడు. పిల్లవాడికీ సరదాగానూ విజ్ఞానదాయకంగానూ ఉంటుంది.

పదహారోతేదీ దాన్ని పార్శెలుకట్టి రిజిస్టర్డుపోస్టులో చంద్రావతికి పంపాడు. అందులో "ఆశీర్వాదాలూ, శుభాకాంక్షలూ" అని వ్రాసి సంతకం చేశాడేకాని, తను స్వయంగా హాజరుకాక పోవటానికి కారణమేమీ వివరించలేదు.

తర్వాత వారం రోజులపాటు శ్రీధర్ లైబ్రరీకి కూడ వెళ్లలేదు. అక్కడ చంద్రావతి కనిపించి 'ఎందుకు రాలేదని' ప్రశ్నిస్తే ఏమి జవాబు చెప్పాలో తెలీకపోవటమే అందుకు కారణం.

ఒక ఆదివారం ప్రొద్దున ఎనిమిదిగంటలకు శ్రీధర్‌కోసం మనిషి వచ్చాడు. తను చంద్రావతివాళ్ల కారుడ్రైవరుననీ, చంద్రావతీ, ఆమెభర్తా ఆరోజు శ్రీధర్‌ని మధ్యాహ్నం భోజనానికి ఆహ్వానిస్తూ తనని పంపారనీ చంద్రావతి వ్రాసిన చీటీ యిచ్చాడు. తను మళ్లీ 11 గంటల తర్వాత కారు తీసుకొని వస్తానని కూడా చెప్పాడు. శ్రీధర్ సరేనని చెప్పి అతణ్ణి పంపించివేశాడు.

అతను వెళ్లిన తర్వాత ఎలా తప్పుకోవటమా అని ఆలో చించాడు. మార్గం కనిపించలేదు. ఇప్పుడేదో వంకపెట్టి తప్పించు కొన్నా తర్వాతనైనా చంద్రావతితో వెళ్లలేకపోయినందుకు కారణమేమిటో చెప్పి క్షమాపణ కోరవలసిన పరిస్థితి అనిపిం చింది శ్రీధర్‌కు. వస్తానని చెప్పి వెళ్లకపోవటం, తర్వాత ఆమె ముఖమే చూడకపోవటం, నిష్కారణంగా, దారుణంగా అవమా నించటమే అవుతుంది. అలా చెయ్యటానికి అతనికి మనస్కరించలేదు.

పదకొండుగంటలకు అట్టహాసంగా కారు రావటం, తను అందులో వెళ్లటం, అది హాస్టలులోవాళ్లు చూడటం, వ్యాఖ్యానించటం, తలచుకుంటే ఒళ్లు కంపరమెత్తుతోంది. అందువల్ల వేళకు ముందుగానే చంద్రావతి ఇంటికి తరలివెళ్లిపోవటమే ఉత్తమమార్గం అని ఆలోచించి పదింటికే శ్రీధర్ చంద్రావతి ఇంటికి వెళ్లాడు.

చంద్రావతి వంటింట్లో వుంది. శ్రీధర్ వచ్చాడని తెలీ గానే వచ్చి "పైకి పోదాం" అని మేడమీదికి తీసుకువెళ్లింది. పుట్టినరోజు పండుగకు హాజరవటానికి వీల్లేకపోవటాన్నిగూర్చి శ్రీధర్ రెండు పొడిమాటలు చెప్పాడు.

"అందుకు బదులు తీర్చటానికే కాబోలు, పదకొండుదాకా అంటే కారుకోసం ఆగకుండా ముందుగానే రావటం! నిజమేనా" అన్నది చంద్రావతి నవ్వుతూనే కొంత విస్మారంగా.

"అతిథి టైముకు చాల ముందుగా రావటం పొరపాటే నని నేనూ ఒప్పుకొంటాను......ఇప్పుడేం చెయ్యనుమరి?" అన్నాడు నొచ్చుకుంటున్న ధోరణిలో శ్రీధర్.

"అసలు పొరపాటు ను వ్విన్నాళ్లూ రాకపోవటం! దాన్ని సర్దుకోవటానికి ఏంచేసినా ఫరవా లేదులే!......నిజానికి నువ్వు ముందుగానే వస్తావనీ, కారు పంపే మర్యాదకోసం ఆగవనీ వూహి స్తూనే వున్నాను శ్రీధర్! నీవు యిలా రావటమే నా ఊహకు సరిగ్గా ఎంతో బాగుంది నాకు! బాబూ, వాళ్లనాన్నా, స్నేహితు లింటికి వెళ్లారు, ఇంకో అరగంటలో వస్తారు, కూర్చో......"

శ్రీధర్ కూర్చున్నాడు. చంద్రావతి అతను మాటాడితే వినాలన్నట్లుగా కుతూహలంగా ఎదురు చూస్తోంది. కాని శ్రీధర్ యిటూ అటూ చూచి బల్లమీదవున్న పత్రిక చేతికి తీసుకున్నాడు. అది చూచి చంద్రావతి "ఇప్పుడే వస్తాను" అంటూ క్రిందికి వెళ్లింది.

ఆమె వెళ్లగానే పత్రిక బల్లమీదపెట్టేసి, ఆమె ఖాళీ చేసిన కుర్చీని చూస్తూ, మనస్సుని చక్కబెట్టుకోవటానికి ప్రయత్నిస్తున్నాడు.

చంద్రావతిని చూడగానే,ఆమె ఆప్యాయంగా అన్నమాటల్ని వినగానే, అతనిలో మరణించిన ఒక విశ్వాసం దెబ్బతిని మూర్ఛ పోయిన ఒక అనుభూతి పునరుజ్జీవితమై కదిలింది.....తనేదో తప్పు చేసినట్లు మనస్సులో కొంతా, తను చేసిన తప్పేమిటన్న ఎదురుప్రశ్న, ఈ భావాలన్నీ కేవలం అప్రస్తుతమన్న హెచ్చరికా అతనిలో తడబాటు కలిగించాయి......" అసలు పొరపాటు నువ్విన్నాళ్లూ రాకపోవటం అన్న ఆమె వాక్యం రింగుమంటూ అతనిలో "తనది పొరపాటా?-ఎవరిది పొరపాటు?" అనే మీమాం సను రేకెత్తించింది.

చంద్రావతి రెండు గ్లాసుల్లో షర్బత్ తీసుకుని వచ్చి ఒకటి అతనికిచ్చి ఒకటి తను తీసుకున్నది.

"శ్రీధర్! నిజానికి నీ గురించికాదు, నావల్ల పొరపాటేమైనా జరిగిందేమోనని అడిగి తెలుసుకొని క్షమాపణ చెప్పటానికే నిన్ను ఆహ్వానించాను, తెలుసా?" అన్నది చంద్రావతి.

ఆమె పొరపాటేమిటో, దానివల్ల కలిగిన ఫలితాలేమిటో చెబుదామని నోటిదాకా వచ్చినా ఆగిపోయాడు శ్రీధర్. ఆమె అలా నిష్కల్మషంగా అతని ముఖంలోకి చూస్తూవుంటే అత నికి నోట మాటే రాలేదు......మనస్సు మారింది.

"ఏమీ లేదే!" అన్నాడు అన్ని సందేహాలూ దిగమ్రింగి.

"మరెందుకు రావటం మానుకున్నావ్?"

"తీరుబాటు లేక. . . . . . చదువుకుంటున్నాను కొంచెం శ్రద్ధగా. అదీగాక మనం లోకంలో వుండే సిద్ధాంతాలన్నీ సమగ్రంగా ఇదివరకే చర్చించివేశాం కదా, ఇంకేమీ మిగల్లేదు కూడా!"

చంద్రావతి నవ్వేసింది.

"నిజమే! కాని ఎప్పుడూ నా గొడవతో నేను సతమత మవుతూ నీ కెక్కడ బాధ కలిగించానో అనీ అనుమానం కలిగింది......ఆరోజు మహాబలిపురం వెళ్లినరోజున నా మూడ్ బాగులేదు.....నిన్నేదో తీవ్రంగా విమర్శించాను కూడా...... తర్వాతనే నువ్వు రావటం మానేశావ్......అందువల్ల......"

"ఇప్పు డెలా వుంది మూడ్? నువ్వు మీ అబ్బాయిని తీసుకు వచ్చెయ్యటం ఎంతో బాగుంది...అలా చెయ్యమని నే నెన్ని సార్లు చెప్పలేదు?"

"అలా కాదులే!......శ్రీధర్, నీ కో రహస్యం చెప్పనా?"

"ఏమిటి?" అన్నాడు పసిపిల్లవాడికిమల్లే గోముగా కుతూహలంగా ఆమె కళ్లల్లోకి చూస్తూ సర్వమూ విస్మరించి...

"పెద్ద రహస్య మేమీ కాదు. కేవలం నాకు సంబంధించిందే. కాని నీకు చెప్పాలనిపించింది, అందుకే నిన్ను ప్రత్యేకంగా పిలిచాను. పిలవకపోతే నువ్వు ఇక రావేమో అనుకున్నాను కూడా......నా మూడ్ ఇప్పుడు బాగుండటానికి కారణం నాలో వాడిపోయిం దనుకున్న విశ్వాసం మళ్లీ చిగురెత్తి బ్రతకటమే!......కొన్నాళ్లుగా మావారి ప్రవర్తన విపరీతంగా మారిందన్నాను కదూ నీతో.....నిజానికి అందు క్కారణం ఒక స్టైనో సీతాకోక చిలుక..... చివరకు అది బాగా దగాచేసి పారిపోయిందిలే! ఇప్పు డదంతా మరచి పోవటానికి ప్రయత్నం జరుగుతోంది......కాని ఆ పీడకల జరిగి నన్నాళ్లూ నాకు సంఘ వ్యవస్థమీదా, మనుష్యులమీదా నమ్మకం చెదిరిపోయింది శ్రీధర్! నేను పిచ్చిదాన్నే అయ్యాను. ఏ విశ్వాస మైనా అవిశ్వాసమనే అగ్నిపరీక్షలో కృతార్థత పొందితేగాని దాని విలువ, దాని నిజ స్వరూపం బయటపడదు కాబోలు శ్రీధర్!...... ఆ పరిస్థితుల్లో నువ్వే లేకపోతే ఏమైపోయేదాన్నో! మనలో విశ్వాసాలు కూడా కొన్ని సంఘటనలనుబట్టి, మనకు సంబంధించిన వ్యక్తుల్నిబట్టి జీవిస్తాయి, మరణిస్తాయి......పరిస్థితిలో ఇప్పుడీ మార్పు జరగకపోతే నే నేమైపోయేదాన్నో నాకే తెలీదు...... మహాబలిపురంనుంచి తిరిగివచ్చిన ఆ సాయంత్రం ఎంత నిస్పృహలో ఉన్నాను! ఆ మరుసటిరోజే బర్మానుంచి వారు తిరిగి వచ్చారు. కథ మలుపు తిరిగింది......కానీ......" చంద్రావతి ముగించలేదు. కారు వచ్చి ఆగిన శబ్దం వినిపించింది. ఆమెలేచి నిల్చుంది.....

"క్రిందికి పోదాంపద, బాబూ, ఆయనా వచ్చారు" అంటూ గబగబా క్రిందికి తీసుకుపోయింది శ్రీధర్‌ను.

చంద్రావతి భర్త ప్రకాష్ చామనలుపే అయినా స్ఫురద్రూపి, అందమైనవాడు. కలుపుగోలుతనం చూపించాడు. చంద్రావతి కొడుకు సురేష్ చలాకీగా చక్కగా ఉన్నాడు. ఎక్కువగా తల్లి పోలికలు వచ్చాయి. శ్రీధర్ బహుమతిగా పంపిన 'వ్యూమాస్టర్' తీసుకొచ్చి కబుర్లు చెప్పాడు.

తర్వాత భోజనాలు.

ఆ కుటుంబం శ్రీధర్‌ని ముగ్ధుణ్ణి చేసింది. భోజనం కాగానే ప్రకాష్ ముక్తసరిగా సెలవు తీసుకొని మేడమీదకు వెళ్లి పోయాడు.

"ఆయన కార్యక్రమం ఎప్పుడూ ఠంచనుగా ఉంటుంది. ఆదివారం భోజనానంతరం విశ్రాంతి, ఫలానా చదవాలి, ఫలానా కాగితాలు చూడాలి అని పెట్టుకుంటే అది జరగాల్సిందే. వాయిదా మాత్రం పడదు. అది అలవాటు" అంది చంద్రావతి.

సుమారు ఒకగంటసేపు అక్కడేవున్నా, చంద్రావతి తోనూ, సురేష్‌తోనూ మాట్లాడుతూవున్నా శ్రీధర్ మనస్సు మాత్రం అక్కడలేదు......చంద్రావతి పూర్వపు ధోరణికీ, ఇప్పటి ధోరణికీ భేదం కనిపిస్తూనే వుంది. ప్రతి విషయానికీ ఒక వాదం, ఒక సిద్ధాంతం లేవదీసే ఆమె ధోరణి ఇప్పుడు బొత్తిగా మారి పోయింది......ఆమె చూపు, ఆలోచనా, ప్రతిమాటా కొడుకు వైపే ఆసక్తిగా పరిభ్రమిస్తున్నాయి......

శ్రీధర్ సెలవు తీసుకోటానికి లేచాడు. చంద్రావతి అతణ్ణి పూర్వంలాగే వస్తూ ఉండమని ఆహ్వానించింది. వచ్చి తనతో, కొడుకుతో ఆదివారాలు గడుపుతూ ఉండమని చెప్పింది. "అలాగే" అన్నాడు శ్రీధర్. కాని ఆ మాట వెనుక ఉండవలసిన విశ్వాసం కాని ధైర్యంకాని అతనిలో లేవు.

చంద్రావతి డ్రైవర్‌ను కేకవేసింది. శ్రీధర్, "కారు వద్దు, నేను ట్రిప్లికేన్‌వైపు వెళ్లాలి" అన్నాడు. హాస్టలుకు కారులో వెళ్లటం అతని కిష్టంలేదు.

"పోనీ, ట్రిప్లికేనుకే వస్తాడు. ఇప్పుడు కారుతో వేరే పనేం లేదు" అన్నదామె.

"సరే" నన్నాడు శ్రీధర్ విధిలేక.

గేటు దాటిన తర్వాత డ్రైవరుని "యూనివర్శిటీ లైబ్రరీకి తీసుకువెళ్ల"మని చెప్పాడు. తర్వాతనైనా చంద్రావతి డ్రైవరుని ప్రశ్నిస్తుందని తెలుసు శ్రీధర్‌కు.

కారు లైబ్రరీకి చేర్చింది శ్రీధర్‌ను.

"థాంక్స్" అని చెప్పి లోపలికి వెళ్లిపోయాడు. వెళ్లి మేగజైన్ సెక్షనులో ఒకచోట కూర్చున్నాడు.

సాయంత్రం అయిదుదాకా అక్కడే ఉండిపోయాడు ఆలోచిస్తూ.......మొదటిసారిగా అతనికి తనమీద తనకే అసహ్యం కోపం కలిగాయి......

ఆలోచించేకొద్దీ తన పిరికితనం, తను అబద్ధాలాడటం, తను ఏ విషయాన్నిగూర్చీ గట్టిగా ఆలోచించి ఒక నిర్ణయానికి రాలేకపోవటం, ఎటూ తన అసమర్థతే స్పష్టంగా కనిపిస్తోంది అతనికి.

తనకు రౌడీలవల్ల జరిగిన అవమానం, తన దౌర్బల్యం, తనకు ఆమెపట్ల కలిగిన నిరసనభావం, అపోహ—అన్ని సంగతులూ వెళ్లి ఒక్కసారి చంద్రావతితో చెప్పివెయ్యా లనిపించింది. కాని ఫలితం? చంద్రావతి తనతో స్నేహానికీ, అనుబంధానికీ ఎంతో విలువ యిచ్చింది, ఇస్తోంది!......అది ఆమె ఎప్పటికీ మరచిపోలేని విషయం......ఆ స్మృతిని వెళ్లి కలుషితం చెయ్యడ మేనా?......ఆమె తనమీద చూపుతున్న విశ్వాసాన్ని చేజేతులా ఎలా నాశనం చెయ్యటం?

తను పోగొట్టుకున్న విశ్వాసాన్ని మళ్లీ పొందగలిగానని ఆనందంతో చెబుతున్నదే చంద్రావతి!......తనలోనూ ఒక ప్రగాఢమైన విశ్వాసం—ఆమెమీదా, రుక్మిణమ్మవదినెమీదా—ఉందంటూ గొప్పలు చెప్పి తీరా తనే పరీక్షకు నిలవలేకపోయిన సంగతి—పని గట్టుకుని వెళ్లి ఆమాట ఏమని చెప్పగలడు! తన అల్పత్వాన్ని ప్రస్తుతం ఆమెకు చెప్పి కించపరచుకోవటంతో లాభించే దేమిటి? తనలో వ్యక్తమైన బలహీనత ఏ విధంగాను ఇప్పుడు మాసిపోదు కద! గత చరిత్ర మారదు!

మనిషి తప్పులు చేస్తాడు......చేసిన తప్పు తిరిగిరాదు......అందువల్ల భవిష్యత్తులో అంతకంటె మెరుగ్గా ప్రవర్తించటానికి ప్రయత్నం మాత్రమే చెయ్యగలడు అనుభవం సాహాయ్యంతో....అంతకంటె చెయ్యగలిగిందీ లేదు! తనలో విశ్వాసం శక్తివంతం కావాలి!

గాంధీ సిద్ధాంతాలమీద విశ్వాసం ప్రకటించిన తను, సత్య పరీక్షకు ఏమాత్రం నిలవగలిగాడు? సమయం వచ్చినపుడు పరీక్షకు నిలవటం ముఖ్యంకాని, ఏవో సిద్ధాంతాలను గూర్చి నమ్మకం ఉందంటూ మాట్లాడటం ముఖ్యం కాదు గద!

విశ్వాసం గట్టిలేనినాడు ప్రేమకూ, అభిమానానికీ ప్రయోజనమూ విలువా ఉండవు!

"కనిపించిన ఆదర్శాన్నీ, సిద్ధాంతాన్నీ స్వీకరిస్తావు. కాని నీలో గట్టి ఏమిటో నాకు ఇప్పటిదాక తెలీకనే పోయింది" అన్నది చంద్రావతి మహాబలిపురం వెళ్లినరోజు. సమాధానంగా తనకు ఆమెమీదా, రుక్మిణమ్మమీదా విశ్వాసం అచంచలమైందని నొక్కి చెప్పాడు ఆమెతో......ఆ విశ్వాసం ఇప్పటికీ తనలో నిలిచివున్నా, పరీక్షకుమాత్రం తను నిలవలేకపోయాడే! ఇక ఆ విశ్వాసానికి ప్రయోజన మేమిటి?

శ్రీధర్ మనస్సు మళ్లీ మళ్లీ అక్కడికే-తన దౌర్బల్యం దగ్గరికే—సుళ్లు తిరిగి వచ్చి నిలుస్తోంది......"ఏ విశ్వాసమైనా అవిశ్వాసం అనే అగ్నిపరీక్షలో కృతార్థత పొందితేగాని దాని విలువ రుజువు కాదు, శ్రీధర్" అన్న చంద్రావతి మాట ఆమె తనకిచ్చిన సందేశంలా ప్రతిధ్వనిస్తోంది......

## 14

పరిస్థితులు ఎలామారినా జీవితంలో తనకు ముఖ్యమైన విలువల్నీ, విశ్వాసాల్నీ అంటిపెట్టుకునే ప్రయాణం సాగించాలన్న నిశ్చయాన్ని తరచు జ్ఞాపకం తెచ్చుకుంటూనే ఉన్నాడు శ్రీధర్.

మద్రాసులో బి. టి. చదువు ముగిసింది. అక్కడ చంద్రావతితో పరిచయం తనలోని దౌర్బల్యం ఏమిటో పరీక్షించి సువ్యక్తం చేసింది. అందులో తను పెద్ద గుణపాఠం నేర్చుకున్నా ననుకున్నాడు. ఫలితంగా తనలో అంతకుపూర్వంలేని ఒక 'గట్టితనాన్ని' పెంపొందించుకునే ప్రయత్నంలో ఉన్నాడు శ్రీధర్.

వేసవి సెలవుల్లో (1949) బందరులో నెలరోజులు గడిపాక రుక్మిణమ్మకు మగపిల్లవాడు కలిగాడని తెలిసి శ్రీధర్ మేనెలలో తారనూ, పాపాయినీ తీసుకుని మదనపల్లి బయలుదేరాలనుకున్న ఉద్దేశ్యం నెరవేరలేదు. తార ససేమిరా తను మదనపల్లి రానన్నది. రుక్మిణమ్మ తనకేమీ అత్తగారుకాదనీ, ఆమె అజమాయిషీక్రింద బ్రతకవలసిన కర్మం తనకు లేదనీ, నిష్ఠురంగా మాట్లాడింది. శ్రీధర్‌కు కోపం వచ్చింది. మారు మాట్లాడకుండా రైలెక్కాడు. బావమరది రైలుదాక వచ్చి రెండవ తరగతి టికెట్టు తీసియిచ్చి అనునయంగా చెప్పాడు: "అసలు విషయం ఇప్పుడు తార మదనపల్లి వచ్చినా, మీరు అక్కడే ఉంటారన్న నిశ్చయం లేదుకదా! ఉద్యోగంలో ఏ వూళ్లో ప్రవేశిస్తారో ఏమో, ఆ విషయాలన్నీ నిర్ణయమైన తర్వాత ఒక్కసారే వస్తుంది తార. ఇప్పుడు మదనపల్లి రావటం మళ్లీ అక్కణ్ణుంచీ అంతలోనే కదలటం ఎందుకు లెమ్మని బద్ధకిస్తోంది, అంతే! ఆడవాళ్ల మాటలకి యథాతథంగా, Literalగా, (అక్షరాలా) మనం ఎప్పుడూ విలువ యివ్వకూడదు. They Dont mean what they say"అన్నాడు మురళీమోహన్.

ఆ చివరి వాక్యంలో సత్యం ఉందని అంగీకరిస్తూ తల పంకించాడు శ్రీధర్. తన కిప్పు డిప్పుడే బోధపడుతున్న ఈ రహస్యం—ఆడవాళ్ల మాటల రహస్యం—పెళ్లికాని మురళీకి అప్పుడే ఎలా అనుభవానికి వచ్చిందా అని ఆశ్చర్యపడ్డాడు. ఏమైనా మురళీ మెడికల్ కాలేజి స్టూడెంటు కదా !—అనుకున్నాడు తనలో.

"కోపం వచ్చి తారకు ఉత్తరం వ్రాసినా వ్రాయకపోయినా నాకు వ్రాయి బావా! నేను కనుక్కుంటాను దాని సంగతి" అన్నాడు మురళీ రైలు కదులుతూండగా. శ్రీధర్ జవాబు చెప్పలేదు.

తనకు మాతృస్థానంలోవుంటూ ఆదర్శమూర్తిగా భాసిస్తున్న రుక్మిణమ్మ తారకు అంగీకార్యం కాకపోవటం—సమష్టి కుటుంబ జీవనంలో శ్రీధర్‌కున్న విశ్వాసానికి పెద్ద ఆఘాతమే అయింది.......అయినా తను చలించకుండా నిలబడితే కాలమే పరిస్థితిని చక్కబరుస్తుందనే అభిప్రాయానికి వచ్చాడు శ్రీధర్......

జిల్లాబోర్డు హైస్కూలులో ఖాళీలు ఉన్నాయని తెలిసి దరఖాస్తు పెట్టాడు బి. టి. అసిస్టెంటు ఉద్యోగానికి. జూన్ మొదటివారంలో పోస్టింగ్ వచ్చింది. మదనపల్లి హైస్కూల్లోనే వేశారు. తను ఆరేళ్లు చదువుకున్న హైస్కూల్లోనే ఉపాధ్యాయ పదవి లభించిందని సంతోషించాడు శ్రీధర్.

బందరునుంచీ వచ్చిన రెండు నెలల్లోనూ తార దగ్గర నుంచీ ఉత్తరమే లేదు. శ్రీధర్ చలించలేదు. తనూ వ్రాయలేదు. మురళీమోహన్ గుంటూరు వెళ్లి హౌస్ సర్జన్ చేస్తున్నాడు. అక్కడినుండి మూడు నాలుగు ఉత్తరాలు వ్రాశాడు. కాని అతనికి బందరు వార్తలు ఎంతవరకు తెలుసునో శ్రీధర్ వూహించుకోలేకపోయాడు—వార్తలంటే తార మనోవైఖరిని గూర్చిన భోగట్టా.

ఉద్యోగంలో చేరగానే మంగమ్మత్తా ఓబయ్యమామా సలహా యిచ్చారు : ఇల్లు తీసుకుని వేరు కాపురంపెట్టి తారను తీసుకురమ్మనీ, తర్వాత ఆస్తి పంపకాల విషయం ప్రయత్నం

చెయ్యమనీ......"ఏమైనాసరే, నేను వేరుకాపురం మాత్రం పెట్టను. ఇష్టం ఉంటే వస్తుంది, లేకపోతే పుట్టింటిలోనే ఉంటుంది" అని స్పష్టంగా చెప్పేశాడు శ్రీధర్ వాళ్లతో.

"అదేమిటి నాయనా, ఆ రుక్కు తల్లి ఏం మందు పెట్టిందో, ఏం మాయో, లేకపోతే ఇలా పెళ్లాం బిడ్డలమీద ఎవరైనా మమకారం వదులుకుంటారా? విడ్డూరం విచిత్రం కాకపోతే! మీ యన్న, మీ నాన్న కూడా నువ్వు చదువుకుంటా నంటే కళ్లల్లో నిప్పులు పోసుకున్నారాయె. నీ కట్నం సొమ్ము నీకు దక్కకుండా దాచుకున్నారాయె. నీ వంతు ఆస్తి పూర్తిగా అనుభవిస్తూ ఉన్నారు. పైగా నువ్వు ఉద్యోగం చేసి సంపాయించే జీతం డబ్బులు కూడా వాళ్లకే చెల్లింపు అవుతూందే! ఇంతా జరుగుతున్నా వాళ్ల అడుగులకు మడుగు లొత్తుతూనే ఉంటా నంటావూ? పెళ్లాం పిల్లలు అక్కర లేదంటావూ? నీ చేతగానితనానికి నాకు మతి పోతూవుంది సరీ! వలసపల్లిలో మందు కక్కించే వైద్యు డున్నాట్ట—వాణ్ణి పిలిపిస్తా నుండు" అన్నది మంగమ్మత్త, బాధ్యతఅంతా రుక్మిణమ్మమీదికి నెట్టుతూ.

"అత్తా! అసలు మా కుటుంబం విషయాలు పొగదీసి ఇతరులతో మాట్లాడటం నాకు యిష్టం ఉండదు. నువ్వు చీటికీ మాటికీ వదినె ఏదో చేసిందనటమూ ఏమీ బాగా లేదు. ఈ విషయంలో నేను బాగా ఆలోచించుకునే చెబుతున్నాను. ఇందులో మందూ, మాకూ, వెఱ్ఱీ, పిచ్చా ఏమీలేదు. ఏ పరిస్థితి వచ్చినా నేను వేరుపడటంమాత్రం అసంభవం! అది నావల్ల జరిగేపని కాదు. తారకు ఇవ్వాళ బుద్ధిలేకపోవచ్చు. తాత్కాలికంగా వాళ్ల అమ్మా నాన్నా చెప్పుడు మాటలకు లోబడవచ్చు; ఎక్కడికి పోతుంది. ఇవ్వాళ కాకపోతే అది రేపైనా వచ్చి తీరుతుంది. ఆ నమ్మకం నాకుంది. ఇలాంటి విషయాల్లో సులువుగా చలించటం, లొంగిపోవటం కేవలం దౌర్బల్యం..... ఏం, నాకామాత్రం గట్టి మనస్సు లేదనుకుంటున్నారా మీరు? లేక మనుష్యుల్ని అర్థం చేసుకునే జ్ఞానమే లేదనుకుంటున్నారా? ఆస్తి అంటారా, ఆస్తి ఎక్కడికీ పోదు! మీరు అనవసరంగా చీటికీ మాటికీ నన్ను గొడవ పెట్టకండి" అన్నాడు శ్రీధర్.

"నిజమే శ్రీధర్! ఏం జరిగినా మీరూ మీరూ ఒకటే! అయితే ఆరోజు నువ్వు మద్రాసువెళ్లి చదువుకోవాలంటే వాళ్లెంత ప్రోత్సాహం యిచ్చారో, కన్నతండ్రి ఎవరిని వెనకేసుకు వచ్చాడో, ఇవన్నీ నువ్వప్పుడే మరచిపోయా వన్నమాట! అదీ మంచిదే! నువ్వు చిన్నవాడివి, నీ మనస్సు అద్దంలాంటిది. ఈక్షణం అందులో కనిపించే నీడ మరుక్షణం ఉండదు, ఉండకూడదు. కోపతాపాలు, కావేషాలు ఉండకపోవటం మంచిదే! కాని నే ననేది—న్యాయం జరగవద్దా అని? ఇద్ద రన్నదమ్ము లున్నా రంటే రెండు కన్నులు, రెండు చెవులూ అనుకో. అందులో ఒక కన్నుపోతే పోయిందిలే, ఒక చెవి వోడయితే అయిందిలే అనుకుంటారా ఎవరైనా? మేం అలా అనుకోలేము. అదీ మా ఆదుర్దా. అంతే. మీ కుటుంబం విషయాల్లో మేము జోక్యం చేసుకోవటం నీ కిష్టం లేదన్నావు. సరే. ఎలానన్నా మేం పరాయివాళ్లమే. పోనీ, పరాయివాళ్లంగానే వ్యవహరిస్తాము. నీ క్షేమం కోరటంవల్లే ఇప్పుడీ మాట అనవలసి వస్తోంది! నువ్వూ మీ నాన్నా అన్నా వేరుపడవలసిన అవసరం ఏమీలేదు. పరాయివాళ్లు నీ చదువు కిచ్చిన రెండువేలు మాటేమిటి? నీకు ఆస్తి, సంసారం ఫలానా అని ఏర్పడివుంటే, నువ్వెప్పుడైనా కళ్లు తెరిచే పాటయితే, ఆ ప్రస్తావనే తీసుకురాము; నీదీ మాదీ అనే భేదమే ఉండదు! కాని నువ్వు జాయింటుగా ఉండటానికే నిశ్చయించుకున్నట్లయితే, మా డబ్బు మేం కావాలనడం న్యాయమే! దాన్ని చచ్చినా వాళ్లకు వదులుకోము! నువ్వు మీ నాన్నతోనూ మీ అన్నతోనూ సంప్రదించి ఆ రెండు వేలూ మాకు తిరిగి యిచ్చేట్టుచూడు. అంతే మేము అడగవలసిందీ, ఇప్పుడు నువ్వు చెయ్యవలసిందీ!" అన్నాడు ఓబయ్య మామ.

"అలాగే, వ్యవధి కావాలి" అన్నాడు శ్రీధర్.

అన్నాడే కాని ఆలోచిస్తే తండ్రితో ఈ సంగతి చెప్పే ధైర్యం లేదు అతనికి. ఆయన ఆరోగ్యం బాగులేని స్థితిలో ఈ సమస్యను లేవదీయటమా? 'రక్తపుపోటు' ఉన్నవాళ్లకు మానసికంగా ఉద్రిక్తత ఏమాత్రమూ పనికిరాదు. అన్నయ్య నరసింహులు తను బి. టి. పూర్తి జేసుకునివచ్చాక పూర్తిగా విముఖత్వం వహించాడు. ఎప్పుడూ పట్టుమని నాలుగు మాటలైనా మాట్లాడలేదు. మొదటినుంచీ అతను చదువుకు ప్రతికూలుడుగానే ఉండటం, తను రెండు వేలకు నోటు వ్రాసిన సంగతి ఇదివరలోనే వాళ్లతో చెప్పి ఉండకపోవటం, ఆలోచిస్తే అన్నయ్యతో వ్యవహారం సులువుగా ఉండేట్లు తోచ లేదు. ఇటు మంగమ్మత్త ఎంత పెడసరపు మనిషో, అంత మేర అన్నయ్యలోనూ కోపగుణమూ, బిఱ్ఱబిగిసేతత్త్వం ఉన్నాయని తనకు తెలుసు. పోతే, ఈ వ్యవహారం వదినె ద్వారానే చక్కబడాలి.

ఓబయ్య చెప్పిన మాటల్ని యథాతథంగా రుక్మిణమ్మతో చెప్పాడు శ్రీధర్.

"నువ్వూ మామగారూ అప్పుడు నామాట పడనిచ్చారు కాదు. కాసులపేరుపెట్టి డబ్బు తెచ్చుకొమ్మని చెప్పానా? నెలరోజులక్రితం పొలం కొనటానికి తక్కువపడిన డబ్బు కోసం దాన్ని అడ్డంపెట్టి బాంకులోవున్న మొత్తంతో పొలం కొన్నారు మీ అన్నయ్య—ఇప్పటికి రెండేళ్లుగా జరుగుతున్న వ్యవహారం. మన భూమిలో కలిసే భూమి కావటంవల్ల ఆయన దానిమీదే పెట్టుకున్నారు మనసంతా. ఇప్పుడు మీ అత్తవాళ్ల బాకీ తీరటానికి ఇంట్లో డబ్బెక్కడిదీ?......అమాత్రం అవసరానికి పనికివచ్చే పెద్ద సొత్తు కూడా వేరే నా దగ్గర ఇంకోటి లేదు!" అని యింటి పరిస్థితిని వివరించింది రుక్మిణమ్మ.

శ్రీధర్ ఆలోచించాడు. నాన్నగారితో అన్నయ్యతో సంప్రదించినా వాళ్లు మాత్రం చెయ్యగలిగిం దేమిటి? పొలం ఎక్కడైనా తనఖాపెట్టి రెండువేలు తెచ్చి ఓబయ్యమావకివ్వాలి. కాని అన్నయ్య అందుకు సుతరామూ అంగీకరించడు! అయితే ఏది దారి?

నెలరోజుల గడువూ తీరిపోయింది. ఓబయ్య వూరుకో లేదు. ఒకరోజు శ్రీధర్‌ను యింటికి తీసుకొనివెళ్లి ఈ ప్రస్తావన తెచ్చాడు. శ్రీధర్ ఓబయ్యనూ, మంగమ్మనూ ప్రాధేయ పడ్డాడు. తన జీతం మొత్తం నెల నెలకూ బాకీ తీరేదాకా వాళ్లకే చెల్లిస్తా నన్నాడు. ఈ ఏర్పాటు అంగీకరించమన్నాడు. ఓబయ్య నవ్వేశాడు మనస్సు నొచ్చుకుంటున్న ధోరణిలో: "నువ్వు మమ్మల్ని గురించి తెలుసుకున్న దింతే నన్నమాట! వెర్రివాడా, నీ డబ్బు మాక్కావాలా? మాకున్నదంతా నీకు పెట్టాలనే కదా మా ఆదుర్దా! మేము ఏం ప్రయత్నం చేసినా నీ వాటా నీకు న్యాయంగా రావాలనే ఉద్దేశమే తప్ప వేరే ఏముంటుంది? నీకెంత చెప్పినా మీ అన్నయ్యావాళ్ల మన స్తత్వం బోధపడక పోవటంవల్ల ఇట్లా ఒకదాని కొకటి ముడి పెట్టి, నీ మంచికోరి ఈ దోవ తొక్కవలసి వస్తోంది. నీ కెందుకు నువ్వు చూస్తూవుండు, అన్ని వ్యవహారాలు చక్క బడతాయి. నరసింహులు తనే మొనగా డనుకుంటున్నాడేమో, నిన్నిట్లా దిక్కులేనివాణ్ణి చేసి చివరకు చిప్ప చేతికిచ్చే ఈ ఎత్తు లెవరూ తెలుసుకోలే రనుకుంటున్నాడు కాబోలు—వాడి కెంత అహంభావమనీ.......కొండముచ్చు......."

"ఇన్ని అనుమానాలు దేనికీ? నేనే అన్నయ్యను అడిగి ఏ సంగతీ తేల్చుకుంటాను" అన్నాడు శ్రీధర్. ఓబయ్య అన్నను అంటున్న నిందావాక్యాలు వినటంకంటె, అన్న నరసింహులి దగ్గరకు వెళ్లటమూ, ఏవైనా మాటలు పడవలసి వస్తే పడటమే గౌరవంగా తోచింది అతనికి.

"అదీ, అట్లా అన్నావు, బాగుంది. నీకు నోట్లో నాలుక లేకపోయిందనే కదా మేమింత బాధపడటం. ఈ వ్యవహారం మీ వదినెద్వారా కాదు, నువ్వే మీ అన్నతో మాట్లాడి తేల్చు కోవటం మంచిది."

"అలాగే"

శ్రీధర్ మాటైతే అన్నాడు గానీ, తీరా అన్నతో మాట్లాడా లనుకునేప్పటికి అతనికి ఏం మాట్లాడాలో తెలీలేదు. ఇంటి ఆర్థిక పరిస్థితి ఎలావుందో వదినెద్వారా తెలిసేవుంది. అన్నయ్యకు డబ్బిచ్చే ఉద్దేశమే వున్నా ప్రస్తుతం ఎక్కడనుంచీ తెచ్చియివ్వగలడు? ఓబయ్యమామ పేచీ తేవటంలో ఉద్దేశం: అన్నదమ్ములు ఆస్తి పంచుకోవాలనే తప్ప, డబ్బు నిజంగా తనకు అవసరంవుండి కాదని స్పష్టంగానే చెబుతున్నాడు. అలాంటప్పుడు తను అన్న దగ్గరకువెళ్లి 'మనం ఆస్తి పంపకాలు పెట్టుకుందాం' అని చెప్పాలా? ఏం చెప్పాలి?

వారం రోజులు గడిచాక ఒకనాడు ఓబయ్య బజార్లో కనిపించి "ఏమయ్యా నరసింహులితో మాట్లాడావా? ఏమన్నాడు?" అని అడిగాడు.

"ఇప్పుడు డబ్బు పుట్టటం కష్టం మామా! నువ్వు కోరుతున్నట్లు పంపకాల మాట నేనై తీసుకురాలేను" అన్నాడు శ్రీధర్.

"డబ్బు పుట్టటం కష్టమని మీ అన్న చెప్పాడా? అసలు ఏం జరిగిందో సరిగా చెప్పు"

"కొత్తగా పొలం కొనటంవల్ల, డబ్బుకు యిబ్బంది గానే ఉంది మరి."

"అసలు నువ్వు మీ అన్నతో మాట్లాడావా? లేక యివి మీ వదినె నేర్పిన చిలక పలుకులా?"

శ్రీధర్‌కు కోపం వచ్చింది. నిగ్రహించుకుని నవ్వుతూనే అన్నాడు: "ఎందుకు మామా, ఈ గొడవంతా నా వాటా నా కెలాగూ వస్తుంది. నువ్వూ అత్తా పూరికే అపోహ పడుతున్నారుగాని! మా కుటుంబం నీ ఋణం తీర్చకపోదు లే"

ఓబయ్య చూపులో మార్పు వచ్చింది. "ఇదా నాకు నువ్వు చెప్పవలసిన సమాధానం! ఇక నీతో లాభంలేదు. సరే, మీ కుటుంబమే తీరుస్తుందిలే ఋణం. వస్తా" అని గబగబా వెళ్లిపోయాడు......

తర్వాత లాయరు నోటీసులు అందాయి రామలింగయ్యకూ, నరసింహులికీ, శ్రీధర్‌కూ.

"ఓబయ్యకు నువ్వు నోటు వ్రాసియిచ్చిన సంగతి నాతో చెప్పలేదేం?" అని అడిగారు రామలింగయ్యగారు శ్రీధర్‌ను.

"అది వట్టి నామకార్థమే అన్నారు అప్పుడు."

"అయినా నువ్వు నాతోనూ, మీ అన్నతోనూ చెప్పి ఉండవలసిన విషయం కాదా?"

శ్రీధర్ బదులు చెప్పలేకపోయాడు.

"సరే, నువ్వెళ్లు. ఆలోచిద్దాం."

రామలింగయ్యగారు ఆరోజు రాత్రి చాలసేపు నరసింహులితోనూ, రుక్మిణమ్మతోనూ సంప్రదిస్తూనే ఉన్నారు. శ్రీధర్‌ను ఎవ్వరూ పిలవలేదు. తన్ను మినహాయించి వాళ్లు ముగ్గురూ సమాలోచన జరుపుతూ ఉండటం అతనికి కష్టమనిపించింది. కానీ ప్రస్తుతం ఈ సమస్య బాధ్యత తన భుజాల మీది నుంచీ వాళ్లమీదికి మారిందనీ, ఈ పరిస్థితిలో వాళ్లేం చేస్తారో చూస్తే ఓబయ్యమామావాళ్ల ఆరోపణల్లో ఎంత సత్యం ఉండేదీ తేలిపోతుందనీ సమాధానపరచుకున్నాడు.

ప్రొద్దున్నే అన్నయ్య పొలం వెళ్లేదాకా ఆగి వంటింట్లోకి వెళ్లి రుక్మిణమ్మ ఎదురుగా కూర్చున్నాడు శ్రీధర్, రాత్రి జరిగిన విశేషాలు వినటానికి......రుక్మిణమ్మ ముఖం గంభీరంగా వుంది. ఆమె ఎంతసేపటికీ మాట్లాడలేదు. పలుకరించనూ లేదు. పిల్లవాడికి పాలు పట్టుతూ వుండి, ఆపని పూర్తయాక పిల్లవాడిని అలవాటు ప్రకారం శ్రీధర్‌కు అందివ్వలేదు. వెళ్లి స్వయంగా తొట్టెలో పడుకోబెట్టివచ్చింది. చివరకు శ్రీధర్, "ఏం వదినా, రాత్రి ఏమాలోచించారు నోటీసుల విషయం?" అన్నాడు.

రుక్మిణమ్మ తోకత్రొక్కిన త్రాచులా లేచింది. "నువ్వు తెలిసే చేస్తున్నావా, లేక తెలీక చేస్తున్నావా? ఈ చిత్రవధ కంటె ఒక్కసారిగా చంపెయ్యకపోయావా మమ్మల్ని? నీకు వేరువడాలని వుంటే ఆమాటే మొహంమీద చెప్పేస్తే శుభ్రంగా ఉంటుంది!......అయినా నువ్వు వచ్చి వచ్చి నన్ను వేధించటం దేనికి? వెళ్లి మీ అన్నయ్యనే అడుగు!"

శ్రీధర్ నోట మాట రాలేదు. వదినె తన్ను యిలా అంటుందని అతడు కలలో కూడా వూహించలేదు. ఆమెకే తనమీద అవిశ్వాసమా! అతని ధైర్యం జారిపోయింది.

"నే నేం చేశానమ్మా? ని న్నడక్కపోతే ఎవరి నడగను?" అన్నాడు, కంఠంలో గద్గదిక తోచింది.

"మీ ఓబయ్య మామ నీకు తెలీకుండానే ఈ నోటీసులు పంపేడా, శ్రీధర్! నెలరోజులప్పుడు నన్ను నువ్వడిగితే మన సంసారం పరిస్థితి ఎట్లా ఉందో అంతా వివరంగా నేను చెప్పలేదూ? నువ్వు తలుచుకుంటే వాళ్లకు నచ్చజెప్పలేవా? నీమీద అంత ప్రేమ ఒలకబోసేవాళ్లు నీ మాట వినటం లేదంటే ఎవరు నమ్ముతారు? నువ్వు వాళ్ల మాటలు వింటున్నావో, వాళ్లు నీ మాటలు వింటున్నారో తెలీటంలేదు గాని, మొత్తానికీ వాళ్లూ నువ్వూ, అందరూ కలిసి ముసలాయన్ని రొష్టు పెడుతున్నారు. ఇంతకంటె ఏంచెయ్యాలి? ఏం చేశానూ అని అడగటానికి, నువ్వేం చిన్న పిల్లాడివా? ఏమీ తెలీదు పాపం! తెలియజెప్పాలి! అనుకోటానికీ!......అక్కడో కాలూ, ఇక్కడో కాలూ ఎలాగూ కుదరదుగాని అటో ఇటో నువ్వు తేల్చుకోవటమే మంచిది!......"

"ఆ సంగతే మీ రందరూ కూర్చుని ఏం తేల్చారు రాత్రి అని అడుగుతున్నాను."

రుక్మిణమ్మ అతని కెదురుగా వచ్చి నిల్చుని ముఖంలోకి తేరపార జూచి "అయితే వేరుపడటమే నీ అభిప్రాయమా?" అన్నది ఆశ్చర్యంగా సమాధానంకోసం ఎదురుచూస్తూ.

"వదినా, ఇందులో నా అభిప్రాయ మేముందీ? ఎవరిక్కావాలీ? ఇదంతా నా ఖర్మ! నా అభిప్రాయం కనుక్కోవాలని వుంటే నువ్విలా మాట్లాడవు. నాన్నా, అన్నయ్యా రాత్రే నన్ను పిలిచి అడిగివుందురు. అక్కడ వాళ్లూ డబ్బుకోసం గొంతుమీద కూచోకుండా నేను నెలనెలా జీతంలో తీరుస్తా నన్న నా మాట ఖాతరుచేసివుందురు......ఎవరూ నన్ను లెక్ఖ చెయ్యరు, ఎవరికీ నే నక్కరలేదు. ఎవళ్ల పంతాలూ, కావేషాలూ వాళ్లవి......నీకూ నేనంటే నమ్మకం లేదు......సరే ఏం చెయ్యదలుచుకున్నారో చెయ్యండి....."

రుక్మిణమ్మ అంతా విని మౌనంగా తనపని చూసుకోవటం మొదలుపెట్టింది. ఆమె ఏమైనా చెబుతుందని శ్రీధర్ ఎదురుచూస్తూ కూర్చున్నాడు. ఆమె మాట్లాడకపోయేప్పటికి—"నేను వెళ్లి నాన్నగారినే అడుగుతాను" అంటూ లేచి నిల్చున్నాడు.

"ఆయన్నూ నన్నూ అడిగి లాభ మేమిటి? అసలే జబ్బు మనిషి. రాత్రంతా కన్నుమూసి ఉండరు. అడగదలచుకుంటే మీ అన్ననే అడగరాదూ?"

"సరే, అయితే అన్నయ్య దగ్గరకే వెళ్తాను. ఇవ్వాళ బడికి సెలవు పెడతాను."

వెళ్లబోతున్న శ్రీధర్‌ను ఆపి రుక్మిణమ్మ అన్నది: "ఇదుగో మీ అన్నయ్య అంతా నువ్వే చేస్తున్నావని అనుమాన పడుతున్నాడు. కాదని నచ్చజెప్పటానికే రాత్రి మేం తెల్లవార్లూ కూచుంది. అందుకే నిన్ను పిలవంది కూడా......పొలం దగ్గరుంటారు. నేను పంపినట్లు కాకుండా నీవై వెళ్లినట్లు వెళ్లి వున్న సంగతి దాపరికం లేకుండా చెప్పి అన్నదమ్ము లిద్దరూ ఏదో ఒప్పందానికి రండి......కాఫీ పెట్టివ్వనా?"

"పెట్టు.....నేను సెలవుచీటీ వ్రాసి పంపించి వస్తాను."

శ్రీధర్‌కు ఆరోజు ఎంత వెతికినా నరసింహులు కన్పించలేదు. ఇంటికి భోజనానికీ రాలేదు. గ్రామాంతరంవెళ్లి మరునటి రోజు ప్రొద్దున తిరిగి వచ్చాడు. అదృష్టవశాత్తు ఆరోజు ఆదివారం కావటంతో మళ్లీ సెలవుపెట్టే అవసరం లేకుండా పోయింది. మధ్యాహ్నం పొలంవెళ్లి అక్కడ కలుసుకున్నాడు......

"అన్నయ్యా, కోర్టు నోటీసు విషయం ఏంజేద్దాం?"

"ఏం చేద్దామో, నువ్వే చెప్పు" అన్నాడు నరసింహులు పరమ శాంతమూర్తిగా.

"అసలు ఇలా వస్తుందని నే ననుకోలే దన్నయ్యా....." అంటూ ప్రారంభించి ఉన్న సంగతి పూర్తిగా—అంటే అన్నదమ్ములు వేరుపడాలనే ఉద్దేశంతో ఓబయ్య పెట్టుకున్న నిర్బంధమే ఇందులోని అంతరార్థ మనేదాకా, వాళ్ల మాటలతో సహా విశదీకరించాడు శ్రీధర్.

"నిజమే. వాళ్లకు అట్లా నీమీద అభిమానం ఉండటం నీ మంచికోరి ఈ ప్రయత్నం చేస్తూ ఉండటం బాగానే ఉంది. ఎవరు కాదంటారు? దాన్ని గూర్చి వాళ్లని తప్పుపట్టుకోవడమూ అనవసరమే! వేరుపడటం అనేది లోకంలో ఎక్కడా జరుగుతున్న విషయమే! అయినప్పుడు బాధపడటం దేనికి?" అన్నాడు నరసింహులు.

"అన్నయ్యా! అదికాదు, వాళ్లెవరు మన కుటుంబం విషయంలో జోక్యం కలుగజేసుకోవటానికి? ఏం జరిగినా మనం ఒకటిగానే ఉండటం ముఖ్యం."

"వాళ్లు జోక్యం చేసుకుంటున్నారంటే, చేసుకోవటానికి అలుసిచ్చిం దెవరో నీకే తెలుసు! ఇప్పుడు వాళ్లెవరూ అంటే మాత్రం కుదురుతుందా? వ్యవహారం మన చెయ్యిదాటిపోయింది.......ఇప్పుడు చెయ్యాల్సిందే ఆలోచించాలి. ఇంతకూ నీ భాగం నీకు పంచియిస్తే వాళ్లు రుణం సంగతి ఎత్తరని నువ్వే అంటున్నావు. అందులో మనకు కలిగే నష్టమూ ఉండదు. అలాంటప్పుడు నువ్వైనా, నేనైనా వేరుపడ్డా, కలిసివున్నా ఇద్దరూ బాగుండటమే మన క్కావల్సింది. ఇప్పుడు భూమి మీద వున్న రుణమే మనకు తల బరువుగా ఉంది. మళ్లీ కలిసి పొలం తాకట్టు పెట్టే ప్రయత్నం చేస్తే ఇద్దరమూ నష్టపోతాము. ఎవరు తిన్నట్లు? కలిసివుండి నష్టపొయ్యేదానికన్నా, వేరై ఇద్దరూ బాగుపడటం మంచిదని నా అభిప్రాయం. కాదా? నువ్వే బాగా ఆలోచించు."

"అన్నయ్యా నీకు నామీద విశ్వాసం లేదా? నేను వేరైపోయి బాగుపడాలనే ఉద్దేశంతో ఇదంతా చేస్తున్నానని నువ్వు అనుకుంటున్నావా? ఎందు కిలా వేరుచేసి మాట్లాడతావు? నాకు భాగం ఏమీ అక్కరలేదు. నీ ఇంట్లో ఉండనియ్యి చాలు!" శ్రీధర్ కళ్లనీళ్ల పర్యంతం అయ్యాడు.

నరసింహులు అతని భుజంమీద చెయ్యి వేశాడు. "అరె, ఏమిట్రా నీ పిచ్చి! నువ్వింట్లో ఉంటానంటే ఎవరు కాదన్నారు? అదివేరు, వ్యవహారం వేరు! నువ్వు చదువుకున్నావు గాని లోకం తెలుసుకోలేదు! వెళ్లి వాళ్ల చేతుల్లో ఇరుక్కున్నావు, మమ్మల్నీ యిరికించావు. ఇప్పుడు మార్గం ఒక్కటే—భాగాలు పంచుకోవటం. అదే మన కుటుంబానికి లాభం; లేకపోతే అలవిగాని అప్పుల్లో మునిగిపోతాం మనం ఇంకెప్పటికీ తలెత్తుకోలేం—వుండే సంగతి అదీ! అభిమానాలూ, అపేక్షలూ ఎక్కడికి పోతాయి, ఎక్కడికీ పోవు!" అన్నాడు అనునయంగా.

అతని మాటలు సహేతుకంగా ఉన్నాయి, తిరుగులేకుండా. ఇద్దరూ యింటికి తిరిగొచ్చారు.

శ్రీధర్ ఎంత ప్రయత్నించినా తనలో సమాధానపడలేకపోయాడు. ఈ పరిష్కారం అన్నయ్య సహేతుకంగా వ్యవహారజ్ఞానంతో సూచిస్తున్నాడని ఎంతగా సరిపెట్టుకోబోయినా శ్రీధర్‌కు ఆ హృదయంలో వజ్రకాఠిన్యమే గోచరిస్తోంది.

ఓబయ్యమామకూ, అన్న నరసింహులికీ మనస్తత్వంలో ఏమీ భేదంలేదు. ఇద్దరి దృష్టి లోక వ్యవహార దృష్టిమాత్రమే; వాళ్లకు అభిమానాలూ, ఆప్యాయతలూ వూతపదాలు; వ్యవహార చదరంగంలో ఎత్తుకు పైఎత్తు వేయటానికి అనుకూలంగా మార్చుకునే గళ్లు తప్ప జీవితానికి స్థిరమైన ఆవాసాలు కావు!

పరిస్థితులు ఎలా ముంచుకువచ్చినా తన యింటికీ తన వాళ్లకూ, తన విశ్వాసాలకూ, అభిమానాలకూ దూరం కాగూడదనీ, తండ్రితో, వదినెతో, అన్నయ్యతో తనకుగల ప్రాథమిక అనుబంధాలను త్రెంచుకోగూడదని చేసుకున్న దృఢ నిశ్చయం ఏమైపోయింది? ఎలా పోయింది? ఇక్కడ తన ప్రయత్నానికి విలువ, ప్రాధాన్యం లేనే లేదు! తుపానులా, ఉప్పెనలా వస్తున్న ఈ మార్పు తనని అడిగీ, అనుమతి తీసుకునీ రావటం లేదు. ఈ మార్పు ముందు తను కేవలం ఇసుక రేణువు, పూచికపుల్ల!!

## 15

ఆస్తి పంపకం జరుగుతుందని తెలీగానే ఓబయ్య శ్రీధర్ మామగారైన వెంకయ్యగారికి రమ్మని ఉత్తరం వ్రాశాడు. పంపకం తాలూకు వివరాలు శ్రీధర్ పూర్తిగా అన్నకే వదిలిపెట్టాడు. ఓబయ్య ఆ విషయమై ప్రశ్నించబోతే కటువుగా సమాధానమిచ్చాడు—అందులో జోక్యమూ, తగువులూ అనవసరమని. అందుకే ఓబయ్య వెంకయ్యగారికి కబురుపెట్టడం జరిగింది. వెంకయ్య తారను తీసుకుని వస్తున్నట్లుగా రామలింగయ్యకు ఉత్తరం వ్రాసి పంపకం విషయం తనకేమీ తెలీనట్లే మదనపల్లిలో దిగాడు.

ఓబయ్య ఎన్ని ప్రయత్నాలు చేసినా, వెంకయ్యచేత అడ్డదిడ్డంగా ఎన్ని ప్రశ్నలు వేయించినా, శ్రీధర్ అన్ని విషయాల్లోనూ అన్న సూచించిన ఏర్పాట్లు ఏకంగా అంగీకరిస్తూ పోవటంచేత, ఆస్తిపంపకం గొడవేమీ లేకుండా పూర్తయింది. కాని ఆ రోజుల్లో తార శ్రీధర్‌ని ఒత్తిడి పెట్టడం మాత్రం మానలేదు. ఓబయ్య సూచనలు వెంకయ్యద్వారా తారకు అందీ, తారనుంచీ శ్రీధర్ మస్తిష్కంలోకి ప్రవేశించటానికి ప్రయత్నించి, ఇనుప కవచానికి తగిలి విఫలమయ్యే బాణాల్లాగా, అతని విశ్వాసాల్ని ఛేదించలేక పూర్తిగా విఫలం అయ్యాయి. ఆ వైఫల్యం తాలూకు ఉక్రోషాన్ని తార, రుక్మిణమ్మమీద పరిపరి విధాల చూపిస్తూ వచ్చింది.

పంపకం పూర్తయి కాగితాలు రిజిష్టరు అవగానే, తండ్రితోపాటు తనూ బందరు వెళ్లిపోతానన్నది తార. వెంకయ్యగారి ప్రయాణానికి ముందురోజు ఓబయ్య ఇంట్లో విందు ఏర్పాటైంది. అక్కడ శ్రీధర్‌ని దొరకపుచ్చుకొని మంగమ్మా, తారా ఈ అభిప్రాయాన్ని సహేతుకంగా వివరించారు......తార అయిదు నెలల గర్భవతి. పుట్టింటికి వెళ్తాననటం సహేతుకమే కదా!

"ఇంతలో ఏం ముంచుకు వచ్చిందని వచ్చినట్లు? ఎవరు రమ్మన్నారనీ? ఎవరు ఉండమన్నారనీ?" అన్నాడు శ్రీధర్.

"ఎంతమాట!! అయితే నీకు పెళ్లాం, పిల్లలూ అక్కరలేదుటయ్యా?" అన్నది మంగమ్మ. తార "చూడు పిన్నీ!" అంటూ కళ్లనీళ్ల పర్యంతం అయింది. శ్రీధర్‌కు చిరాకు వేసింది. "ఎందుకీ ఏడుపులు? ఒకవైపు నువ్వే వెళ్తానంటుంటే నేను వెళ్లొద్దని కదా ఏడుస్తున్నాను? నాకు పెళ్లాం వద్దంటున్నానా?" అన్నాడు......"ఎందుకీ నిష్ఠూరాలూ? అదికాదు, నేను చెబుతా నుండమ్మాయ్" అంటూ ప్రారంభించింది మంగమ్మ: "మీ ఇద్దరిమధ్య ఎందుకు వస్తున్నాయి ఈ పోట్లాటలూ, పొరపొచ్చాలూ? చూడు సిరీ, అమ్మాయి ఎక్కడికీ వెళ్లదు. ఇక్కడే వుండి పురుడు పోసుకుంటుంది. బందరునుంచీ ఎవరో వచ్చినా రాకపోయినా వాళ్లకు వీలున్నా, లేకపోయినా, నేను దగ్గరుండి చూసుకుంటాను. అయితే నువ్వు తెలుసుకోవాల్సిందీ ఒకటుంది. ఆ ఇంట్లో తార ఉండటానికి వసతి లేదు. ఆడవాళ్లకు తెలుస్తాయి వాళ్లకుండే ఇబ్బందులు, మగాడివి నీకేం తెలుస్తాయి? రుక్కుతల్లిని నెత్తిమీద పెట్టుకోవటం ఒకటే తెలుసు నీకు!......తార అక్కడుంటే నేను సాయం చెయ్యటానికి వీలుండదు—నేనా గడప దొక్కనని నీకూ తెలుసు......అందువల్ల మీరిద్దరూ ఇక్కడే వచ్చి ఉండినా సరే, పోనీ, మా ఇల్లు నీ హోదాకు తక్కువ అనుకుంటే వేరేయిల్లు కుదుర్చుకున్నా సరే! ఏం అమ్మాయ్, నీ కిష్టమే కదూ!" తార అంగీకారమేనని తల వూపింది.

"నేనా యిల్లు వదిలిరాను!" శ్రీధర్ అన్నాడు.

"అయితే అమ్మాయి బందరు వెళ్తాననటం న్యాయమే! నీ మొండితనం నీది! నీకు నీ వదినా, అన్నా తప్ప యింకెవ్వరూ కాబట్టినట్లు లేదు!.....ఇదేం మాయ! ఇదేం మత్తు! ఆ ఏడుకొండలవానికే ఎరుక!" అన్నది మంగమ్మత్త చేతులెత్తి విడ్డూరంగా.

తార కోపంగా ముఖం పక్కకు తిప్పుకుంది.

శ్రీధర్ చలించలేదు.

"అయితే నువ్వు బందరువెళ్లి పురుడు పోసుకుని తిరిగొస్తావా, నేను ఎదురు చూస్తుంటాను! ఆస్తి పంపకం

అయితే కావచ్చుగాని ఆత్మని కూడా ముక్కలు చేసుకోవటం నాచేత కాదు'' అన్నాడు.

తార వెంకయ్యతో బందరు వెళ్ళిపోయింది

తర్వాత నెల తిరక్కుండానే రామలింగయ్యగారు మరణించారు. పెద్ద దినానికి వెంకయ్యమాత్రం వచ్చాడు. తార రాలేదు అస్వస్థత కారణమట.

తండ్రి మరణం శ్రీధర్‌ను కలవర పరచింది. హృద్రోగంతో కొన్ని సంవత్సరాలు అస్వస్థత ఆయన మరణానికి సహజ కారణంగా కనిపిస్తూనే వున్నా శ్రీధర్ మనస్సులో ఆస్తి పంపకానికీ, ఆయన మరణానికీ సంబంధం ఉన్నదనే భావమే స్థిరపడి పోయింది. అంతేకాదు. ఆ రెండింటికీ బాధ్యత తన మీదే ఉందని కూడా తోచింది. ఎంతవరకు ఆ బాధ్యత?—అన్న ప్రశ్నకు అతనికి సమాధానం యిదమిత్థమని తేలలేదు! భారత దేశ విభజనకూ, గాంధి గారి మరణానికీ కాంగ్రెసుపార్టీ బాధ్యత ఎంతవరకు?—అనే ప్రశ్నలోవుండే క్లిష్టతే ఇందులోనూ కనిపించింది శ్రీధర్‌కు.

తార ఉత్తరాలు వ్రాయటంలేదు. మురళీ అక్కడి వార్తలూ తన మెడికల్ కాలేజి కబుర్లూ తరుచు సరదాగా వ్రాస్తున్నాడు. తన మామగారి కుటుంబంలో తనకు కొంతవరకు సన్నిహితుడైన వ్యక్తి మురళీ—కాని, ఎందుకో, ఆ మురళీకి తన ఆంతరంగిక జీవితాన్నిగూర్చి చెప్పుకోవాలనిపించలేదు శ్రీధర్‌కు. ఉత్తరాల్లో పై కబుర్లూ విశేషాలూ తప్ప, తన హృదయగత భావాల్ని గూర్చీ, జీవితంలో తను ఎదుర్కొంటున్న పరీక్షను గూర్చీ శ్రీధర్ మురళీకి వ్రాయలేదు.

హృదయంలో ఎంతగా శూన్యాన్ని అనుభవిస్తున్నా శ్రీధర్ నిత్య జీవితంలో కర్తవ్యోన్ముఖత్వం సాధించాలని పట్టుదలతో తన శక్తుల్ని కేంద్రీకరించాడు.

జనవరి (1950) వచ్చింది. మురళీ దగ్గర్నుంచీ తంతి వార్త: తార ప్రసవించింది, మళ్ళీ ఆడపిల్ల అని.

విధి తన మీద కత్తి గట్టి నట్లు తోచింది శ్రీధర్‌కు. మగపిల్లవాడు కలగక పోవటం తనకేమీ పెద్దలోటుగా లేకపోయినా, అత్తవారిలోను తార మనసులోనూ తనమీద చెలరేగుతున్న కోపాగ్ని ప్రజ్వరిల్లటానికి ఈ విషయమూ దోహదం చేస్తుందని అతనికి తెలుసు! సరిగ్గా రెండేళ్ల పూర్వం స్వరాజ్యం పుట్టినప్పటి పరిస్థితే యిప్పుడు మళ్ళీ— అప్పటి కంటే తను యిప్పుడు మరీ దిగ జారి పోయాడు కూడా!

రుక్మిణమ్మ బందరు వెళ్ళి రమ్మన్నది. ఇన్నాళ్ళూ ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపేందుకు పెద్ద దిక్కు తండ్రిగారు వుండేవారు; ఇప్పుడు శ్రీధర్ తన భార్య సంగతీ, ఆమె తాలూకు బంధువుల సంగతీ స్వయంగా చూచుకోవాలి అన్నదామె. శ్రీధర్‌ను తప్పకుండా వెళ్ళమన్నది.

కాని శ్రీధర్‌కు మనస్కరించ లేదు. రెండేళ్ళనుంచీ జీవితంలో విధితో లేక పరిస్థితులతో తనకు జరుగు తున్న పోరాటంలో అడుగడుగునా తను లొంగి పోవటం, ఓడిపోవటమే అతనికి కనిపిస్తోంది.! ఈ సారి తను లొంగ కూడదు.! ఏమైనా సరే, ముఖ్యంగా తార విషయంలో లొంగ కూడదు! తారకు గుణపాఠం నేర్పాలి అనిపించింది.

ఒక సంత రోజు స్కూల్లో టీచర్స్ రూములో కూర్చుని వుండగా మంగమ్మత్త పాలేరు వచ్చి పిలిచాడు. ఆమె సంతలో ఏవో కొనటానికి వచ్చిందనీ, తనని ఉన్నపళంగా పిలుచుకొని రమ్మన్నదనీ కబురు తెచ్చాడు. శ్రీధర్ పంపకాల తర్వాత ఆమె యింటికి వెళ్ళడమే మానేశాడు. ఇప్పు డీ పిలుపు! శ్రీధర్‌కు వెళ్ళాలని లేదు. కాని అక్కడేవున్న చలమయ్య ''వెళ్ళిరావయ్యా ఏం అర్జంటు పనో! నేను హెడ్‌మాస్టరుతో చెప్పి క్లాసు తీసుకుంటానులే వెళ్ళు'' అన్నాడు. శ్రీధర్ వెళ్ళక తప్ప లేదు.

మంగమ్మ ఎండలో నిల్చుని కందులు బేరం చేస్తోంది. శ్రీధర్‌ని చూచి సంతోషంగా బేరం ఫైసలు చేసేసింది. ఎక్కువ రేటు యివ్వటానికి ఒప్పుకొని కందుల్ని కొలిపించుకొమ్మని పాలేరును పురమాయించి, చెట్టు నీడకు తీసుకు వెళ్ళింది శ్రీధర్‌ను... మొహం మీద జలపాతంలా జారుతున్న చెమటని పైట చెరుగుతో తుడుచు కుంటూ, నోటిలోని తమ్మ ఉమ్మివేసి, ఆకు వక్కా సున్నం తాలూకు సంచి విప్పి మళ్ళీ తాంబూలం వేసుకోటానికి సిద్ధ పడుతూ ''ఏమయ్యా, మళ్ళీ కూతురు పుట్టిందటగా! నాకు నిన్ననే తార ఉత్తరం వ్రాసింది. నువ్వింకా వెళ్ళకుండా యిక్కడే వున్నావా? నాతో వచ్చి, పోనీ, మాటైనా అందించావా? అప్పుడే వారం రోజులైందటనే అమ్మాయి పుట్టి!..'' అన్నది. శ్రీధర్ మాట్లాడ లేదు.

''ఏమిటి అట్లా వున్నావు? ఈ సారైనా కొడుకు పుట్ట లేదనా?... నామాట విన్నావా? నేనే నీపెళ్ళానికి పురుడు పోస్తే కొడుకు పుట్టక పోయేవాడా?.. పోన్లే, బందరు ప్రయాణ మెప్పుడు?... నన్ను రమ్మంటే నేనూ వస్తాను'' అన్నది మంగమ్మ.

''నేను వెళ్ళటం లేదు— లీవు లేదు''

''లీవు ఎందు కివ్వరూ? ఇట్లాంటి వాటికి యివ్వకుండా ఎట్లా పోతారు? ఇవ్వక పోతే రాజీనామా యిచ్చేయ్. ఏం బతకలేవూ?''

''ఇవ్వరు లే.. సరే నేను వెళ్తున్నా— నాకవతల చాల పనుంది స్కూల్లో.''

''అయితే యింటికెప్పుడు వస్తానంటావ్? ఆదివారం బడి వుండదు. భోజనానికి రా, ఏం?''

అప్పటికే శ్రీధర్ వెళ్ళిపోతున్నాడు. మంగమ్మ ''ఏం?'' అంటోంది గట్టిగా. ''సరేలే'' అన్నాడు గొణుక్కుంటున్నట్లుగా.

రుక్మిణమ్మ వదినె, మంగమ్మత్తా ఉత్తరధ్రువమూ దక్షిణధ్రువమూ అయినా తనకు కర్తవ్యాన్ని ఉపదేశించటంలో— బందరు వెళ్ళమని చెప్పటంలో— యిద్దరిదీ ఒక్కమాటే కావటం, ఇద్దరికీ తన వ్యక్తిత్వం మాట పట్టక పోవటం, ఎంత మంకుతనం చూపుతున్నా తారనే యిద్దరూ సమర్థిస్తూ తనకు హితవు బోధించటం, శ్రీధర్‌కు విరక్తి కలిగించింది. ఆడవాళ్ళింతే కాబోలు! అనిపించింది. అయినా తార విషయంలో

తను ఒకళ్ల ఆలోచనల మీదా సలహాల మీదా ఆధారపడి ప్రవర్తించటమేమిటి? అది తను వ్యక్తిగతంగా నిర్ణయించుకోవాల్సిన బాధ్యత. శ్రీధర్ యీ సారి తను తారకు లొంగిపోవటం జరగదనే నిశ్చయానికే వచ్చాడు.

ఆదివారం మంగమ్మత్త యింటికి వెళ్ల లేదు. ఏమీ తోచక చలమయ్య యింటికి వెళ్లాడు. చలమయ్య ఎక్కడికో ప్రయాణమౌతున్నాడు. ఆదివారం కావటం వల్ల ట్యూషన్ కుర్రవాళ్లకు సెలవు.

"ఏమిటి విశేషం?" అన్నాడు చలమయ్య.

"ఏం లేదు. ఏమీ తోచటం లేదు, సినిమాకైనా వెడదామా అని యిటు వచ్చాను."

"అంత కంటే సరదా అయిన చోటికే తీసుకెడుతాను వస్తావా?"

"ఏమిటీ? నాకు తెలియని ప్రోగ్రాం ఏమైనా వుందా?"

"కాదులే. నిన్నో వ్యక్తికి పరిచయం చేస్తాను."

"ఎవరా వ్యక్తి?"

"చెబుతాను రా."

ఇద్దరూ బయల్దేరారు.

"నిజానికి నిన్ను అవ్యక్తి యిది వరకే ఎరుగునట. నీ Old-Class mate...జ్ఞాపకం తెచ్చుకో చూద్దాం" అన్నాడు చలమయ్య.

"ఎంతమందో క్లాస్ మేట్స్. ఈవూళ్లోవుండే క్లాస్‌మేట్ అయితే నాకిది వరకే తెలిసి వుండాలే."

"నిజమే, తెలుసేమో! బహుశా ఆమెను గూర్చి వినే వుంటావు... రాఘవరావు ఎలిమెంటరీ స్కూల్లో పని చేస్తూ వుండేది.. ఇప్పుడు ట్రెయినింగ్ పరీక్షకు వెళ్లింది.. పేరు పద్మ."

పద్మ! పద్మమణి?

ఆమెను గూర్చి చలమయ్యే తనతో యిదివర కొకసారి చెప్పినట్లు గుర్తు వచ్చింది శ్రీధర్‌కు.

"ఆమె పూర్తి పేరు పద్మమణి కదూ?"

"ఏమో నే వడగలేదు...పద్మ అనే పిలవటం..ఆమె కొడుకే, సత్యం అని మన స్కూల్లో థర్డ్ ఫారమ్...నాదగ్గరే ట్యూషన్"

"అవును... ఆమె ఏదో కష్టంలో వున్నట్లు చెప్పావు."

"ఓ, అది రెండేళ్ల నాటి సంగతి.. అదృష్టం మారి పోయింది.."

"ఎట్లా మారింది?"

"తర్వాత చెబుతాను.. యిదే యిల్లు."

డాబా యిల్లు. మెట్లెక్కి మేడ మీదికి వెళ్లారు. క్రింద ఎవరో అద్దెకుంటున్నారట. ఇల్లు పద్మ సొంతమేనట!

ఆమెను చూడగానే శ్రీధర్ మంత్ర ముగ్ధుడిలా అయ్యాడు. ఆమె పద్మమణే; కాని యిన్నేళ్ల తర్వాత ఆనాటి పద్మమణి యిలా వుంటుందని అతడు వూహించుకో లేదు! అప్పుడులేని పిండుదనం పరిణతి, ఎన్నోరెట్లు అధికమైన ఆకర్షణ.. యౌవనవతి అయిన పద్మమణిలో భాసించాయి. ఆమె కుర్చీ చూపిస్తే శ్రీధర్ కళ్లప్పగించి ఆమె వైపు చూస్తూ కూర్చుండి పోయాడు పలకరించకుండా.

"ఏమండీ! మీరు గుర్తు పట్టినట్లు లేదు. మనం యస్సెస్సెల్సీదాకా క్లాస్ మేట్స్‌ం జ్ఞాపకం లేదా? చాల సందేహంగా చూస్తున్నారు!' అన్నది నవ్వుతూ పద్మమణి.

"అవును గుర్తు లేక కాదు, మీరు చాల మారారు... కాదు ఏమీ మారలేదు... ఇందులో ఏది నిజమో తెలుసుకో లేక ఆలోచిస్తున్నాను. 'అన్నాడు శ్రీధర్. అతనికి ఏదో స్వప్న లోకంలో ప్రవేశించి నట్లుంది. పద్మమణి కిలకిలా నవ్వింది. ఆమె నవ్వుతో అతని హృదయం కంపించింది. సర్వేంద్రియాల కవాటాలు తెరుచు కున్నాయి...పక్షుల కిలకిలారావంతో ఉషస్సు వికసించినట్లు.. అతని భావన లోని ఒకానొక స్వేచ్ఛా మాధుర్యం పూవులా విచ్చుకున్నట్లూ... మనస్సు వింతగా ఆహ్లాదంతో నిండి పోయింది.

"శ్రీధర్‌కి క్లాస్‌మేట్‌ని చూడగానే చమత్కారం కూడా వచ్చేసిందే! అందరితో చాల ముభావంగా ముక్తసరిగా వుంటాడు పద్మా!" అంటున్నాడు చలమయ్య.

"స్కూల్లో చదివేటప్పుడూ అంతే, ఎవరితో మాట్లాడే వారు కాదు, ఆడ పిల్లలతో అసలు మాట్లాడేవారు కాదు... ఏమండీ, కాలేజికి వెళ్లాక మారిపోయారు కదూ!"

ఆమె అలా అతని కళ్లల్లోకి చూసి ప్రశ్నిస్తూ వుంటే శ్రీధర్‌ని అశక్తత ఆవహిస్తోంది. ఊగే పుష్పం మీద నిలిచి ఉత్సుకతతో తేనె గ్రోలే మధుపంలా గుచ్చిలాగుతోంది ఆమె చూపుల ప్రభావం అతని హృదయం మీద. ఆ బలత్కారంలో, ఆమె సాన్నిధ్యంలో అతనికి తన వ్యక్తిత్వం పట్టు చిక్కటంలేదు. వ్యక్తిత్వమే అయింది గాలి తెరగా అదృశ్యమై పోతున్నట్లుంది. మిగిలింది అస్తిత్వపు తాలూకు నగ్నత్వం— బాధాతీవ్రమైన ఆనందం.

"ఇప్పటికీ ఆడవాళ్లంటే భయమూ భక్తీ పోలేదు పద్మా. శ్రీధర్ సాధువుల్లో సాధువు... టీచింగ్ ప్రొఫెషన్‌లో చేరాక యిప్పుడిప్పుడే గట్టి పడుతున్నాడు..." అన్నాడు చలమయ్య.

అబ్బ! ఎవరూ మాట్లాడ కుంటే ఎంత బాగుండును!

"ఎంత గట్టి పడ్డా మీలాంటి దశసరి తనం రావటం కష్టమే లెండి' అన్నది పద్మమణి.. అది కాంప్లిమెంటో, ఇన్‌సల్టో తెలీదు కాబోలు చలమయ్యకి! చలమయ్య నవ్వి వూరుకున్నాడు... పద్మమణి మళ్లీ శ్రీధర్ కళ్లల్లోకి చూస్తూ "ఏమండీ! మీరెప్పుడూ క్లాసులో ఫస్టు వచ్చేవాళ్లు కదా, బడి పంతులు ఉద్యోగం కంటే మంచి ఉద్యోగం దొరక్క పోయిందా?" అన్నది.

ఆమాటల్లో ఏదో ఆర్ద్రతా, ఆప్యాయతా, ఆ ముఖ భంగిమతో అభిమానమూ, జాలీ స్పందిస్తున్నాయి. ఆశయాల శిథిలాలు, ప్రేమ అన్వేషించిన మృగ తృష్ణలు, మండు తున్న ఎడారిలో అడుగు జాడలు, ముందుకు సాగుతున్న విశ్వాసం— ఆమె ప్రశ్న అతని జీవితాన్నే పరామర్శించింది.

అతనిలో స్వాభిమానం రేకెత్తి "టీచింగ్ అంటే నాకు తక్కువ అభిప్రాయం ఎన్నడూ లేదు. ఇంటి దగ్గరే వుండి వ్యవసాయం చూచుకునే యీ అవకాశం గవర్నమెంటు ఉద్యోగాల్లో ఎందులోనూ లేదు" అన్నాడు.

"నేనే సలహా యిచ్చాను. బి.ఎస్.సి.తర్వాత బి.టి.కి.వెళ్లమని" అన్నాడు చలమయ్య. శ్రీధర్‌కి చలమయ్యని బయటికి గెంటెయ్యా లనిపించింది.

"ఉండండి. కాఫీ తీసుక వస్తాను" అంటూ పద్మమణి లోపలికి వెళ్లింది. శ్రీధర్‌కు వూపిరి పీల్చుకునే అవకాశం లభించినట్లయింది. గడచిన ఆకొన్ని నిముషాల్లో పద్మమణి సంగీతం, చలమయ్య అపస్వరాలు కలిసిన ఒక కొత్త లోకంతో హఠాత్తుగా ప్రవేశం..ఏదో మత్తూ బాధా కలిసిన అనుభూతి అతణ్ణి ముంచెత్తింది.

అతడికి తనలో ఏం జరిగిందో తెలీటం లేదు. అక్కడ వుండాలనీ లేదు, వెళ్లాలనీ లేదు. పద్మమణిని చూస్తూ మాటలు లేకుండా మౌనంగా తన్నుతాను ప్రశ్నించుకోవాలనీ అన్వేషించుకోవాలనీ వుంది— అప్పుడు కాని తనకేం ఒగుగుతూ వుందో తన కర్థం కాదు— ఈ అనుభవాన్ని ఎట్లా'ఏదుర్కోవాలో అప్పుడే నిర్ణయించుకో గలడు! కాని అది సాధ్యమా! పద్మమణి గూర్చి యింత కాంక్ష నిద్రాణంగా వుందని అతడు కలలో నైనా వూహించ లేదే!

పద్మమణి తిరిగి వచ్చి మాట్లాడుతూ వుంది. కొంత సేపటికి ఆమె కొడుకు సత్యమే కాఫీ పట్టు కొచ్చాడు.

శ్రీధర్ మౌనంగా ఆమె వైపు చూస్తున్నాడు.

పద్మమణి తన ట్రెయినింగ్ పరీక్ష సంగతీ, అంతకు ముందు రోజే తన సర్టిఫికేట్ వచ్చినట్లూ, మళ్లీ కమిటీవాళ్లను కలుసుకోవాల్సిన అవసరమూ, తనకు రాఘువరావు గారిచ్చిన పొలం అమ్మి వేయుటమూ... చెబుతోంది. మధ్య మధ్య శ్రీధర్ వైపు చూస్తోంది... శ్రీధర్ ఆమె మాటల్ని వింటున్నా విననట్లే ఏదో లోకంలో వున్నాడు. ఆమె చేతుల్నీ చేతి వేళ్లనీ కుచ్చెళ్లనీ పాదాల్నీ, ఆమె పలువరుసనీ, ముక్కు వంపునీ, కన్నుల చపలత్వాన్నీ వాటి అగాధమైన ఆకర్షణనీ, ఆమె తల కట్టునీ, పాపటినీ వరుసగా తదేకంగా ధ్యానిస్తూ పరిభ్రమిస్తున్న అతని మనస్సు అన్వేషిస్తోంది...

ఏడేళ్ల అమ్మాయి మెట్లెక్కి వచ్చి గది గుమ్మం దగ్గర నుంచీ పద్మమణిని ఉద్దేశించి "గుడికి వస్తారేమో అమ్మ అడగమంది" అన్నది.

"ఆ వస్తున్నానని చెప్పు."

"క్రింద అద్దెకున్న వాళ్ళు. ఆదివారాలు ఆంజనేయ స్వామి స్వామి గుడికి వెళ్తున్నాము..టైమెంతయిందండీ చలమయ్యా ?" అని వివరించి పద్మమణి లేచింది.

'టైము ఐదున్నర."

చలమయ్యా, శ్రీధర్ కూడా లేచారు.

ఊరి బయటికి షికారుగా నడుస్తూండగా చలమయ్య శ్రీధర్‌తో చెప్పాడు పద్మమణినిగూర్చి. భర్తృ విహీనగా అయిదేళ్ల క్రితం తిరిగి వచ్చింది పద్మమణి. ఇప్పుడు పద్మమణి వున్న యిల్లు రాఘువరావుది. పై భాగం అద్దెకు తీసుకుని అందులో ప్రవేశించింది తల్లితో. సంఘ సంస్కర్త, కాంగ్రెసు వాదీ అయిన నలభై అయిదేళ్ల రాఘువరావు ఆస్తిపరుడు. అతనికి అప్పటికే భార్య పోయి నాలుగేళ్లయింది. సంతానం యిరవై ఏళ్ల కొడుకు ఒక్కడే. అతనికి తర్వాత వివాహం చేశాడు. తన ఆధ్వర్యాన నడుస్తున్న స్కూల్లో ఉద్యోగానికి వచ్చిన పద్మమణి ఉద్యోగ మిచ్చి చేరదీశాడు. వివాహం చేసుకో లేదు. పద్మమణికి ఆడ పిల్ల కలిగింది. ఇప్పుడు మూడేళ్లు దానికి. రెండేళ్ల క్రితం రాఘువరావు పోయినప్పుడు పద్మమణికి ఉద్యోగం పోయింది. ఆరు నెలల దాకా రాఘువరావు వీలునామా వ్రాసి రిజిష్టరు చేసిన సంగతి బయటికి రాలేదు. చివరికి పద్మమణి వుంటున్న యిల్లూ, కొంత పొలమూ, బ్యాంకులో అయిదు వేల రొక్కమూ రాఘువరావు ఆమెపేర వ్రాసిపోయి నట్లు తెలిసింది. రాఘువరావు కొడుకు పేచీ పెట్ట లేదు పద్మమణి ట్రెయినింగ్ పూర్తి చేసుకొన్నది.

"వయస్సును బట్టి చూస్తే ఆ అబ్బాయి కొడుకు కాదను కుంటాను. పద్మకు ఎస్సెస్సెల్సీ తర్వాతే వివాహం అయింది. అంటే యిప్పటికి ఎనిమిదేళ్లు మాత్రమే. వాడికి కనీసం 11, 12 ఏళ్లుంటాయి" అన్నాడు శ్రీధర్.

"ఏమో బహుశా పెళ్లికి పూర్వం పుట్టాడో ఏమో! భర్త పోయిన తర్వాత కూతురు కలిగినట్లు!" అని నవ్వాడు చలమయ్య.

"ఆ విషయం ఆమెనే అడగరాదా? మనకు తెలిసిన వ్యక్తిని గురించి అలా హేళనగా మాట్లాడు కోవటం బాగుండదు" అన్నాడు శ్రీధర్.

"తెలిసిన వ్యక్తి విషయమైతే మాట్లాడ వచ్చునా?"

"అప్పుడూ మాట్లాడ కూడదు, పోనీ మాట్లాడినా అది అంత ఎబ్బెట్టుగా వుండదు. ఆమనిషి పట్ల మనకేమీ బాధ్యత లేదు కాబట్టి స్నేహాన్ని మలినపరచిన ట్లుండదు; లోకాభి రామాయణంగా వుంటుంది.

"ఇది క్రొత్త సిద్ధాంతమే! అసలు పవిత్రత వుంటే కదయ్యా మలిన పరచటం! పద్మమణి నీతిమంతురాలైతే నీ సిద్ధాంతం వర్తిస్తుంది. కథంతా విని కూడా యింకా అలానే అంటావా?

"స్నేహధర్మం వేరు, వివాహానికి సంబంధించిన నీతి వేరు. పోనీ అట్లా చూచినా రాఘువరావుతో ఆమె సంబంధం రెండో వివాహం అనుకో గూడదా?

"అనుకోవటమా?..ఓ..దానికేం? ఎన్నైనా అనుకోవచ్చు. ప్రతి రాత్రీ వేశ్యకు ఒక వివాహం జరుగుతోంది అనుకోగూడదూ? నిత్య కళ్యాణం, పచ్చతోరణం" వెటకారంగా నవ్వాడు చలమయ్య.

"ఛీ! ఎక్కడి పోలిక! నువ్వు మాట్లాడుతున్న దేమిటో నీకు తెలీటం లేదు."

"అసలు మతి పోయింది నీకు, నాక్కాదు శ్రీధర్! క్లాస్‌మేట్ అన్న విశ్వాసమా? దాని అందం చూచి గ్రేడ్ తిన్నావా? లేకపోతే అవిడ నీతిని గూర్చి నాదగ్గర సమర్థ నేమిటి?"

శ్రీధర్ మాట్లాడ లేదు. పద్మమణి యిలాంటి మనిషితో ఎట్లా స్నేహంగా వుంటోంది? బహుశా ఆమెకు తెలీదు! అనుకున్నాడు.

కాని అంతటితో ఆ విషయం శ్రీధర్ ఆలోచనల నుంచి నిష్క్రమించ లేదు! చలమయ్య యిచ్చిన తీర్పుకు అర్థం వుంది. ఎందుకు లేదు? స్త్రీకి రెండవ వివాహం యీ దేశం సంప్రదాయం దృష్ట్యా అంగీకార్యము కాదు. సంస్కరణ బాల వితంతువులకు వివాహం అనుమతించింది కాని కాపురం చేసి సంతాన వతులైన యువతులకు ఆపద్ధతి ఎక్కడ సూచించింది.? పోనీ పాశ్చాత్య సంప్రదాయం దృష్ట్యా స్త్రీకి రెండవ వివాహం అంగీకార్యం అనుకున్నా, అసలు వివాహం తంతు జరగక పోవట మనేది పాశ్చాత్య దేశాల్లోనైనా నింద్యమే! పద్మమణి చరిత్ర కళంకితం! ఇది సంఘం తీర్పు! కాని తన మనస్సు యీ తీర్పును అంగీకరించ లేక పోతున్నది. పద్మమణికి కళంకమా?

తనెవ్వరు? పద్మమణి ఎవ్వరు? ఆమె కళంకము మాట అటుంచి తన కర్తవ్యము ధర్మము మాటేమిటి? ఆమె ఆకర్షణలో పడి పోయి ఆమెను తనదానిగా వూహించుకోవటం ఏం గొప్ప నీతి?

శ్రీధర్ తన మనస్సుకి తనే పాఠం చెప్పుకున్నాడు. ఇక్కడేదో బలవత్తరమైన ఆకర్షణ, తన వ్యక్తిత్వ సర్వస్వాన్ని అపహరింప జూచే ఆకర్షణ తగులు తున్నది. దీనికి దూరంగా వుండటమే శ్రేయస్సు!

## 16

పద్మమణి కొడుకు సత్యం ఒక రోజు శ్రీధర్ యింటికి వచ్చాడు. క్రొత్తగా వచ్చిన పంట తాలూకు వడ్లు ఒక నాలుగో అయిదో బస్తాలు పద్మమణికి కావాలట. "మాఅన్నయ్యా నడిగి చెబుతాను. అలాగే వీలు చూచి పంపిస్తారని చెప్పు" అన్నాడు శ్రీధర్. "మీకు తీరికగా వుంటే మిమ్మల్ని దయచేసి మాయింటికి ఒక సారి రమ్మని చెప్పమంది మా అమ్మ... యీ సాయంత్రం" అని చెప్పాడు ఆ కుర్రవాడు.

చలమయ్యతో కలసి పద్మమణి యింటికి వెళ్ళి అప్పటికి పదిహేను రోజులవుతోంది. పద్మమణిని మళ్ళీ చూడాలనీ, ఆమె ఆకర్షణని మరో సారి అనుభవించి పరీక్షించు కోవాలనీ— మొదటి సారి కలిగిన అనుభూతి పూర్వ స్మృతుల వలన కలిగి వుంటుందనీ, అందులో విశేషమేమీ వుండదనీ అతని అభిప్రాయం. ఆమెతో పూర్వపు రోజుల్ని గూర్చి మాట్లాడాలనీ కుతూహలం వున్నా దాన్ని అణచి వేస్తూ వచ్చాడు. పద్మమణి సాన్నిధ్యంలో ఎంత ఆకర్షణా ఆహ్లాదం వుందో అంత అర్థం కాని ప్రమాదం— తన వ్యక్తిత్వాన్ని ఆహరించే ప్రమాదం ఏదో వుందని అతడు లీలగా భయపడుతూ వుండటమే అందుకు కారణం.

కాని పద్మమణి కబురు పెట్టిన తర్వాత వెళ్ళకుండా వుండలేక పోయాడు. వెళ్ళకుండా వుండటానికి తను పిరికివాడా? పద్మమణిలో ఏమిటా గొప్పదనం? తను భయపడ వలసిన గొప్పదనం?.. ఆమెకు కాదు బహుశా తను నీతికి భయపడు తున్నాడు!..పరీక్ష నెదుర్కోలేని తన 'నీతి'కి ఏమిటి విలువ?.. అది జీవితాన్ని గూర్చి భయపడటమే అవుతుంది!.. ఇంతకూ యిది మామూలు వ్యవహారమే, ఏవో నీడలు చూచి, జడుసు కుంటున్నాడు తప్ప! పద్మ మణికి తన పొలంలో పండిన వడ్లు కావాలి, ఆమె దాని ధర వగైరా వివరాలు అడగటానికే రమ్మని వుంటుంది. ఈ మాత్రం సాయం ఆమె అర్థించడం, ఏనాటిదో ఆపాత స్నేహ భావాన్నీ, కలసి చదువుకున్న జ్ఞాపకాన్నీ పురస్కరించుకునే కథ! ఆ భావాన్ని త్రుంచివేసే ముష్కర ప్రవృత్తి ఎందుకు తనకు? లేని పోని వూహాగానం ఎందుకూ?..

"మీరు మళ్ళీ ఎప్పుడైనా వస్తారను కున్నాను... తర్వాత దర్శనమే లేదే! అంత 'బిజీ' గా వున్నారేమిటి?" అన్నది పద్మమణి శ్రీధర్ వెళ్ళగానే. అందులో ధ్వనించిన చనువూ, ధీమా శ్రీధర్‌ని కలవర పెట్టాయి; రెచ్చ గొట్టాయి కూడా. చురుగ్గా అన్నాడు :

"ఏమిటి చలమయ్య అనుకున్నా రేమిటి?" అన్నాడు.

పద్మమణి కిలకిలా నవ్వింది.

"ఎందుకు నవ్వు?" అన్నాడు శ్రీధర్.

"మీరు చలమయ్యతో పోల్చుకుని బాధ పడుతున్నారని!"

"అది కాదు చలమయ్యకూ మీకూ బాగా తెలుసు... నాకు పరిచయం యిప్పుడే కదా ప్రారంభం అని అలా అన్నాను"

"ఓ! అయితే మీకు మీ స్కూలు రోజులు బొత్తిగా జ్ఞాపకం లేవన్న మాట!" ఆమె కళ్ళు అతని కళ్ళని నిల వేశాయి, చూపుల్ని బాణాల్లా హృదయంలో గ్రుచ్చుతున్నట్లు. తన రహస్యాల్ని భేదిస్తున్నట్లు తహ తహలాడి పోయాడు ఒక క్షణం...

మంత్ర ముగ్ధుడిలా "ఉన్నాయి" అన్నాడు.

"ఏ మండీ, నిజం చెప్పండి, మీరు నన్ను మరచి పోయారా. నేను మారా నన్నారు, ఎందులో మారాను? ఎట్లా మారాను? ఎట్లామారానంటారు?.. నాకు తెలుసు కోవాలని వుంది.. మళ్ళీ మార లేదన్నారు?"

ఆమె కంఠం లోని ఆ వణుకు, ఆ సాన్నిహిత్యం ఆశక్తి అతని వ్యక్తిత్వం వేసుకున్న పొరల్ని చీల్చి వేస్తున్నాయి.. "లేదు.. మార లేదు.. నువ్వు మార లేదు.. నేను మరచి పోనూ లేదు..." అన్నాడు ఆమె ముఖంలోకి తదేకంగా చూస్తూ దీక్షగా తనలో తనే ఏదో అన్వేషించి గుర్తిస్తున్న ధ్యాసతో, తన్మయత్వంతో...

"కాని నేను మారాను.. అని కూడా అన్నారు!" ఆమె అందించింది.

(సశేషం)

# కవిశిరోభూషణ సమీక్ష

శ్రీ పంతరాం రామకృష్ణరావు

అహోబల పండితీయమును నామాంతరముగల కవి శిరోభూషణమును ఆంధ్ర రచయితల సంఘమువారు ఆంధ్ర వివరణముతో ప్రకటించి ఆంధ్ర భాషాభిమానుల కృతజ్ఞతకు పాత్రు లయినారు. ఇంతకు పూర్వము శ్రీ శొంఠి భద్రాద్రి రామశాస్త్రిగారి ఆంధ్రానువాదముతో ఈ గ్రంథము ప్రకటింపబడెను. కాని చాలకాలమై ఆ ప్రతులు లభించుటలేదు. ఆంధ్ర రచయితల సంఘమువారు ఈ లోపమును తీర్చినారు. ప్రస్తుతానువాదమున సంజ్ఞాపరిచ్ఛేదమునకు ఆంధ్ర వివరణము వ్రాసినవారు శ్రీమాన్ చెలమచెర్ల రంగాచార్యులుగారు. తక్కిన పరిచ్ఛేదములకు ఆంధ్రానువాదమును రచించినవారు శ్రీ అమరేశం రాజేశ్వర శర్మగారు. ఈ గ్రంథమునకు శ్రీ వెంపరాలవారు వ్రాసిన పీఠిక యెంతో వన్నె పెట్టుచున్నది. పూర్వ ముద్రణమున సూత్రసూచిక లేదు. ఈ ముద్రణమున చేర్పబడుట ప్రశంసనీయము. అహోబలపతి చూపిన లక్ష్యములు ఏయే గ్రంథముల లోనివో గుర్తించు ప్రయత్నము పూర్వవివరణకర్తలు చేయలేదు. ఈ నూతన వివరణకర్తలు అట్టి ప్రయత్నమును చేసి కొంతవరకు కృతకృత్యు లయిరి. వీరి ప్రయత్నము సర్వథా శ్లాఘ్యము. అధోజ్ఞాపికలతో అచ్చటచ్చట చేయబడిన వివరణములు వీరి పరిశ్రమను వేనోళ్ల చాటుచున్నవి. మచ్చునకు కొలదిగా ఉదాహరింతును. 1. సుప్పుల ప్రత్యాహారము ప్రాకృతీయమని అహోబలపతి తెలుపగా అనువాదకులు వాల్మీకి ప్రాకృత సూత్రము నుదాహరించి బాగుగా వివరించినారు. (306 పు) 2. సహార్థ తృతీయకు కారకత్వ మెట్లు నిర్బాధమో చక్కగా వివరించినారు. (313 పు) 3. ఊర్ధ్వాన్ద్వేర:—అను సూత్రము వద్ద విపులమైన శాస్త్ర చర్చ చేయబడినది. (375—378 పు) మరి కొన్ని వివరములు కావలసినవారు వ్యా. సం. స. చూడ నగును. 4. ముత్తియము, గోణియ—అన్నవి ప్రాకృత భవములని అహోబలపతి తెలిపెను. వీరు ఆ రూప సాధన ప్రక్రియను ప్రదర్శించి యున్నారు. (408—410 పు) ఇట్లే మరికొన్ని వివరణములను జిజ్ఞాసువులకు ఉపకారకములై యున్నవి.

అనువాదకులు పాఠ పరిశీలన కొంత చేసిరి. వ్యాకరణ సంహితా సర్వస్వమును కొలదిచోట్ల సంప్రతించిరి. చింతామణి సూత్రములకు పూర్వానువాదకుల వలెనే వీరును ప్రతిపదార్థములు వ్రాసిరి. అథర్వణకారికలకు ప్రతి పదార్థములు వ్రాయబడలేదు. వాటిని కొంత పెద్ద టైపుతో నైనను ముద్రించి యుండవలసినది. ఈనాటి గ్రంథకర్తల ధోరణి "బహ్వారంభో లఘు క్రియా" అను వాక్యమును తలపించుచుండును. ఈ అనువాదకు లట్టి హడావడి చేయకపోవుట ప్రశంసనీయమే కాని వీరు సంప్రతింపవలసిన వాటిని ఆమూలాగ్రముగా సంప్రతించి తమ అనువాదమునకు సమీచీనతను సమగ్రతను సంపాదించుటకు పరిశ్రమింపలేదు. చింతామణి సూత్రముల టీకను గూర్చి కొలుత వ్రాయుదును. 1. సాధ్యోహి రసో యథా యథం కవిభి:—అను సూత్రమునకు టీక వ్రాయ మరచిరి. 2. స్వస్థానేత్యాది సూత్రమున సంత:= సహృదయులు—అని అర్థము వ్రాయబడెను. సంత:=సత్పురుషులు—పూ. టి. సంత:—పండిత కవయ: —అహోబలపతి. సంత:= పండితులు—వ్యా. సం. స. నన్నయ భారతాదిని—"సత్సభాంతర సరసీవనంబుల ముదం బొనరం గొనియాడి వేడుకన్" అని 'సత్' శబ్దముతో తననాటి పండిత సభలను ప్రశంసించెను. ప్రకృత సూత్రము నందలి 'సంత:' అను 'సత్' శబ్దము ఆ పండిత సభలనే సూచించును. (చిం. పరి. 12 పు) కావున సంత:=సహృదయులు—అను టీక సరికాదు. సంత:= పండితులు—అనవలెను. 3. ఇదే

సూత్రమున 'వైకృత కావ్యాని చ' అనుచోటి 'చ' శబ్దమును విడిచిపెట్టి అర్థము చెప్పిరి. వైకృత కావ్యానిచ=వైకృత కావ్యములను—అని పూ. టీ. అపహాయచ = విడిచియు—అని వ్యా. సం. స. లో 'చ' శబ్దము 'అపహాయ' అను దానితో చేర్పబడినది. అనువాదకులు 'చ' శబ్దమును జారవిడుచుటయే కాక 'అపహాయ' అను దానిని 'విహాయ' అని మార్చి అర్థము వ్రాయుట వింత. 4. అనన్యాదృశశ్చ—ఇతరము వంటిది కాదు—అని టీక. ఇట, ఏకరూప మైనదిగాను అని,పూ. టీ. "వేఱు విధము కాని దనగా నేకరూపమున నుండునదియు" వ్యా. సం. స. కాగా ఇతరము వంటిది కాదు—అనగా ఏకరూపమైనది—అని వ్రాసినచో బాగుండును. 5. శాస్త్ర మపౌరుష మాద్యం ప్రాయిక నిత్య ప్రయోగ లక్ష్మ్యతత్—అను సూత్రమునందలి ప్రాయిక శబ్దమునకు బహుళము లైనవియు—అని అర్థము వ్రాయబడెను. బహుళమను పారిభాషిక పద మొకటి యుండుటచే ప్రాయిక శబ్దమునకు బహుళమని అర్థము వ్రాయుట సమంజసము కాదు. (146 పు) 6. ద్వివిధా దిదు దేదోతః—అను దానికి రెండు విధములైన అ ఇ ఉ ఏ ఓ అనునవియు—అని అర్థము చెప్పబడెను. (174 పు) "రెండు విధములైన అ ఇ ఉ ఎ ఒ లును" అని పూ. టీ. నాగరలిపిలో హ్రస్వ వక్రములు లేకుండుటచే నన్నయ ఏత్—ఓత్—అన్నను అతని ఆశయము ఎ—ఒ—లు అనియే. రెండు విధములైన ఏ—ఓ లు అనుటలో హ్రస్వములు సిద్ధించుటకు వీలున్నమాట నిజమే కాని యిట్లు గ్రహింపరాని స్థలములు చింతామణిలోనే కలవు. కావున ఎ ఓ లు—అను పూ. టీ. లెస్స. ఏ ఓ లు అని చెప్పుట గ్రంథకృదభిప్రేతము కాకుండుటచే అగ్రాహ్యము. ఎ ఒ లు—అనియే వ్యా. సం. స. 7. అద్వంత్యేద్యాది సూత్రమున వక్రః= ఏ కారాంతమైనది— అని అర్థము వ్రాయబడెను. పూ. టీ. లోను ఇట్లే కలదు. పొరపాటు. ఎ కారాంతమైనది—అనియే వ్రాయవలెను. వక్రః—ఎకార విశిష్టమై యుండును—వ్యా. సం. స. 8. హల స్స్వ స్సమాసతః ప్రాణినః—అనుచో సమాసతః—సామాన్యముగా—అని వ్రాయబడెను. పూ. టీ. లోను ఇట్లే కలదు. సమాసతః—సంక్షేపముగ (వ్యా. సం. స) అనుట ఒప్పు. 9. తజ్జ్ఞా సమాచ దేశ్యా—అనుచో సమా = తత్సమము—అని వ్రాయబడెను. 'చ' శబ్దము విడువబడెను. 'సమా'చ అని పూ. టీ. లో సరిగానే యున్నది. (212 పు.)

ఆంధ్రలిపి— ఉదార్థము — అనుపేర అనువాదకులు అప్పకవీయము ననుసరించి వివరణము వ్రాసిరి. (219–222 పు) దీనివలన ప్రయోజనము శూన్యము. నన్నయాథర్వణులుపదేశించిన లిపి స్వరూపమును వై—పా; వ్యా. సం. స. గ్రంథముల నుండి సంగ్రహించి అదోజ్ఞాపికలలో చూపి యుండవలసినది. లేదా ఆ గ్రంథములను చూడుడని యైన సూచింపవలసినది. వై. పా 258–303 పు, వ్యా.సం. స. 54–61 పు. ఈ సంజ్ఞాపరిచ్ఛేద వివరణకర్తలు తాము చేయు సొంత వివరణమును గూడ అనువాద వాక్యములలో చేర్చివేసిరి. విడిగా చూపుట ధర్మము. సంస్కారార్థో నియమః—అను సూత్రమునకు అహోబలపతి చేసిన వ్యాఖ్యను అనువదించుటలో వీరు సొంత చర్చను చేర్చినారు. (128—130) పు. వీరి చర్చ యావత్తు అప్రామాణికము, అపరిజ్ఞాన మూలకమునై యున్నది. వ్యా. సం. స. 1182–1187 పు. చిం. పరి. 66—69 పు.

సంధి, అజంత, హలంత క్రియా పరిచ్ఛేదముల వివరణమునుగూర్చి కొంత వ్రాయుదును. (1) షష్ఠ్య ఉతోచి నుమ్సే ఆద్య స్యాద్రేమేడితే న్త్యలోపశ్చ— 242 పు. ఇచ్చటి 'చ' శబ్దమును ప్రతిపదార్థము వ్రాయుటలో వదలిరి. 'లోపశ్చ' అను చోటనే 'చ' శబ్దమును చేర్చి అర్థము చెప్పుట యుక్తము. ఈ చకారమునకు ప్రయోజనమును కలదు. వ్యా. సం. స. 250 పు. (2) పరుషా ద్రుత ప్రకృతికాత్ సరళాః స్యుః— 247పు. ఇచ్చటి 'స్యుః' అన్నది టీకలో విడిచిపెట్టబడెను. పూ. టీ. లో సరిగానే యున్నది. నలడాదే రంత రుతశ్చ—అను సూత్రమునకు చెప్పిన అర్థములో అంతః=ఏక పదస్థమైన—అని కలదు. అంతః—నడుమ నుండెడి—పూ. టీ. ఏక పదాంత స్థితః—అహోబలపతి. పదము నడిమి నున్నట్టి—వ్యా. సం. స. కావున ఏకపద మధ్యస్థమైన—అని వ్రాయుట లెస్స. (4) నిరమో మహతాం—301 పు. అనుచో మహద్వాచకముల కనుట సరియే కాని డుమంతముల కని వివరించుట యుక్తము. (5) ఇట్లే మహతోనితా 303 పు. అనుచోటనైతము డుమంతముల కనుట సమంజసము. వ్యా. సం. స. 488–499 పు. (6) అన్యతస్త్వత్ర ను ర్భవేత్—

అనుకారిక అనువదింపబడలేదు. మరచియుందురు. 301 పు. (7) అన్య ఏవ ఆరోపే—అనుదానిని అన్యారోపమందు మాత్రమే అని అనువదించిరి. 327 పు. మహద్వస్త్వారోపమునందు—అని తెలిపినచో బాగుండెడిది. వ్యా. సం. స. 471 పు. (8) సర్వత్రో దోతోః 327 పు—అనుచోటి సర్వత్ర శబ్దమునకు ప్రథమైక వచనమునను తదితర విభక్తి ప్రత్యయము పరమయినపుడును అని అర్థము వ్రాసిరి. సర్వత్ర= మూడు లింగములయందు—పూ. టీ. స్త్రీలింగమునందు సయితము— అని వ్యా. సం. స. లింగత్రయేపి—అహోబలపతి. కాన వీరు లింగ ప్రసక్తిని వదలుట సరికాదు. (9) ముశ్చ పుశ్చాత్ర కుత్రచిత్ 343 పు.—అనుచో అత్ర—అను దానికి ఈ ఆంధ్రభాషయందు అని అర్థము వ్రాయబడెను. మువర్ణక సందర్భమున అనుట లెస్స యని తోచుచున్నది. వ్యా. సం. స 596 పు. (10) ఊర్ధ్వస్త్వేరః—అనుదాని టీకలో రః=రేఫము అని చెప్పబడెను. పూ. టీ. లోను రేఫము—అనియే యున్నది. ఈ పక్షమున మాత్ర పితలు అను రూప మెట్లు సిద్ధించునో దురూహ్యము. రః=రవర్ణము—అనవలెను. 'రః స్యాత్' అనియే అహోబలపతి వ్రాసెను. రవర్ణ మనగా అదంతమగు రేఫమని అర్థము. (11) కలవరము కనికరము వేగిరము తేజరము—అను వానిలోనిది 'అము' ప్రత్యయము కావచ్చునన్నారు. 'అము' అను దానిలో తుదిది మువర్ణకము. కాన 'అ' అన్నదే తద్ధిత ప్రత్యయ మన్నమాట. ఈ అభిప్రాయము ప్రామాదికము. వీటిలోనివి అర—ఇర ప్రత్యయములు కావచ్చును. వేగ+ఇర+ము= వేగిరము. తేజ+అర+ము=తేజరము—ఇత్యాది వ్యా. సం. స. 1278 పు. కృత్తద్ధితములను వ్యాకరణములు సాకల్యముగా చెప్పలేదు. (12) కే చిత్తుణి చ మిచ్ఛన్తి 604 పు.—అనుకారికకు ఉదాహరణములు చూపబడలేదు. కురియు, మెఱయు, ఆఁగు—అన్న వాటిని చూపనగును. వ్యా. సం. స. 1546 పు.

అనువాదకులు, అధోజ్ఞాపికలలో వివరించిన కొన్ని విషయములు పునః పరిశీలనమును కోరుచున్నవి. (1) అహోబలాదులు సానునాసికోచ్చారణం జిత్—అను ప్రాకృత సూత్రమును తెచ్చి జిత్తు అర్ధబిందుపూర్వకమని వ్యాఖ్యానించిరి. ఇది సరికాదని వ్యా. సం. స. దీనిపై అనువాదకులు, ప్రాకృతోచ్చారణము వంటిది తెలుగున లేదు గనుక తత్సదృశోచ్చారణము గల అరసున్న వచ్చు ననుకొన్నచో వైరుధ్యము తొలగు ననిరి. 286 పు. ఈ పక్షమున హ్రస్వాత్ పూర్ణోపి భవేత్—అను సూత్రముచే ఖండమునుండి పూర్ణమును సాధింపవలసియుండును. ఖండమునుండి పూర్ణమును సాధించుట ప్రాచీన లాక్షణిక పద్ధతికిని, బిందు చరిత్రాదులకును విరుద్ధమగుటచే అహోబలాదుల వ్యాఖ్య చింతామణి సమ్మతము కానేరదు. కాన పై ప్రాకృత సూత్రముచే అరసున్న వచ్చు ననుకొన్నచో వైరుధ్యము తొలగుననుట సరికాదు. చింతామణి నన్నయ కర్తృకమగుటచే ఖండ బిందువునుండి పూర్ణ బిందువును సాధించునట్లు ప్రక్రియ నడపరాదు. కాన పై ప్రాకృత సూత్రమును తెచ్చి జిత్తు అర్ధబిందు పూర్వకమని వ్యాఖ్యానించుట అగ్రాహ్యమను సర్వస్వకర్తల ఆశయము వీరికి గోచరముకాలేదు. వై. పా. 304–315 పుటలు. (2) తన ధర్మ విభవ సంతత సంస్తవామోద పరిపూర్ణులగు మహీసురులు గొలువ—అను పద్యపాదమును ధర్మ విభవాది సిద్ధ సమాసము మొత్తముతో 'తన' అన్వయించుట వైరి సమాసమని అధోజ్ఞాపికలో తెలుపబడెను. 496 పు. ఇది కేవలము పొరపాటు. ఏలన కేవల సంస్కృత శబ్దము వికృతి శబ్దముతో సమసించుట వైరి సమాసము. 'తన' అచ్ఛిక శబ్దము. కాన వైరి సమాసమునకు ప్రసక్తియే లేదు. ఏకదేశాన్వయ స్థలమును వీరు వైరి సమాస స్థలముగా భ్రాంతి పడినారు. వ్యా. సం. స. 1111 పు. (3) "చింతామణి విధించినఓ ఆవలును సమాసగత రైనౌ శబ్దములకు రావని నియమించుటయు నథర్వణకారికకు ప్రయోజనముగా కనుపట్టుచున్నది." 373 పు. అను అధోజ్ఞాపిక సరికాదు. సమాసములలో రో—నావ—శబ్దములు నిలువరాదన్నచో ఈ సంస్కృత సమరూప సాధనమే నిష్ప్రయోజన మగును. త్రిలింగ్యా మపీత్యాది కారిక వీరి భ్రాంతికి హేతువయి యుండును. (వ్యా. సం. స. 570 పు.) మరియు "నావ్యావః" (8–1–164) అను ప్రాకృత సూత్రము చొప్పున 'నావా' అను ప్రాకృత రూపము గలదు (హేమచంద్రుడు). దీని నుండి 'నావ' అను ప్రాకృత సమము సిద్ధించును. కాని ప్రాకృతసమ మచ్చ తెలుగులోనిది గాన సిద్ధ సమాసమున దీనిని వాడరాదు. కావుననే చింతామణి 'నావ' అను సంస్కృత సమరూపమును సాధించి

నది. తదనుయాయి సూరియు 'మహానావ' అని ఉదాహరించి యున్నాడు. (తత్సమ 63) కనుక సమాసములలో రో—నావ—శబ్దములు నిలువరాదనుట అథర్వణాశయ మనరాదు. (4) అనుహృద్దర్పోన్నతులు నూచి యెట్లు సహింతుర్—అను పాఠముతో అహోబలపతి నన్నయ పద్యపాదమును చూపెను. ఎట్లు సహింతున్—నేటి ముద్రణ పాఠము. ఇదే సరియనియు, అహోబలుని ఉదాహరణ సరికాదనియు అధోజ్ఞాపిక 473 పు. కాని అహోబలుని పాఠమే సరి. చూ. వ్యా. సం. స. 789 పు. పాదాంతమున 'సహింతుర్' అని రేఫాంతముగా నుండుటను సహింపక నేటి వారు 'సహింతున్' అని దిద్ది యుందురు. (5) "కిలార్థకములైన అంట, అంటలు కూడ నన్నయ భారతమునఁ గానరావు. వానికి బదులుగా అట్టె యొకటి తఱచుగాఁ గనుపించుచుండును" 614 పు. —అని తెలిపినారు. కాని 'అంట' అను పాఠములే నన్నయ ప్రయుక్తములయి యుండును. అట్టె—అన్నవి సరికావని తోచును. వ్యా. సం. స. 322 పు. (6) తిక్కనాదులు ప్రయోగించిన అంట, వింటవంటి రూపములు నన్నయాథర్వణ సమ్మతములు కాకుండుటచే అసాధువులని అహోబలపతి నిరసించెను. అట్లు నిరసింపరాదని వ్యా. సం. స. 1431 పు. ఇట అనువాదకులు అహోబలుని ధోరణిని సమర్థించుచు వ్రాసిరి. 614 పు. అది అహోబలుని ప్రణాళిక అనిరి. ఏ అప్పకవి వంటి వాడో చింతామణిని మాత్రమే ప్రమాణీకరించి తద్విరుద్ధ ప్రయోగముల నెల్ల అసాధువులన్నచో అది అతని ప్రణాళికయైన కావచ్చును గాని ఆ ప్రణాళిక గ్రాహ్యము కాదుగదా! అట్లే యీ అహోబలుని ప్రణాళికయు సరికాదని సర్వస్వ కర్తల ఆశయము. తననాటి కున్న రూపముల నసాధువులనుట కథర్వణున కెంత అధికార మున్నదో తన అభిప్రాయమును ప్రకటించుటకు అహోబలుని కంత అధికార మున్నదనిరి. తననాటి వ్యవహారము నథర్వణుడు నిరసించుటలోను, తిక్కనాదుల నహోబలుడు నిరసించుటలోను గల భేదము వారు గుర్తింపలేదు. అథర్వణుడు "పూర్వస్య న వికారో నోః" అనెనే గాని తన నాటి కవులను నిరసింపలేదు. నిజమునకు అహోబలుని ప్రణాళిక ఆ నన్నయాథర్వణులకే సమ్మత మనలేము. వై. పా. 32–36; వ్యా. సం. స. 15—16 పు. (7) తద్వతాం క్వచిద్త్యైక్యం స్యాత్—అను దానికి సర్వస్వ కర్తలు చెప్పిన అర్థము అహోబలపతి ఆశయమునకు విరుద్ధముగా నున్నట్లు అధోజ్ఞాపికలో కలదు. 601 పు. పొరపాటు. దీని కహోబలపతి "క్వచిదాగమలాదేశయోరైక్యం" అని అర్థము చెప్పి ఉదాహరించి యున్నాడు. 602 పు. వీరు సరిగా చూచుకొనక సర్వస్వకర్తల అర్థ మహోబలపతికి విరుద్ధముగా నున్నట్లు వ్రాసినారు. వ్యా. సం. స. 1490, 1770 పు.

ఇక పాఠ పరిశీలన. (1) ధ్యాయే ద్రుతతు మావేవ 132 పు. అనుచో 'నావీవేవ' అనుట పాఠాంతరము కలదని సూచింపవలసినది. వై. పా. 53 పు. (2) దండినా ప్రతిపాదితమ్ 218పు. అనుచో దండినా నప్రతిపాదితమ్—అని యుండవలెను. వై. పా 48–49 పు. (3) వైకృతేత్ర కదాపిచ—177 పు. అను పాఠముతో చూపిరి. కవిజన మండనము లోను వ్యా.సం.స. లోను "నస్య లోపశ్చ నేష్యతే" అను పాఠము గలదు. వీరు దీనిని పాఠాంతరముగ నైన చూపకపోవుట సరికాదు. (4) ఇతి ఇకార లోపః 188 పు.—అను వాక్యము సరికాదు. ఏకారలోపః—అని యుండవలెను. వ్యా. సం. స. 1506 పు. (5) మానార్థాత్—పాఠముతో అథర్వణకారిక చూపిరి.232 పు. మానార్థాత్. పూ.టీ; కవిజన మండనము; వ్యా. సం. స. (6) నస్యాత్తద్ధర్మోతః—232 పు. పాఠము సరియే. 'నః స్యాత్' పాఠము సరి కాదని తెలుపవలెను. వ్యా. సం. స. 336—367పు. కొఱకు కై 281 పు. ఇట 'కయి'—పూ.టీ, వ్యా. సం. స. 'కయి'పాఠమే లెస్స. (8) యువర్ణకః స్యాద్యాన్తాత్తు334పు.—పాఠము సరికాదు. 'ఉవర్ణకశ్చాద్యన్తాత్తు, సాధుపాఠము. (వ్యా. సం. స.) పు. 310 ఈవిషయమును అధోజ్ఞాపికలో తెలుపవలసినది. (9) ముశ్చవుశ్చాత్రకుత్రచిత్—343 పు. పాఠము పొరపాటు. ఈ పక్షమున 'ధర్మవు' అను రూపమేర్పడ వలసి వచ్చును. కాన "ముశ్చో వుశ్చాత్ర కుత్రచిత్" సాధుపాఠము. వ్యా.సం.స 595 పు. (10) తద్భవస్యాపిశబ్దస్య 350పు. అనుచో 'కథిత స్తద్భవస్యాపి' పాఠము వ్యా.సం. స; కవిజనమండనములలో కలదు. సూచింపవలసినది. (11) నబూాదన్తశ్చలన్తశ్చ (పూ.ము.లో తన్తశ్చపోయినది.ఏదన్తశ్చాత్ర విద్యతే354 పు. అనుచో "లన్తశ్చాప్యేదన్తశ్చ" వ్యా.సం.స. కవిజనమండనమునందలి "బూాద

న్తశ్చ రిదంతశ్చా ప్యేదన్తశ్చాత్ర విద్యతే'' అనుపాఠము తప్పు. వ్యా.సం.స. 613పు. (12)భవేత్తదాది శబ్దేభ్యో 357—పు.అనుచోట'శబ్దేభ్యో' అపపాఠము. ''శబ్దోవో'' అని యుండవలెను. వ్యా.సం.స. 855పు.అనువాదకులు పరిశీలింప లేదు.(13)అమివేన్యాదిశ్శసి తూచ్యతే 359 పు. అను దానికున్న పాఠాంతరములను చూప లేదు. పూ.ము.లో— అమ్వా్యదేన్యాదిశ్మసి తూచ్యతే— అని కలదు. ఇట్లే కవిజన మండనము. 'అమివాన్యాదిశ్శస ఉచ్యతే' వ్యా.సం.స.పాఠము 862 పు. (14) జసిచాత్ర భవేదేనిరి త్యాహ వృదుభాషణః 359 పు. ఇట మృదు భాషణమ్—కవిజన మండనము. 'ఏనిః'' అప పాఠము. ''ఏసిః'' సాధు పాఠము. వ్యా.సం.స. 758; 1308. అథోజ్ఞాపికలో తెలుపవలసినది. (15)స్త్రీత్వబహుత్వే— 361 పు. అనుపాఠమున ఛందోభంగమైనదని అను వాదకులు చూచుకొన లేదు. 'బహుతే' అనియుండ వలెను.వ్యా.సం.స599పు.(16)ఇహోచ్యతే—పాఠమే కవి జన మండనముననుు; పూ.ము. (తృతీయ ముద్రణము) లోను గలదు. అపీష్యతే—పాఠము వ్యా.సం.స. లో చూప బడెను. 600 పు.(17)ఐకారాంతం—అనుచో373పు. కవిజనమండనమున 'ఐకారాంత' అని కలదు. ఈపాఠము సరికాదు.వ్యాసం.స. 607 పు.(18)అద్య గస్య గకారస్య అనుదానికి బదులుగా 379 పు. అప్పకవీయమున వాస్యాత్ క్వచిద్వకారః— అను పాఠము గలదు. ఇది తప్పు. వ్యా.సం.స 922 పు. (19) కేషాంచిద్ యన్త శబ్దానాం లుఖీ స్యాతాం యథోచితమ్—అనునది కవి జనమండనమున''కేషాంచి ద్యంతశబ్దానాం లుతౌ స్యాతాం అనిమారినది.(20)క్వచిత్త్వ్య దేశ—381పు. అనునది 'క్వచిత్తాదేశ' గామారినది. (21) ప్రాయిక నిత్య ప్రయోగ—146పు అను పాఠము సాధువే. కాని'ప్రాయిక' అనుచో'ప్రాలంబక' పూ.ము. పాఠమనియు, అది సరికాద నియు తెలుపవలసినది. వ్యా.సం.స. 12పు. (22)సవా భవేత్ అను పాఠము301పు. సరియే. కాని 'సదాభవేత్' అను పూ. ము.సరికాదనవలసినది. (23) ఇదాదిభ్యస్తు నిత్యం 301 పు. అనుచో 'నిత్యం' అను పాఠము గ్రంథ కృదభిప్రేత మనుట లెస్స. వ్యా.సం.స. 489 పు. (24)స్త్రియామపి బాలుర గనియెన్. 300 పు. అనుచో బాలర గనియెన్—అహోబలుని పాఠమయి యుండును. వ్యా.సం.స 521 పు. బాలాశబ్దతత్స మము బాల. 'బాలరన్ 'నిర్మూలము. (25) కే షాంచి న్న్వన్తశబ్దానాం కు స్స్యాత్— 308 పు. ఈ అహోబలుని పాఠము సరికాదనియు 'కుక్ స్యాత్' సాధు పాఠమనియు వ్యా.సం.స. 765 పు. కొఱకులు నెఱకులు అనునిర్బిందుక రూపముల నహోబలుడు చూపుట పొరపాటు. కొలఁకులు మున్నగు వాటితో పాటు వీటినిగూడ కేతన ఉదాహరించి యున్నాడు. నెఱఁకులు—అని నన్నయయే వాడెను. ఆర 1—314. న్వన్తానామ్నః కుక్ నో ర్బహువచనే — అని నన్నయయే వచించుటచే 'నెఱఁకులు' అన్నదే తత్స మ్మత మననగును. కాగా 'కుస్స్యాత్' పాఠము సరికాదననగును. (26) మానార్హాత్—391 పు. అనుచో కవిజనమండనమున 'మానాంతాత్' అని యున్నది. (27) పూజత్వే స్రుతః కారుః—అన్న పాఠము కేవలము పొరపాటు. 417 పు. పూజ్యతో స్రుతోగారుః—సాధు పాఠము. వ్యా.సం.స 843 పు. (28) అథాతోః క్వచి రేకతా 423 పు. అను అహోబలాంగీకృత పాఠము సరికాదు. 'అదాతోః' సాధు పాఠము. వ్యా.సం.స. 801—802 పు. (29) సప్త మ్యార్యే (426) అను పాఠము నహోబలుడు చూపెను. సప్తమ్యాద్యాః— అధర్వణ పాఠము కానోపును. వ్యా. సం.స. 1014 పు. (30) క్వచిన్నిత్యం క్వచి ద్వా స్యా దహోతాసాం ప్రకారతా 426 పు. వ్యా.సం.స. లో క్వచిన్నిత్యం క్వచిద్వాస్యాదహోతేషాం ప్రకారితా—అని కలదు. 1013 పు. క్వచిన్నిత్యాః క్వచిద్వాస్స్య రహో తాసాంప్రకారితా—పూ. ము. పాఠము; కవిజన మండనము. (31) తత్థైకతా 429 పు. అనుచో కవిజనమండనకర్త కల్పించిన 'తథావతా' పాఠము సరికాదు. (32) ఏకత్వే డుః క్వచి ల్లోపో (429) అను పాఠము పొరపాటు. ఏకత్వేరుః క్వచిలోపే— అని యుండవలెను. వ్యా.సం.స. 891 పు. (33) మూఁట నాల్గిఁట—అని అర్ధబిందుయుతరూపముల నుదాహరించుట పొరపాటు. 431 పు. పూ. ము. లో నిర్బిందుకములే కలవు. వీరు అరసున్నలు చేర్చుట వింతగా నున్నది. (34) క్వచి త్తేషు నసీ మతా—433 పు. పూ.ము. లో క్వచి త్తేచ ననీమతా అని కలదు. క్వచి త్తేషు ననూ మతా—అని యుండవలెను. వ్యా.సం.స. 1591 పు. (35) యుక్తా వపి మతా నుము— 469 పు. అని ముద్రించిరి. 'నుమూ' పూ.పా. ఈ పాఠము తప్పు. 'నమో' సాధుపాఠము. వ్యా.సం. స. 883 పు. (36) కమ్మని లతాంతములకు మ్రొనసి నచ్చు—244 పు. అను పాఠముతోనే ఉదాహరించి

త్యాజ్య చిహ్నముల మధ్య చేసిన వివరణము కేవలము ప్రామాదికము. 'కమ్మని లతాంతములకుం మొనసి వచ్చు' అనియుండ వలెను. వ్యా.సం.స. 287–293 పు. సాహితి–1962 నవంబరు; 1963 అక్టోబరు; 1964 సెప్టెంబరు సంచికలు. (37) పరిమితౌ సమస్తానామ్—232 పు. ఇట 'పరిమితే' చింతామణి పాఠమయియుండును. వ్యా.సం.స. 254 పు. (38) జూదము—శౌర సేనీ తద్భవః—నతుతద్భవః 155 పు. అనుచోట శౌరసేనీతత్సమః అని యుండ వలెను. వై.పా. 583 పు. అనువాదకులు పూ.టీ. లోని అవవాఖ్యను గ్రహించి దాటి పోయిరేగాని 'తద్భవః' అన్నది సరిపడదని గుర్తింప లేదు. వ్యా.సం. స. 36—37 పు. (39) డుమకారౌ కావుతాద్యౌ ఆశీరీర్ధేతు సమ్మతాః 415 పు. ఇట పూ. ము.లో డుమ్మకారౌ అని తప్పుపడినది. కవిజనమండన మా తప్పునే అనుసరించినది. డుమ్మకారౌ—పాఠము సరి కాదని తెలుప వలసినది. శుభము ఘటియింపు డుము—అని అహోబలపతి ఉదాహరించెను. కాన 'డుము' అన్నదే ప్రత్యయమని తేలుచున్నది. 'డుము' (ఎడుము—ఎడుము) అన్నది సరికాదనియు స్పష్టపడు చున్నది. "ఎడుతల సంధి విచారణ" భారతి 1961 మార్చి. (40) క్త్వార్థశబ్దేన—522 పు.ఇట త్వార్థ అనియేని కావచ్చును. వ్యా.సం.స. 242 పు. (41) వ్యవధానతః—539 పు. వ్యవధానతా—పూ.ము., వ్యా.సం.స., కవిజన మండనము (42) స్వాదుపకృతిః క్వదంతాసా—549 పు క్వదంతాభా — అసలు పాఠ మేమో అని వ్యా. సం. స. 1538 పు. వాటి ప్రక్రియ నామధాతు ప్రక్రియ వంటి దన్నచో సరిపోవునని అధోజ్ఞాపిక. నామములకు "అన్య స్మాచ్చాధాతోర్ధాతుత్వ వివక్షయైవ భవతీంచుక్" అను సూత్రముచే ధాతుత్వ వివక్షచేయుట వలన ఇంచుక్కు చేరుచున్నది. ఉపకృతుల కట్టి ధాతుత్వ వివక్ష సూత్రింప బడలేదు గదా! నామ ధాతు ప్రక్రియ వంటిదని అనుటెట్లు? క్వదంతాభా— సాధు పాఠ మనుట సహేతుకముగానే యున్నది. (43)సంస్తుతిం— పూ.ము. వీరు సంస్తుతించు— అని ముద్రించిరి. 559 పు ఈ మార్పునుగూర్చి యేమియును తెలుప లేదు. వ్యా.సం.స. 1540 పు. (44) కేషాంచి దీరితను 559 పు. పూ. ము. కవిజన మండనము. కేషాంచి దీరణా—వ్యా.సం.స. 1483 పు. (45) ఆంధ్రం షడ్వర్ణ పర్యంతం—అనుకారిక ప్రక్షిప్తమని తెలుపవలెను. వ్యా.సం.స. 1186 పు. (46) సంప్రార్థ నార్థకా దీచ్ఛా—అనుచోటి 'చ' శబ్దము విడిగా చూపుటలో విడువబడెను. 606 పు. ఇట 'ఉదాత్తౌ' అసలు పాఠ ము. వ్యా.సం.స. 1411—1414 పు. (47) లోపో వర్ణాగమో మతః—632 పు. లో పవర్ణాగమాద యః—పూ.ము., వ్యా.సం.స., కవిజన మండనము. (48) తృతీయాస్స్యుః కపోతరే—254 పు. తప్పు. తృతీయే స్యుః — వ్యా.సం.స. 300 పు. (49) దృష్టోడు స్తుత్యచిచ్ఛ్రితః 433 పు. ఇట 'దస్తు' సాధు పాఠము. వ్యా.సం.స. 1768 పు. (50) కే షాంచిద్ర్వన్త శబ్దానాం—(391) 'వాంత' అను కవి జన మండన పాఠము తప్పు.

వరరుచి హేమచంద్రులవని అహోబలపతి ఉదాహరించిన శ్లోకములు నేటి ముద్రిత గ్రంథము లలో కన్పట్టవు. అనువాదకులు తెలుపవలసినది. వై.పా. 287 పు. నందనుఁ గనెనంట—నన్నయ ప్రయోగమను అహోబలపతి వ్రాత పొరపాటు. ఇది శృ.శా లోనిది. అనువాదకులు గుర్తింప లేదు. 218 పు. ప్రధానంద్వ యహీనే ద్వే అప్రధానోపసర్జనే— ఇత్యమరోక్తేః—అని కలదు. 291 పు. అనువాద కులు అమ.విశే. 60 అని సూచించిరి. ఈ స్థలమున 'అప్రాగ్ర్యం ద్వయహీనేద్వే అప్రధానోప సర్జనే' అని యున్నది. ఇత్యర్ధర్వణోక్తేః అని ఉండవలెనని వ్యా సం.స. 467 పు. అంబ నవాంబుజోజ్జ్వల కరాం బుజ—ఆరణ్య 4—216. ఇది నన్నయదని అహో బలపతి వ్రాయుట పొరపాటు. ఇది యెఱ్ఱనదని అనువాదకులును చూచుకొనలేదు. 306 పు. మొన శ్పులు—అది (8—148) అని నన్నయ ప్రయో గించి నట్లహోబలపతి వ్రాసెను. ఇట్టి పాఠము వావిళ్ల ముద్రణమున కన్పట్టదు. వ్యా.సం.స. 760 పు. పరదారములందును అను 4—93 అను పాఠముతో అనువాదకులుదాహరించిరి. పరదారలయందును ప్రధాన పాఠముగా ముద్రితము. వ్యా.సం.స. 533 పు. ఒక్క మాత్రలోన్— నన్నయ భారతమున వ్యాగ్యము. తిక్కన భారతమున కన్పట్టును. కర్ణ 3—65. అహోబలపతి గ్రంథనామములతో పేర్కొన్న ప్రయో గములన్నైనను గుర్తించుటకు ఇంకను పరిశ్రమ కావలెను. నాకు స్ఫురణలో ఉన్నంతలో అనువాదకులు

గుర్తింపగా మిగిలిన ప్రయోగములు ఏయే గ్రంథములలోనివో యిట ప్రకటించుచున్నాను.

(1) శతతాళదఘ్న హ్రదమునఁ బడియెన్—179 పు. ఇది నాచన సోముని హరివంశములోనిదని ఓగిరాల జగన్నాథ కవిగారి సుమనోమనోభిరంజన టీకలో ఉదాహృతము. కాని మన కుపలబ్ధమగు ఉత్తర హరివంశమున ఇది కానరాదు. (2) ఆ వేళం బుర వల్లవ ప్రకర—297 పు. ఈ పద్యము దూర్జటిది. కాళహ 1—33 (3) సఖుఁడు సంబంధి శిష్యుండు సవ్యసాచి—333 పు. భీష్మ 3—284 అహోబలపతి 'సఖియు' అని ఒకపక్షమున పాఠ కల్పన చేయుట సరికాదు. శాంతి 3—48; 117 ప. (4) వృథా శపింతురే—328 పు. మను 4—425 (5) తల్లిందండ్రియు నన్నుఁగానక—335 పు. మను 3.98 (6) ఒకళ్ళొకళ్ళకై (పై) 393 పు. (శృ.నై) (7) ప్రథన జయమిచ్చుఁ దిరుమలరాయ మణికి 415 పు. వసు 1—6 (8) ఏమేమీ జగతిం గళోరములు—423 పు. వసు 4—113 (9) ఒకనాఁ డింద్రునియంత వేలుపు—428 పు. వసు 4—126 (10) తలఁపంజొప్పడి యొప్పెనప్పుడు—438 పు. రాఘవ 1—9 (11) ఏమిటి కల్గితే కువలయేక్షణ 438 పు. వసు 4—83 (12) అప్పు పాలైన శుభ్రాబ్జంబు రుచి యెంత—458 పు. నరస 1—67 (13) తనకూర్మికలని నవ్వునవె ముంచె—458 పు. వసు 1—36 (14) తిలలుపై నెత్తిచల్లిన దిగువఁబడని—486 పు. శృ.నై. 4—123 (15) నీచెప్పిన పెద్దలు—490 పు. ఉద్యో—2—250 (16) జనమేజయుచేయు (చేసిన) సర్పయాగము 491 పు. ఆది 1—127 (17) నానావటీరసేనామానభేదనుండును. 493 పు. వసు 1—14 (18) ఆత్మవత్సర్వభూతానియనెడునీతి 494 పు. శృ.నై 4—33 (19) అనువేల మణిత యాచ్ఞార్థ గల్ల చపేటము—495 పు. మను. 3—116 (20) గుజ్జుపుడదములు—495 పు. ఉద్యో 1—220 (21) తనకూడుచీరకైకాంచన మడిగి—519 పు. శాంతి 3—164 (22) పరాశరుఁడన్ మునీంద్రుడు—521 పు. ఆది. 3.35 (23) తాకె వేయుమున్నూఱు దంతావళములు—542 పు. కర్ణ 3.182 (24) వేఁడిపయోధారలు—542 పు. ఆం. భా 134 ప. (25) అతిమానుష మత్యద్భుత మతిదుష్కరమైన కేశవార్జునకృతి—544 పు. ఆది 8.137 (26) ఆకర్ణింపుదురు పెద్దలతిహర్షమునన్—591 పు. భాగ 8 స్క—21 (27) ననుం గృపచూడు భారతీ—593 పు. ఆరణ్య 4—216. ఇది ఆచార్యునిదని అహోబలపతివ్రాయుట పొరపాటు. ఇదియెఱ్ఱనది. (28) విషనుము చేసెడివారి (కి?)—596 పు. ఆది 2.56 (29) అజుని పుత్రుని చేసినట్టి నెయ్యముపొంటె—603 పు. శృ.నై—8—129. (30) పిదపనిట్లు సుధర్ముఁ జంపింపఁదగునె—605 పు. జై. భా. 5—59. (31) పల్కు విదేటికే వధూటీమణి—607 పు. వసు 4.83 వధూమణి—అని ముద్రితము. కాని దీని పూర్వభాగము ఏమిటి కల్గితే కువలయేక్షణ—అన్నది 438 పుటలో ఉదాహరింపబడుటచే ఇది వధూటీమణి అనియే కావచ్చును. (32) మింటఁగడు దెల్లనై పొఱుచుంటఁ జూచి—614 పు. (శృ.నై.)

వివరణమువ్రాయుటలోను నన్నయాథర్వణ కారికలను జోడించుటలోను అహోబలపండితుడు పొరపాటులకు లోనయినాడు. వాటిని అనువాదకులు సూచనా మాత్రముగనైనను ఆయాస్థలములలో తెలుపకపోవుట అనర్థదాయకము; గ్రంథసమగ్రతకు తీరనిలోపము. సంక్షేపముగా వ్రాయుదును. చింతామణిలోని వన్నియు ఆర్యాగీతివృత్తములను అహోబల పతివ్రాత ప్రామాదికము. 29పు.వై.పా.15—17 పు. వర్ణగణాదిశుద్ధి నిగూర్చి అహోబలపతి విపులముగా చర్చించెను. 39—45పు. ఇది గ్రంథకర్త వివక్షించినది కాదందురు. వై.పా. 9—11 పు. తదదోషా— అనుదానికి అహోబలపతిచేసిన వ్యాఖ్య గ్రంథకృదభిప్రేతము కాదు. 46 పు.వై.పా.17—19 పు. లోకేబహుమన్యన్తే— ఇత్యాది చింతామణికి వ్రాయబడినవ్యాఖ్య సరికాదు.124 పు. వై.పా.25.26 పు. ద్రవిడభాషా అసంస్కృతానుసారిణ్యపి—196. పు ఈవాక్యము పొరపాటు. వై.పా. 27—28 పు. వనమునకు, రాముకు—తప్పులని అహోబలపతి వ్రాయుట తప్పు. 127 పు.—వై.పా. 42 పు. అపభ్రంశాదులకు దండి ప్రాకృతత్వవ్యవహారము నంగీకరించెననుట పొరపాటు. 158పు. వై.పా. 61—63 పు. ప్రాకృతవర్ణముల విషయమున అహోబలపతి ఆశయము సరిగాలేదు. 168 పు. వై.పా. 236.247 పు. సప్తత్రింశతి ఇహోన్యే— అను అప్పకవి పాఠము

నహోబలుడు ఒక పక్షమున సమ్మతించుట సరికాదు. 169 పు. వ్యా.సం.స. 38 పు. మొ. ఇట్లే యర యుగల యుగ వసహోశ్చ హలః—అను అప్పకవి పాఠమును అగ్రాహ్యమే. 175 పు. హ్రస్వాత్పూర్వోపి భవేత్—అనుదానికి అహోబల పతిచేసిన వ్యాఖ్య కేవలము పొర పాటు. 176 పు. వ్యా.సం.స. 110–111 పు. వై. పా. 304—309 పు. నఖండః ప్రథమాత్—అనుదానిని ఇఁక — ఇంక — అను రూపము లకు బాధ కలుగకుండునట్లు వ్యాఖ్యానించుటలో అహోబలుని వ్యాఖ్య లోపభూయిష్ఠమై యున్నది. 177 పు. వ్యా.సం.స. 320 పు. గసడదవాదేశ వకారము లఘువనుట అంత యుక్తముకాదు.182 పు. వ్యా.సం.స. 134 పు. చనెన్—కనెన్— అను రూప ములను నన్నయాథర్వణకారికలచే సాధించుట ప్రామా దికము. 188 పు. వ్యా.సం.స.783పు; 1504—1506 పు. పదాదియకారమును నిరసించుట సరి కాదు. 189—194 పు. వ్యా. సం. స. 121—129 పు. వై. పా 563—570 పు. రేఫఱకార సాం కర్యము దుష్ట మనరాదు. మఱిగు ఱెక్క—అనునవి ద్విరే ఫక శబ్దములు. 197 పు. పుర్రస్తరసగిరి—అను చోట' రసశబ్దమునకు ఆఱు—అని అర్థము చెప్ప బడెను. 205 పు. 'రస'శబ్దమునకు తొమ్మిది—అని సర్వస్వకర్తలర్థము చెప్పిరి. వ్యా. సం. స. 65 పు. దంభోళిధరసతీతాంబూలపేటీషు— మున్నగునవి అను కరణములో నుండుటను అహోబలపతి చూచుకొన లేదు. 209 పు. వ్యా.సం.స. 419—420 పు. ఎప్పుడున్—ద్రుతప్రకృతికమనుట పొరపాటు. 211పు. వ్యా.సం.స. 86 పు. ఇది ద్రుతోపజీవిశబ్దము. ఆది శబ్దముచే గ్రాహ్యములన్నవాటిలో 'సుమ్ము' చేర్ప రాదు. 121 పు. వ్యా.సం.స 84 పు. అయాస్వభావ వర్ణసమున గ్రామ్యము సాధు వనరాదు. 212 పు. వ్యా.సం.స. 186 పు. శాస్త్రప్రయోగవచసోః శాస్త్రం బలవ దుచ్యతే—అను కారికను ఆచ్ఛికశబ్దవిషయమున సమన్వయించుట సరికాదు. 216 పు.వ్యా.సం.స. 16పు వై.పా. 32—35 పు. రాము నభిరామున్—వంటి వాటిని అనాదిషువిభక్తిషూతోవా—అను సూత్రము వద్ద చేర్పక అహోబలపతి అపమార్గమును పట్టెను. 225—228 పు. వ్యా.సం.స 208—215పు చిం. పరి.137—147 పు. ప్రత్యయయోగే మిక్కిలియు నిత్యుదాహరణమ్. 230 పు. ఇది పొరపాటు. వ్యా.సం.స. 208 పు. కొలిచి తబ్దిజన్—అను అహో బలోదాహృతి నన్నయాథర్వణసమ్మతము కాదు.231పు. వ్యా.సం.స. 237—238 పు. పరిమితా (తే) సమ స్తానామ్—232 పు. ఇచ్చటి పరిమిత శబ్దమును కేవల పరిమాణార్థ ప్రత్యయపరముగా వ్యాఖ్యానింప రాదు. వ్యా.సం.స. 254 పు. తరాదిసంధిని కిమాది సంధిని వేరువేరుగా చెప్పుట స్పష్ట ప్రతిపత్తి కనరాదు. 235 పు. వ్యా.సం.స 227 పు. మగనాలు—ఇట సంధినిత్యమనుట పొరపాటు. 235 పు. వ్యా.సం.స. 230 పు. సంతోషపెట్టి — అసాధువనబడెను; కాని గ్రాహ్యమే అనవలసియున్నది. 240 పు. వ్యా.సం.స. 411పు. రామేసుం — అను ప్రాకృతరూపముచివర మకార ముండుననుటలో ఇబ్బంది లేదను అహోబలవచనము సరికాదు. 245పు. వ్యా.సం.స. 430 పు. నన్నయాథర్వణుల సంశ్లేష స్వత్వములస్వరూపమును అహోబలపతి గ్రహింప లేదు. 254 పు. వ్యా.సం.స 280 పు. అపరాన్తే సమాసేచ—మున్నగు కారికులకు అపార్థములు చెప్పబడెను. 255 పు. వ్యా.సం.స. 290—301పు. వికారాద్వ్యాపికేచన— అను కారికలోని వికారాత్ — అనుదానిని పుంప్వాదేశమాత్రపర మనరాదు. 261 పు. వ్యా.సం.స. 338 పు. జవ్వనురాలు—అనియు ఉండ వచ్చుననుట నిర్మూలము. 265 పు. వ్యా.సం.స. 359 పు. తాను నేను శబ్దములు కళలని గ్రహింపక అహోబలపతి అసంగత ప్రసంగములు చేసెను. 274పు వ్యా.సం.స. 787 పు. ఏన్గు—అడ్గు— అను రూప ములు లేవనుట పొరపాటు. 278 పు. వ్యా.సం.స. 807 పు. ఈ సందర్భమున చూపబడిన కొన్ని ఉదాహరణముల సమన్వయమునను వ్యత్యాసములు కలవు. ద్వైతశిరుడు—ద్వైతరత్నుడు—అను రూపము లుండరాదనుట సరికాదు. 290 పు. వ్యా.సం.స. 477పు. మహతో మస్తునిః—ఇత్యాదికారికకు చేయ బడిన వ్యాఖ్య ప్రామాదికము. 301 పు. వ్యా.సం.స. 489 పు. ప్రాచేతసుకున్ మున్నగు వాటిని తప్పు లనుట అసంగతము. 309 పు. వ్యా.సం.స. 504 పు. అహోబలపతి జడప్రకృతులపై 'చేత' నిల్వ దనరాదు. 316 పు. వ్యా.సం.స. 986 పు. విషయ నిమిత్త జేత్యాది సూత్రమునకు చేయబడిన వ్యాఖ్య ప్రామాదికము. 319 పు. వ్యా.సం.స. 1044 పు. ధూర్తాదులలో సేతు బోదు అను ఆచ్ఛికములను

చేర్చరాదు. రూపు—మున్నగు వాటిని వేరేసాధించుకొనుట లెస్స. 339 పు. వ్యా.సం.స. 579 పు. న చ దేశ్యపదే—అను సూత్రమునకు ఈ—కా—ఆ—ప్రత్యయాంతములను ఉదాహరింపవలెను. 345 పు. వ్యా.సం.స. 568 పు. ఏలన 'నవలా'మున్నగువాటిని చూపుటచే కొందరు నన్నయకర్తృకమగు చింతామణిలో ఈ నవ్యశబ్దముల ప్రసక్తియెట్లువచ్చెనని శంకింతురు. అద్విత్వంచ —అనుకారికకు చూపబడిన ఉదాహరణములు సరిగా లేవు. 359 పు. వ్యా.సం.స. 860 పు. కుశాదులలో దూతశబ్దమును చేర్చరాదు. యోధాదులలో చేర్పవలెను. 363 పు. వ్యా.సం.స. 601 పు. సురాదేః అనుచో సురాదిగణ మన రాదు. 361 పు. వ్యా. సం. స. 599 పు. ఆద్యుఁడు హిరణ్యగర్భునందంతకంబె— 364 పు. అను ప్రయోగము నిర్మూలమనుట పొరపాటు. వ్యా.సం.స. 1078 పు. ధరా పరాగ పటలాక్రాంతంబు మిన్నేటు—369 పు. ఈ ప్రయోగమును ఉభయేతి సూత్రముచే సాధువనుట సరికాదు. వ్యా.సం.స. 686 పు. స్వస్త్రానామ్నః— అనుసూత్రమున విభక్తి విపరిణామాన్వయమును చెప్పనక్కరలేదు. 379 పు. వ్యా.సం.స.665,764,881పుటలు. ఇట్లేమరికొన్ని సూత్రములందును విభక్తివిపరిణామము చెప్పబడుట అనావశ్యకము. ఉతో లోపశ్చ—అనుకారికను ఉపేక్షించుట పొరపాటు. 383 పు. వ్యా.సం.స. 714 పు. పువర్ణకో భవత్యత్ర—ఆనుకారికను ఆచ్ఛికశబ్దముల విషయమున వినియోగించుట అగ్రాహ్యము. 391 పు. వ్యా. సం. 550 పు. నలోలోశ్చ—అను సూత్రమునకు అపార్థము చేయబడినది. 395 పు. వ్యా. సం. స. 735 పు. కోడండ్రురు—వంటి రూపములను సాధించుట అసంగతము. 390 పు. వ్యా.సం. స 760 పు. చోటునన్—వంటివి ఔపవిభక్తికములని తెలుపకపోవుటయు "బహుళపద మనువర్త్య క్వచిత్— అని వ్రాయుటయు పొరపాటులు. 399 పు. వ్యా. సం. స. 928 పు. అనుతాం స్త్రియాం అన్న దళము అనావశ్యకమనరాదు. 405 పు. వ్యా. సం. స. 581 పు. దాసి—దాపల అను రూపాంతరములు కలవని అహోబలపతి చూచుకొనలేదు. 414 పు. వ్యా. సం. స. 1768 పు. చక్కు. శబ్దమునకు నిగాగమము నిత్యమనరాదు. 416 పు. వ్యా. సం. స. 1220 పు. అంతియ మున్నగు వాటిని ప్రాకృతమునుండి సాధింపరాదు. ఏ వావ్యయేత్యాది కారిక కివి లక్ష్యములు. 421 పు. వ్యా. సం. స. 782 పు. ఏడ్తెరన్—మున్నగునవి ద్రుతోపజీవి శబ్దములు కావు. 422 పు. వ్యా. సం. స. 86 పు. తచ్ఛబ్దవస్య లోపస్స్యాత్—423 పు. దీనికి సరసమైన అర్థాంతరము సర్వస్వకర్తలు చెప్పిరి. 423 పు. వ్యా. సం. స. 802 పు. ఎన్నాళ్లనోయుండి—427 పు. దీనిని అపాదానార్థ విషయకము కాదననగును. వ్యా. సం. స. 1021 పు. నిషధ రాజంతవాని తప్పనుట సరికాదు. 428 పు. వ్యా. సం. స. 370 పు. ఇట్టిదేయగు చందమామల్లుఁడు—అను ప్రయోగమును సుందరముగా నున్నదని అహోబలపతి వచించెను. 229 పు. రాజంత—దిద్దవలె ననెను! పదార్థ్వన్నియ—వంటివి అసంగతములు కావన నగును. 433 పు. వ్యా. సం. స. 897 పు. పూరణార్థమున కేవల సంఖ్యా వాచకములు ప్రయుక్తములగుట సంస్కృతమునను కలదు. శతాంశము త్రిభాగ శేషాను మున్నగునవి సంస్కృతమున చూపట్టును. తత్సమ చంద్రిక 263 పు. పడకు మున్నగు వాటికి ణకార ఘటిత రూపములు లేవనుట పొరపాటు. 435 పు. వ్యా. సం. స. 1769 పు. అహోబలపతి 'అడ' ప్రత్యయాంతముల నెల్ల గ్రామ్యము లనరాదు. ఇంప్వంతములును ప్రయోగ రూఢములు. 440 పు. వ్యా. సం. స 1436 పు. రామయ ప్రభ్వుఁడు—మున్నగు వాటిని తప్పులనరాదు. 444 పు. వ్యా. సం. స 1188 పు. తురాసాహమ్—మున్నగువాని లోని తుది మకార లోపమునకు ప్రాకృత సూత్రమును వినియోగించుట అప్రసక్తము. 449 పు. వ్యా. సం. స 637 పు. ఆత్మనఇమనన్తానాం డా వా—అను సూత్రపు వ్యాఖ్య సరిగా లేదు. 450 పు. వ్యా. సం. స. 645—648 పు. పథిన్ మున్నగువాని ప్రక్రియ పొరపాటు. 452 పు. వ్యా. సం. స. 620 పు. హనుమంతుఁడు—అను రూపము ప్రాకృత సమమనుట తప్పు. 454 పు. వ్యా. సం. స. 640 పు. అప్పు—అను ఏకవచనము నంగీకరించుట యుక్తము. 458పు. వ్యా.సం.స. 619 పు. దంపతి—కాశీ 4—169; అశ్విని—భోజ 7—245—అను ప్రయోగములిందుకు తార్కాణము. విశదమనుడు—తప్పనుట పొరపాటు. 462 పు.వ్యా.సం. స. 671 పు. ఎద్ది—అద్ది— అను రూపములను త్రికసంధి సందర్భమున చూపుట సరికాదు. 474 పు. వ్యా. సం. స. 1211 పు. కన్నునది—మున్నగునవి తప్పులు. 476

పు. వ్యా.సం.స 407 పు. అ ఇ ఉ (స్త్రీ విషయాః— ఇది వ్యావహారిక శబ్ద విషయముకాదు. 477 పు. వ్యా. సం. స. 905 పు. (స్త్రీ సమాత్—(స్త్రీలింగాత్ 479 పు. ఇచ్చటి అహోబలపతి ఆశయము విచార్యము. వ్యా. సం. స 1278 పు. (కియాజన్య విశేషణేపి—అనుట సరిగా లేదు. 487 పు. వ్యా. సం. స. 1203 పు. ఇతోస్మ దిత్యాది కారికార్థము తప్పు. 499 పు. వ్యా. సం. స. 1089—1090 పు. అస్మద్యుష్మత్—అను వరుస అవివక్షితమనుట (భాంతి మూలకము. 501 పు. వ్యా. సం. స. 1089 పు. ఏకత్వ మిత్యాది సూ(త్ర వ్యాఖ్య నన్నయాభి(పేత ముగా కనబడదు. 516 పు. వ్యా. సం. స. 1072 పు. ముల్లోకములు, ముజ్జగములు (ప్రాకృతసమములనుట అసంగతము. 518 పు. వ్యా.సం.స. 1230 పు. తత్పురుషకిచ్చిన ఉదాహరణములు కొన్ని సరిగా లేవు. 521పు. వ్యా.సం.స. 1157 పు. సమాసాంతముల కిచ్చిన లక్ష్యములలో పొరపాటులు కాననగును. 531—536.పు. వ్యా.సం.స. 1235 పుట. సంస్కృతపదేన పరిమిత మిత్యాదికి చేయబడిన వ్యాఖ్య కేవలము (ప్రామాదికము. 541పు. వ్యా.సం.స. 1183—1187 పు. వసతిః—అనుదానికి 'ఉన్న'అనియు అస్తిః—అను దానికి 'కల'అనియు అర్థములు చెప్పుట తప్పు. 555 పు. వ్యా.సం.స.133 పు. నుతింపుచున్నాడు—వంటి రూపములను చింతామణి సమ్మతములుగా సాధించుట సరికాదు. 558 పు. వ్యా.సం.స. 161పు. (పణమ—అనువర్త—చుంబ — మున్నగు వానిని సంవృతి ధాతువులలోచేర్చుట యుక్తము.561–563 పు. వ్యా.సం.స. 1542 పు. తలంపుదయ్యె. వైచెదువు. మున్నగురూపములు నన్నయసమ్మతములను వివరణము తప్పు. 593—594 పు. వ్యా.సం.స. 138పు. లఘ్వ్యేకాక్షరేత్యాది చింతామణివ్యాఖ్య సరికాదు. 597 పు. వ్యా.సం.స. 1500 పు. ఇంచుక్వరకత్వము నందలి ఇత్త్వసాధనమార్గము (గాహ్యము కాదు. 598పు. వ్యా.సం.స.1512 పు. అసంబంధః—అను దాని ఏకారాది సంబంధరహితమను వ్యాఖ్య అ(పసక్తము. 609పు. వ్యా.సం.స. 1424పు. తుమున్నర్థకేత్యాది వ్యాఖ్య పొరపాటు.617 పు. వ్యా.సం.స. 1458 పు. మాచే ఘటింపబడియెన్ — అనుదానికి మాకు ఘటింప బడియెన్—అన్నది పర్యాయమనుట అ(గాహ్యము.619పు. వ్యా.సం.స.974— 975 పు.

క్వచి(త్పత్యయయోగేపీత్యాదికారిక షష్ఠీ భవే ద్వితీయాతుల్యేత్యాది చింతామణి సూ(తమునకు సంబంధించినది. అహోబలపతి (గహింపలేదు. వ్యా.సం స. 208, 1035పుటలు. త(తాచ్యుతోభవే న్నిత్యం—అను కారికను అహమాదీనాంద్విత్వమ్— అనుచోట సమన్వయించుట పొరపాటు. ఇది సామానాధికరణ్యేషు—అనుదానికి సంబంధించినది. వ్యా.సం.స. 350 పు. శబ్దేభ్య—ఇత్యాదికారికను విషయనిమిత్త జేత్యాది సూ(తముతో సమన్వయించుట సరికాదు. వ్యా.సం.స. 1172 పు. ల్వాదివర్ణకే—అను దళమును ఉతోమా(తేత్యాది సూ(తముతో అన్వయింపక పోవుట పొరపాటు. 342 పు. వ్యా.సం.స. 553 పు. నైకవర్ణేన దేశ్యేపి—అనుకారికను అం(ధశబ్ద చింతామణి సూ(తమునకే అనువాదముగా అహోబలపతి సమన్వయించెను. దీనిని స్థలాంతరమున అన్వయింపవలెను. వ్యా.సం.స. 512 పు. సబిందుకస్యే—త్యాదికారికను క్వచిదమహతోపి అనుచోట సమన్వయింపక పోవుట సరికాదు. వ్యా.సం.స. 710 పు. విశేషణానాంమహత— ఇత్యాది కారికను ఏకాదులవిషయమున ఉపయోగింపరాదు. వ్యా.సం.స. 710 పు. క్వచిద్ధుణ్మా(తకే— అను కారికను ఏకశబ్దవిషయమా(తమున వినియోగించుట సరికాదు. వ్యా.సం.స. 708, 710 పు. తయోశ్చసాశా—ఇత్యాదికారికను ఏకత్వేచ బహుత్వేచ— అను కారికకు సంబంధించినట్లు సమన్వయించుట తప్పు. ఇది ఏకత్వేచ భవేద్వా రుః— అను కారికకు సంబంధించినది. వ్యా.సం.స.—861, 862 పు. ఉతో లోపశ్చ—అను దానిని అహోబలపతి సరిగా సమన్వయింపలేదు. వ్యా.సం.స. 714పు. దుద్యాదివర్ణ ఇత్యాది కారికను భావి(కియాను అనుకారికకు తరువాతి దానినిగా సమన్వయించుట సరికాదు. దీనిని (ప్రథమైకస్యైర్యద్భవేదిత్యాది చింతామణి సూ(తమునకు నవరణగా సమన్వయింపవలెను. వ్యా.సం.స. 1340పు. ఇంతవరకు అహోబలపండితుని పొరపాటులు కొన్ని సూచనామా(తముగా తెలుపబడినవి. అహోబలపండితీయమును పురస్కరించుకొని, కొన్ని చర్చనీయాంశముల నిట సంక్షేపముగా (ప్రదర్శించుచున్నాను.

అద్దంత్య స్తాలవ్య శ్చుర్వ్ర(క స్స్యేన్మిథ స్సవర్ణశ్చ అను చింతామణి సూ(తము దంత్యచజలనుగూర్చి కొన్ని నియమములను చేయుచున్నది. దంత్యచజలు అకార విశిష్టములయియుండును. తాలవ్య చజలు ఎకార

విశిష్టములయి యుండును. ఇట్లు నియమించుటచే అకార విశిష్టచజలను దంత్యములుగానే పలుకవలె ననియు ఎకార విశిష్ట చజలను తాలవ్యములుగానే పలుకవలెననియు స్పష్టపడుచున్నది. జలగ జడ మున్నగువాటిని నేటివారు తాలవ్యములుగా ఉచ్చ రించుట కలదు. ఇది అపభ్రష్టోచ్చారణ. ఏలన అకార విశిష్టచజలను దంత్యములుగానే పలుక వలెనని చింతామణి నియమించుచున్నది. తాలవ్యోచ్చారణ మును సమ్మతించు కవి ఎకార విశిష్టచజలనే వాడును. జలగ—ఇందలి జకారమును దంత్యముగానే పలుకుట కవి సమ్మతము "జలగ దిగిచినట్లు కొనఁగఁ జను నిల పొమ్మున్" అని తిక్కన జకారమును యతిలోవాడెను. తాలవ్యోచ్చారణము సమ్మతమేని జెలగ — అని ఎత్వ విశిష్ట జకారమునే వాడునన్నమాట. ఈదంత్య తాలవ్యోచ్చారణ భేదమువలన రెండురకములగు రూపము లేర్పడవచ్చును. జలగ—జెలగ; కంచెల—కంచల; అచ్చెరువు—అచ్చరువు; చెమట—చమట— అను జంటల నిందు కుదాహరింపవచ్చును. ఈవిషయమును గ్రహింపక సూరి సూత్రాంధ్రవ్యాకరణమున "అక్కాదిషు" అని సూత్రించెను. చింతామణివిరుద మును కవిప్రయోగవిరుద్ధమును అగుటచే ఈ సూరి సూత్ర మవిచారమూలకము; అగ్రాహ్యము అనక తీరదు.

ప్రాకృతే తద్భవే చాపి చజౌ దంతభవౌ స్మృతౌ— అను అధర్వణకారికలోని ప్రాకృతశబ్ద మాంధ్రదేశ్య పరమని అహోబలపతి గ్రహింపలేదు. ప్రాకృతభాషయే అర్థమని వ్రాయుట పొరపాటు. తద్భవదేశ్యములలోని చజలు దంత్యములనుటచే సంస్కృతసమమునందలి చజలు దంత్యములు కావని తెలియుచున్నది. ఈ అధర్వణాశయమును సూరి గ్రహింపలేదు. దంత్యో చ్చారణము తత్సమత్వభంజకమని సూరికి తోచ లేదు. జన్నము—మున్నగువాటిని తద్భవములుగా చూపియు ఇట అపభ్రష్టోచ్చారణను ప్రమాణీకరించి సంస్కృతసమములయందు ఇకారాంతశబ్దముల ఉపధా చజలు బహువచనము పరమగునపుడు దంత్యము లగునని సూరి సూత్రించెను. ఈసూత్రమును గ్రాహ్య మనరాదు. రాజు శబ్దము దంత్యయుక్తంబు కానంబడి యెడి— అను సూరివాక్యము బొత్తిగా అసంగతము. తత్సమ రాజు శబ్దము నందలి జకారము తాలవ్యము. వైకృత రాజు శబ్దమునందలి జకారము దంత్యము. వైకృత రాజుశబ్దమే కాదనియు తత్సమ రాజు శబ్దము నందలి జకారము దంత్యమే అనియు బాలవ్యాకరణ సమీక్షకులు చర్చించిరి. వారివాదస్వరూప మిట కొలదిగా విమర్శింపబడుచున్నది. రాజు—అను తత్సమ రూపమునే పూర్వలాక్షణికులు చెప్పిరి. వైకృతరాజు శబ్దము కలదని చెప్పలేదు గాన వైకృత రాజు శబ్దమే లేదు— అన్నది ఒక యుక్తి. వైకృత రాజు శబ్దమును పేర్కొన్నలాక్షణికులు కలరని వీరు గుర్తింప లేదు. రాజు— అను తద్భవరూపము కవిసంశయవిచ్ఛేదమున సాధింపబడియున్నది. కేతన ఆంధ్రభాషాభూషణములో దేశితెనుగున కిచ్చిన ఉదాహృతులలో "వలరాజు" అన్న దొకటి కలదు. ఈదేశి తెనుగులోని పదములు వైకృతములు కావచ్చును గాని సంస్కృత సమములు కారాదు. కావున కేతన 'రాజు' అను వైకృతశబ్దమును పేర్కొన్నట్లు తేలుచున్నది. కానీ వీరి వాద మపరిశీలన మూలకము. ఒకేశబ్దమును తత్సమము తద్భవము అగుననలేము—అన్నది రెండవయుక్తి. నిజమే కాని యిట ఒకేశబ్దమును తత్సమము తద్భవము అగునని అనలేదు. తాలవ్యజకారయుక్తరూపమును తత్సమ మని దంత్య జకారయుక్తరూపమును తద్భవమని అనుటలో వైరుధ్యము లేదు. ప్రకృతివర్ణముల పరి ణామము లేనిదానిని వైకృత మనుట సమంజసము కాదు— అన్నదిమూడవయుక్తి. వికృతిలక్షణమగు దంత్యత కనబడుచుండగా ప్రకృతి వర్ణముల పరిణా మము లేదనుట అవిచారితరమణీయము. మంచము— జగము— లంచము— పంజరము— మజ్జనము— మున్నగువాటిలో తాలవ్యచజలతోడిరూపములుసంస్కృత సమములు. దంత్యచజలతోడిరూపములు వైకృతములు. ప్రకృతివర్ణముల పరిణామము దంత్యతయే. ఇట్లే తాలవ్య జకారయుక్తమగు 'రాజు' శబ్దము సంస్కృతసమము. దంత్య జకార యుక్తమగు రాజు శబ్దము వైకృతము. యయాతి చరిత్రమున అనవ ధానతవల్లనో మరి యే అవసరమువల్లనో రాజు శబ్దము దొరలినది. ఇది ప్రమాణము కాదు—అన్నది నాలవ యుక్తి. పోనీ ! యయాతి చరిత్ర ప్రయోగము అప్రమాణమే అందము. అంతతో వైకృత రాజు శబ్దము లేకుండ పోవునా ? "అచ్చతెలుఁగు కావ్యముల ప్రయోగములే కాక భారతాది గ్రంథములలోని వల రాజు మున్నగు ప్రయోగములందలి సమాసములును 'రాజు' అన్నది తత్సమమె య్యైనపుడు సాధువులు కానేరవు గదా !" (వై. పా.92 పు) దేశి తెనుగునకు

కేతన 'వలరాజు' శబ్దము నుదాహరించి యున్నాడు గదా ! యయాతి చరిత్ర ప్రయోగమును అప్రమాణ మనుట ఎట్లు చెల్లును ? ఖగరాజు— మున్నగు వాటినిబట్టి తత్సమ రాజు శబ్దము కలదనక తీరదు. వలరాజు మున్నగువాటినిబట్టి వైకృత రాజు శబ్దము కలదనక తీరదు. తత్సమ రాజు శబ్దమునందలి జ కారమును దంత్యముగా పలుకవలె నన్నచో తద్భవ రాజు శబ్దమున తద్భవత్వ బీజమే లేకపోవలసి వచ్చును. తత్సమ రాజు శబ్దమునకు తద్భవ రాజు శబ్దమునకు దంత్యతయే ఆకారభేద మనుటకంటె గత్యంతర మేమున్నది ? "సూరి పొరపడి దంత్యత నంగీకరించినంత మాత్రమున నిన్ని యపమార్గములు ద్రొక్క వలయునా ?" (వ్యా. సం. స. 82 పు) ఈ చర్చను బట్టి సంస్కృత సమముల యందలి చ జ లు తాలవ్యములే గాని దంత్యములు కానేరవని సిద్ధాంతిత మగుచున్నది. ప్రాకృతే తద్భవే చాపీ త్యథర్వణకారిక యిందుకు పరమ ప్రమాణ మగుచున్నది.

మిథస్సవర్ణశ్చ—అను సూత్రమును బాలసరస్వత్యప్పకవులు యతిప్రాసమైత్రిపరముగ అర్థము చేసిరి. అహోబలపతి 'యతిప్రాస యో స్సర్వత్ర' అనెను. సర్వత్ర అనుటచే శబ్దశాస్త్ర పరమగు అర్థమును లభించునను శ్రీ వెంపరాల వారి పీఠిక బాగుగనే యున్నది. సూత్రద్వయే సవర్ణత్వాత్—అను అథర్వణ కారిక శబ్దశాస్త్ర పరమగు అర్థమును వివరించుచున్నది. ఈ మిథ స్సవర్ణశ్చ—అను దళమును వ్యాకరణ పరముగను యతిప్రాస మైత్రి పరముగను అన్వయించుటయే గాక శ్లేషయమకాదులలో దంత్య చజలకు ఐక్యము చెప్పవచ్చు ననుటకున్నూ ఉపయోగించుకొనుటలో బాధ కనబడదు. వై—పా. 580—581 పు.

చింతామణి అలఘు లకారమును అలఘు రేఫమును వర్ణాంతరములుగా అంగీకరింపలేదు. సూరియు చింతామణినే అనుసరించెను. వీటిని వేరు వర్ణములే అనరాదా ? అన్న ఆశయ మొకటి కలదని బాలవ్యా. సమీక్షకులు వ్రాసిరి. ఉత్పత్తి స్థాన కరణాదులలో భేదము లేకుండుటచే యవలతోపాటు అలఘు లరలును పృథగ్వర్ణములు కానేరవు. పృథగ్వర్ణములే అనరాదా ? అన్న సందేహము శిక్షాశాస్త్ర సిద్ధాంతముల నాఘ్రాణింపమికి నిదర్శనము. ఇట్టి ఆశయము నుదాహరించిన బాల. సమీక్షకులు దీనిని ప్రత్యాఖ్యానము చేయకపోవుట అపరిశీలన మూలక మనక తప్పదు. వై.·పా.385—397, వ్యా. సం. స. 27—31; 131—138 పు.

అహోబలపతి తద్భవములలో శకటరేఫము కలదనెను. 357 పు. ద్విరేఫవర్ణ దర్పణ కర్తయు తద్భవములలో శకటరేఫము నంగీకరించెను. అప్పకవ్యాదుల అనురోధమున సూరి తద్భవములలో శకటరేఫము లేదనెను. తద్భవములను మేనమామ పోలికలనియు రేఫఱ కార సీసమాలికలను కొండగుర్తులనియు నిరసించుచు బాలవ్యా. సమీక్షకులు సూరి వాక్యము నిలబెట్టుటకు యత్నించిరి. "సూరి తన నిఘంటువున కాఱియు శబ్దము కారికా శబ్దభవమని వ్రాసి "క్వచి త్తద్భవేపి శకటో దృశ్యతే"— అని వ్రాసికొని యున్నాడు" అని త్రి. శే. సమీక్షలో శ్రీ వెంపరాలవారు తెలిపియున్నారు. (భారతి 1964 జులై). కాన బాలవ్యా. సమీక్షకుల ధోరణి ఎట్టిదో వేరే వ్రాయనక్కరలేదు. అహోబలపతి వాక్యము నిర్వివాదముగ గ్రాహ్యము.

వికృతౌ సర్వే శబ్దాః క్లీబసమాః స్త్రీ సమాశ్చ నాన్యే స్యుః—అను సూత్రమునకు అహోబలపతి చేసిన వ్యాఖ్య సరికాదు. వ్యా. సం. స. 702 పు. సూరి స్త్రీ సమములు క్లీబసమములు పుంలింగతుల్యములు అని విభజించెను. ఆచ్ఛికముల విషయమున 'సమ' శబ్దమును తత్సమముల విషయమున 'తుల్య' శబ్దమును వాడి సూరి సాంకర్యములేని రచన చేసెనని బాలవ్యా. సమీక్షకులు వ్రాసిరి. అల్పసంఖ్యాకము లగుటచే పుంలింగతుల్యము లన్నట్లు వ్రాసిరి. పుంలింగ సదృశములని సాంకర్యములేకుండ వ్రాయక అల్పసంఖ్యాకము లయినంత మాత్రమున పుంలింగ తుల్యములని సాంకర్యము తెచ్చుట సమర్థనీయము కాదు గదా ! సంస్కృత ప్రాకృత తుల్యంబగు భాష తత్సమంబు—అను చోటను తుల్య సమ శబ్ద సాంకర్యము కలదు. యోధా సురాది శబ్దానాం స్త్రీ సమత్వ మిహోచ్యతే—అని అథర్వణుడు తత్సమ విషయమున కూడ స్త్రీ సమ శబ్దమును వ్యవహరించెను. ప్రక్రియలో చిక్కు లేనప్పుడు వ్యవహార సాంకర్య మున్నను క్షతిలేదని అథర్వణుడును తదనుయాయి సూరియు తలంచి యుందురు. అల్ప సంఖ్యాకము లగుటచే పుంలింగతుల్యము లనెనను బాల వ్యా. సమీక్షకుల సమర్థన సరికాదు.

న వికృతి శబ్దాత్ పరతః సాంస్కృతికానాం భవన్తి గసడదవాః—అనుదానికి అహోబలపతి అప

వ్యాఖ్య చేసెను. సూరియు తెనుఁగుల మీఁది సాంస్కృతిక పరుషంబులకు గసడదవలగు—అని సూత్రించెను. ముఖము+చంద్రతుల్యము—ముఖము సంద్రతుల్యము—కావలసి వచ్చుచున్నదే ! యీ సూత్ర మెట్లు సరిపడును ? అని బాలవ్యా. సమీక్షకులు వ్రాసిరి. సూరి చింతామణి సూత్రమును తప్పుగా అర్థము చేసికొన్న వాడగుటచే పై రీతిని సూత్రించెను. ముఖము సంద్రతుల్యము—కావచ్చుననియే సూరి ఆశయము. అతఁడు సక్రపాణి—అన్నది సూత్రము తప్పని అతని అభిప్రాయము ! "సంస్కృతంబు మీఁదనే సాంస్కృతికంబులకు—గసడదవ లగు" అని సూరి ఆంధ్రశబ్ద శాసనమున స్పష్టముగా సూత్రించి యున్నాఁడు. కనుక బాలవ్యా. సమీక్షకులకు సూరి హృదయ మవగతము కాలే దనవలెను. న వికృతి శబ్దాత్—అను సూత్ర వ్యాఖ్యకు—చూడుడు చిం. పరి. అనుబంధము.

లోపల నిర్ధారణోద్భవా షష్ఠీ—అను సూత్ర వ్యాఖ్యలో అహోబలపతి దేవతల లోపల శ్రీకాంత యధికురాలు—అని సరిగానే యుదాహరించెను. సూరి లోపల వర్ణకము నుభయ వచనములలో చేర్చెను. నిర్ధారణమున ఏకవచనము పాణిని సూత్రములలో కలదు. కాని అది ఆయా సూత్రములలోనే సాధువని వ్యాఖ్యాతలు తెలిపిరి. ద్వంద్వః సామాసికస్య చ—అను భగవద్గీత ప్రయోగమును ఆర్షమే, కాని శాస్త్ర సమ్మతము కాదు. నన్నయయే నిర్ధారణమున ఏక వచనములు వాడెనని బాలవ్యా. సమీక్షకు లుదాహరించిరి. (1) అచ్చన్వలోన నిద్రాసక్తు లైనవారు. (2) అమ్మౌని సంఘంబులోన రామానుచరుండయిన యకృతవ్రణుండను ముని— ఆరణ్య 1—110; 3—127 ఈ రెండుదాహరణములలోను 'లోపలన్' అను విభక్తి ప్రత్యయమే ప్రయుక్తము కాలేదు గదా ! లోపల విభక్తిలో ఆద్యక్షర శేషము వలన 'లోన్' అను రూపము సిద్ధించును గాని 'లోనన్' అను రూప మెట్లు సిద్ధించును ? లోనన్—అన్నది లోను శబ్ద సప్తమ్యేకవచన రూపముగాని షష్ఠీ ప్రత్యయము కాదే ! వీరికి లోను శబ్దతత్త్వము అవగతము కాలేదనుటకు వీరి 'లోపడు' శబ్దముల వాడుకయే నిదర్శనము. నిర్ధారణమున ఏకవచనముపై లోనన్—లోపల—అను దేశ్య శబ్దములు నిలువవచ్చు ననుటకు ఈ ప్రయోగములు సాధకములు కావచ్చును గాని లోపల—లోన్—అను విభక్తి ప్రత్యయములు నిలువవచ్చు ననుటకు కాదు. మనుష్యుల లోపల క్షత్రియుండు శూరుండు—అను వాక్యము నందలి 'లోపల' అనునది షష్ఠీ ప్రత్యయము. మనుష్య సముదాయములోపల క్షత్రియుండు శూరుండు—అను వాక్యమునందలి 'లోపల' అనునది దేశ్య శబ్దమే కాని షష్ఠీ ప్రత్యయముకాదు. ఇందుకు ముని సంఘంబులోనన్—అను నన్నయ ప్రయోగమే ప్రమాణము. ఆర్ష ప్రయోగములను చూచి సూరి లోపల వర్ణకము నుభయములలో చేర్చుట అవిచార మూలకము.క బాలవ్యా. సమీక్షకులు 'లోనన్' అను దానిని షష్ఠీ ప్రత్యయమని భ్రమించి స్వవాదానుకూల మనుకొని యీ ప్రయోగములు చూపిరి. ఇవి వారి వాదమునకు సాధకములు కావు సరే గదా మిక్కిలి బాధకములు.

వికృతౌ క్వచిచ్చ లోపో మోః దీర్ఘశ్చాత ఆదిమస్య భవేత్—అని నన్నయ సూత్రించెను. సూరియు ప్రయోగ వైరళ్యమునే వక్కాణించెను. (తత్సమ 43) కాని ప్రయోగ బాహుళ్యము కలదనిబాల ఉద్ద్యో—తము. కాదని బాల. సమీక్ష. ఈ బాలవ్యా. సమీక్షకులు ప్రయోగాన్వేషణము చేయకయే ప్రయోగ వైరళ్యమే కలదని వ్రాసిరి. ప్రయోగ బాహుళ్యము కల దనుట కాధారాంతరము లేదనిరి. కాని లేకపోలేదు. ఆముక్త మాల్యదకు శ్రీ వేదంవారు వ్రాసిన పీఠికలో సుమారు వంద ప్రయోగములు చూపబడి ప్రయోగ బాహుళ్యము నిరూపింపబడి యున్నది. తల్లీ యిన్ని దినాల కేనియు .... పెల్లాకొన్నతనాన నే నొకఁడనే భిక్షానకున్ వత్తునో—అని శ్రీనాథు డొకే పద్యమున మూడుసార్లు ప్రయోగించెను. ఇది ప్రయోగ బాహుళ్యము కలదనుటకే నిదర్శనము. ప్రయోగ వైరళ్య మనరాదను ఆక్షేపణ చింతామణికిని చెంద వలసి వచ్చునని వీరు వ్రాసిరి. చింతామణి నాటికి ప్రయోగవైరళ్యమే కలదని వీరు గ్రహింపలేదు.

ప్లుతః స్యాత్సంబుద్ధావిత్యుతాం విదుః కేచిత్—అని నన్నయ ప్లుత శబ్దమును వాడెను. ఇచ్చటి ప్లుత శబ్దమునకు దీర మే అర్థమనియు ప్లుతమను వ్యవహారము దీర్ఘప్లుతముల అభిన్నతను సూచించుననియు సర్వస్వకర్తలు వ్రాసిరి. సూరి ప్లుతమును విధించుట పొరపాటనిరి. చింతా

మణివ్యవహారమును సమర్థించి సూరి వ్యవహారమును సరికాదని లఘూకరించుట సరికాదనియు పరిశోధనములలో పక్షపాతములు పనికిరావనియు బాలవ్యా. సమీక్షకులు విమర్శించిరి. సూరిగారు ఓ విష్ణూ 3, ఓ శంభూ 3 అని మూడంకెలతో సహా ఉదాహరణములు చూపుచుండగా ఆయన ప్లుత శబ్దమును ద్విమాత్రాకాలికముగానే భావించెననుటకు అవకాశ మేమున్నది ? పక్షపాతప్రసంగములు పరిశోధకులలో సమీక్షకులలో స్పష్టమే. చింతామణిలోని ప్లుతశబ్దమును త్రిమాత్రాకాలికముగానే అహోబలపతి వ్యాఖ్యానించుట సరికాదు. దీరమాత్ర పరమనుటలో బాధలేదు.

ఉర్ధ్వన్ద్వేరః—అను సూత్రమును వ్యాఖ్యానించుటలో అహోబలపతి 'రః స్యాత్' అని సరిగానే వ్రాసెను. అనువాదకులు రః—రేఫము—అని వ్రాయుట తప్పని చెప్పియే యుంటిని. సూరి 'ర వర్ణంబు' అనెను. సమాస 24. బాలవ్యా. వ్యాఖ్యాతలును ర వర్ణమనుదానిని రేఫము—అనియే వ్యాఖ్యానించిరి. సూరి హృదయమును ఆవిష్కరించుటకు పూనుకొనిన బాలవ్యా. సమీక్షకులును రేఫము—అనియే వ్రాసిరి. మాత్ర పితలు—అను రూప మెట్లు సిద్ధించు ననుకొనిరో తెలియదు. సూరి ఆంధ్రశబ్ద శాసనమున "వర్ణ శబ్దంబుచే సస్వరంబునకు గ్రహణంబు" అని సూత్రించెను. వీరదియు చూచుకొనలేదు. రః—ర వర్ణము—అనుట ఒప్పు.

ఇయాంతత్వే కుత్రచిత్ స్యాదత్వం యశ్చాపి తద్భవే—అని అధర్వణకారిక వచించుచున్నది. ఒక్క ముత్తియ శబ్దముననే ఇత్వ లోపము కలదని సూరి వక్కాణించెను. దివ్య, కళ్యము, పళ్యము మున్నగు ప్రయోగములను త్రి. శే. కర్త చూపెను. బాలవ్యా. సమీక్షకులు — నేడు కంటఁబడు పాఠము కవిదో! లేఖకునిదో! పాఠకునిదో! పరిష్కర్తదో! ముద్రాపకునిదో! అని వ్రాసి తమ పాక్షిక దృష్టిని, సత్య విముఖతను వెల్లడించిరి. అధర్వణకారికకు లక్ష్యములయిన తిక్కనాదుల ప్రయోగములను అపపాఠములని నిర్మూల ప్రసంగము చేయుట పరమ సాహసము. అహోబలపతి రాఘవ పాండవీయమునుండి ఉదాహరించిన 'కన్య' శబ్దమునే సూరి జారవిడిచెను. మహా సముద్రమువంటి భారత

మున కొన్ని ప్రయోగములు చూచుకొనక పోవుట యెవ్వరికైనను తటస్థించును. సూరి యీ ప్రయోగములను చూచుకొనలేదనుట ఒక కొరత కానేరదు. సూరి సూత్రమునందలి అంత శబ్దమునకు 'అంతర్' అనుదాని అర్థము కలదని చెప్పి చెల్లియలు=చెల్లెలు—అను రూపమును బాలవ్యా. సమీక్షకులు సాధించిరి. వీరు చూపిన ప్రయోగములు నిర్వాహకములుగా కన్పట్టవు. సూరి కట్టి అభిప్రాయమే ఉన్నచో నామ మధ్యమున ఎత్వము వచ్చు ఉదాహరణమును చూపియే యుండును. వీరిది కిట్టింపు పద్ధతి. ఈ పక్షమున చెల్లియలు=చెల్లెలు—కావలసి వచ్చును. కావలసినచో బహుళ గ్రహణముచే నామ మధ్యమున ఎత్వము వచ్చుననుట లెస్స.

హనుమానుఁడు భగవానుఁడు—అనువాటిని అహోబలపతి సాధించిన ప్రక్రియ సరికాదు. హనుమత్—అను ప్రాతిపాదికమునుండి బాలవ్యా. వ్యాఖ్యాతలు హనుమానుఁడు — సాధించిరి. హనుమంతవ్—అను ప్రాతిపదికమునుండి హనుమంతుఁడు—అనుదానిని సాధించిరి. భిన్న ప్రాతిపదికమునుండి నిష్పన్నములయిన రెండు శబ్దములు ఒకదాని కొకటి రూపాంతరములెట్లగును ? అని బాలవ్యా. సమీక్షకులు ప్రశ్నించిరి. ఇంద్రజిత్—అను ప్రాతిపదికములనుండి నిష్పన్నములయిన ఇంద్రజిత్తు—ఇంద్రజీ అను రూపములకు ఇంద్రజితవ్—అను ప్రాతిపదికమునుండి నిష్పన్నమయిన ఇంద్రజితుఁడు—అను రూపము ఎట్లు రూపాంతర మైనదో యిదియు అట్లే అయినదని సమాధానము. (తత్సమ 79) సంస్కృత ప్రాతిపదికమును గ్రహింపరాదన్న పక్షమున వీరు సాంతములలో సంస్కృత ప్రాతిపదికమును గ్రహించుట తప్పు. సాంతములతో ప్రథమైక వచనతుల్యమే ప్రాతిపదికమన్న పక్షమున 'హనుమంతవ్' అను దానిని గ్రహించి ప్రక్రియా గౌరవమునకు పాల్పడుట కొంత సమర్థనీయము కావచ్చును.

న్నుమ్ముమ్మా హ్రస్వ శ్చాదే రమి శ సిచ—అను చింతామణి సూత్ర వ్యాఖ్యలో అహోబలపతి న్నుమ్ముమ్మలను ఆదేశములని వ్యాఖ్య చేసెను. బాలవ్యాకరణమున 'నన్నును' అను రూపము నిపతింపబడెను. సూరి మతమున న్నుమ్ముమ్మలు ఆదేశములే అని శబ్దలక్షణ సంగ్రహమును శబ్దశాసనమును బాలవ్యాకరణ సమీక్షకులు చూపిరి. ఈ పక్షమున నన్నును—అను రూపము బాలవ్యాకరణముచే ఎట్లు సిద్ధించునో వీరు చెప్పలేదు. బాలవ్యాకరణమున తృతీయాదులకు నుగాగమంబగు—అని సూత్రింపబడెనే కాని ద్వితీయకు నుగాగమము విధింపబడలేదు. కాన ద్వితీయా నువర్ణకమునకే 'న్ను' ఆగమ మనవలెనా ? (వ్యా. సం. స. 213 పు.) నుగాగమముతో సహా 'నన్నును' అను రూపము నిపతింపబడె ననవలెనా ? ఏ మనవలెనో బాలవ్యా. సమీక్షకులు చెప్పలేదు. కాని 'చింతామణి మతమున న్నుమ్ముమ్మ లాదేశములే' అని చర్చించిరి. ఈ చర్చ యేనాఁడో పరాస్త మయినదే కాని క్రొత్తది కాదు. న్నుమ్ముమ్మ లాగమము లనుటయే చింతామణి సమ్మతమును భారత ప్రయోగానుకూలమును అయియున్నదని వీరికి అవగతము కాలేదు. చిం. పరి. అనుబంధము చూడనగును. ఆదేశములను అహోబలపతి వ్యాఖ్య అంగీకార్యము కాదు.

చింతామణిలోని లుక్కు మిత్తు డిత్తు—అను సంజ్ఞలు బాలవ్యాకరణ సమీక్షకులు సరిగా లేవని వ్రాసిరి. పాణినీయమునకు విలక్షణముగా లుక్కును వర్ణలోప సందర్భమున వాడుటచే నన్నయకు పారిభాషికపదవ్యవహారమున జాగరూకత లేదనక తప్పదనిరి. సూరి సూత్రాంధ్ర వ్యాకరణమున లుక్కును ఇట్లు వాడుట చింతామణి పరిచితినిబట్టి యనియు బాలవ్యాకరణమున ఎల్లచోట్ల లోప శబ్దమునే వాడిరనియు చెప్పిరి. ప్రత్యయలోపము చెప్పు చోట్ల లుక్కును, ఇతర వర్ణముల విషయమున లోప శబ్దమును సూరి విడివిడిగా వాడనే లేదు! లుక్కును వర్ణలోప సందర్భమున వాడుట ప్రాకృత వ్యాకరణ పద్ధతి "ప్రాయోలుక్ కగచతదపయు వామితి—అని అహోబలపతి చూపిన వాల్మీకి సూత్రము కవిశిరోభూషణమునవే కలదు. 407 పు. చండుని ప్రాకృత వ్యాకరణమున "కగచజత పయతాం ప్రాయోలుక్" (వ్యంజన 38 సూ.) అని కలదు. త్రివిక్రమ ప్రాకృత శబ్దానుశాసనమున—జ్ఞకార సంబన్ధినో ఞ కారస్య లు గ్బవతితు— (1–4–82) అనియు, "ద్వారే దకార వకారయోః పర్యాయేణ లుగ్బవతితు (1–4–83) అనియు కలదు. ఈ ప్రాకృతవ్యాకరణములందలి లుక్కునే నన్నయ గ్రహించియుండును. ఇట్లే మిత్తు పాణినీయానుసారి యనుకొని యీ బాల. సమీక్షకులు ఏమేమో వ్రాసిరి. "మిదన్త్యే—అను ప్రాకృత సూత్ర సంప్రదాయము చొప్పున నుమ్ము

మిత్తుగాన నంత్యావయవముగా నగును" అను సర్వస్వకర్తల వాక్యము నైనను వీరు చూడలేదు. వ్యా. సం. స. 336 పు. సూరిగారి ఇద్వర్ణ లక్షణము పాణినీయానుసారి యనుకొని సూరిగారికి పారిభాషిక పద వ్యవహారమున జాగరూకత లేదన్నచో ఎట్లుండునో వీరి యీ ప్రసంగములును అట్లే ఉన్నవనక తీరదు గదా ! అష్టభాషా వాగనుశాసనునకు వ్యాకరణ సంప్రదాయములు మనమే గదా తెలియజెప్పుటకు అధికారులము ! చింతామణిలోని డిత్తు—అను సంజ్ఞ సరిగా లేదని సూరిగారు దానిని వదలినట్లు ఈ బాల. సమీక్షకులు చెప్పిరి. ఆత్మన ఇమనంతానాం డావా—అను సూత్రమునకు అహోబలపతి చేసిన వ్యాఖ్య సరిగాలేదు. డు స్స్వ్యత్సదా రాజ్ఞః—అన్నదియు కొంత గజబిజిగా నున్నది. సూరిగారికి ఈ 'డిత్తు' ను విధించి నడపిన ప్రక్రియ అవగతము కాలేదని తోచును. సూరిగారు 'రాజు' శబ్దమును సక్రమముగా సాధింపలేకపోవుట యీ ఊహనే బలపరచును. సూరిపక్షమున 'రాజు' శబ్దము ప్రాతిపదిక మన్నచో ప్రత్యయలోపమునకు దారిలేదు. కాదు—ప్రథమాంత మన్నచో ఇతర విభక్తులు చేరుటకు అవకాశములేదు. ఇట్టి స్థితిలో 'డిత్తు' అను సంజ్ఞను సూరి సరికాదని వదలేననుట విశ్వసనీయము కాదు. వ్యా. సం. స. 655 పు. బాలవ్యా. సమీక్షకులు చిన్నయను పెద్ద చేయుటకు నన్నయను చిన్న పరుచు ధోరణి అసంగతము.

ద్వంద్వః కేషాంచి దిష్టః స్యాత్—అనుదానికి అహోబలపతి చేసిన వ్యాఖ్య ప్రామాదికము. బాలవ్యా. సమీక్షకులు ఆ పొరపాటు వాఖ్యను నమ్మికొని యేమేమో చర్చించిరి. వ్యా. సం. స. 1242 పు. ద్రుతాద్రుతః క్వచిచ్ఛాత్ర దృశ్యతే కవిభాషితే—అను దానికి అహోబలపతి చేసిన వ్యాఖ్య తప్పు. నన్నయాథర్వణుల మతమున ద్రుతమన నకార వ్యంజనము మాత్రమే అని అహోబలపతి గ్రహింపలేదు. తావుభౌ రమేశ సమౌ—అను సూత్రమునందలి ఈశతుల్యత్వమునుబట్టి విధాతృనందు—వంటి రూపములు సాధించుకొనవలెనని ఒకానొకరి వాదము. విధాతృనందు—ఇత్యాదౌనుమః ప్రాప్తిస్తు నుమ్ప్రేతి చకారైక్యైవ భవతి—అని అహోబలపతి విధాతృనందు—వంటి రూపముల సాధన మార్గమును తెలిపియున్నాడు. 353 పు. ఈ రూపసాధనమును గూర్చి సర్వస్వకర్తలు వ్రాయలేదని అకాండ తాండవము చేయబడినది. అహోబలపతి వచనము నుదాహరించి సర్వస్వకర్తలు స్థలాంతరమున రూపసాధనమును చూపిరని వీరు చూచుకొనలేదు. వ్యా. సం. స. 564 పు. ఏకాదులలో అహోబలపతి 'ఓండు' అనుదానిని చూపెను. ఉత్వ ప్రసక్తి లేదని కాబోలు అనువాదకులు ప్రశ్నచిహ్న ముంచిరి. 354 పు. నిగాగము నిత్యతకై అహోబలపతి 'ఈ' శబ్దమును ఏకాదులలో చేర్చెను. నిగాగము నిత్యతకై ఈకా ప్రత్యయాంతములను గూడ ఏకాదులలో చేర్చుకొనవలెను. వ్యా. సం. స. 710 పు. చింతామణిలోని ఏకాది గణమే బాలవ్యా. లోని మగాది గణము. కనుకనే సూరి మగాదులలో వ్రే—శ్రీ—ఈకా ప్రత్యయాంతములను చేర్చియుండును. బాలవ్యాకరణ సమీక్షకులకు సూరి హృదయము అంతుచిక్కలేదు. ఇట్టి చర్చనీయాంశము లింకను గలవు.

అహోబల పండితీయము వంటి ఉద్గ్రంథము సమీచీనమును సమగ్రమును అగుట అభిలషణీయము. "ఎవరికి జేతనైనంత వారు దీనికై శ్రమించుచుండఁగాఁ దత్సమిష్టి ప్రయత్నమువలనఁ దత్త్వము కొంత కొంత బోధపడుచుండును" గదా ! విస్తరభీతిచే ఈ సమీక్షను ఇంతతో ముగించుచున్నాను.

వట్టివెదురుమోపు వైచిన చందాన
గుండు గుండుమీద గూలినట్లు
కడిది మ్రోత మేషకంఠీరవంబులు
తాకి తాకి తస్సి తట్టువారె.

(వల్లభరాయడు—క్రీడాభిరామము)

# అనంతవర్మ
# సేపిడిగ్రామ తామ్రశాసనము

**శ్రీ బి. ఎన్. శాస్త్రి**

మూాడు రేకులు గల ఈ శాసనము పూజ్యులు డాక్టర్ గిడుగు సీతాపతిగారు నాకు దయతో నొసంగిరి. ఈ శాసనము శ్రీకాకుళంజిల్లా పాతపట్నం తాలూకాలోని తెంబూరు గ్రామములో లభించినది. శాసన మెప్పుడు ఎవరికి లభించినదో తెలియదు. ఈ శాసనమును చదివి ప్రచురింపదలచిన నాకు అడిగిన వెంటనే యొసంగిన డాక్టర్ గిడుగు సీతాపతి గారికి నా హృదయపూర్వకమైన కృతజ్ఞతలు.

ఈ శాసనమున మూాడు రాగి రేకులు కలవు. ఒక్కొక్క రేకు పొడవు 16.5 సెం. మీ.; వెడల్పు 7.5 సె. మీ. ఈ మూాడు రేకులును ఒక రాగి కడియమునకు దగిలించియున్నవి. కడియము యొక్క చుట్టుకొలత 31.5 సెం. మీ. కడియముయొక్క వ్యాసము 8.5 సెం. మీ. శాసనపు కడియమునకుఁగల ముద్రపైన గల చిహ్నము గుర్తుపట్టరాని విధముగా నున్నది. బహుశః వృషభ లాంఛనమై యుండవచ్చును. శాసనపు రేకుల అంచులు తీర్చియున్నవి. రేకుల మందము 0.4 సె. మీ. శాసనపు రేకులకు ఎడమప్రక్క 1.5 సెం. మీ. వ్యాసముగల రంధ్రములున్నవి. శాసనపు రేకుల బరువు ఈ క్రింది విధముగా నున్నది. మొదటి రేకు తూకము 310 గ్రాములు. రెండవరేకు తూకము 375 గ్రాములు. మూాడవరేకు తూకము 330 గ్రాములు. కడియము సీలుతోకూడి 360 గ్రాములు. మొత్తము శాసనము తూకము 375 కిలో గ్రాములు.

ఈ శాసనమందలి మూాడు రేకులలో మొదటి రేకు రెండవ ప్రక్కనుండి శాసన మారంభమగుచున్నవి. మూాడవరేకు మొదటి ప్రక్కతో శాసన మంతమగుచున్నది. శాసనమునఁగలపంక్తుల మొత్తము సంఖ్య28. మొదటి రేకు—రెండవ ప్రక్క 7 పంక్తులు. రెండవ రేకు—మొదటిప్రక్క 7 పంక్తులు, రెండవరేకు—రెండవప్రక్క 7 పంక్తులు, మూాడవరేకు—మొదటి ప్రక్క 7 పంక్తులు. మొత్తము 28 పంక్తులు.

ఈ శాసనపు రేకుల యంచులు తీర్చియున్నవి. అక్షరములు చెదరి పోకుండుట కీ యంచులు తీర్చబడినవి. రేకులు చిలుము పట్టుటవలన అక్షరములు చెదరిపోయినవి. శాసనము సంస్కృత భాషలో దేవనాగర లిపిలో వ్రాయబడినది. శాసనపు రేకులు కడియమునకు తగిలింపబడినవి. రాజముద్రిక కడియమునకు బిగింపబడినది. మొదటిరేకు రెండవ ప్రక్క నాలుగు, ఐదు, ఆరు పంక్తులలోని కొన్ని యక్షరములు చెదరిపోయినవి. రెండవరేకు మొదటి ప్రక్క ఆరు ఏడు పంక్తులలోని యక్షరములును, రెండవ రేకు రెండవ ప్రక్క మూాడు, ఐదు పంక్తులలోని కొన్ని యక్షరములును చదువుటకు వీలుగా లేవు. ఈ శాసనము కళింగ నగరమునుండి కళింగాధిపతి యగు శ్రీ అనన్తవర్మచే వేయించబడినది.

ఈ శాసన భాషయంతయు సంస్కృతము. మొదటి రేకు రెండవ ప్రక్కనుండి ప్రారంభమగుచున్న ఈ శాసనము మూాడవ రేకు మొదటిప్రక్క మొదటి పంక్తిలోనున్న "పరదానేతి పార్థివ—." అను శ్లోకము వరకు సంస్కృత వచనములో నున్నది. శాసనాంతమున "మాణికహస్త శ్రీ సామన్తేణ లిఖితం" అను వాక్యము వచనములో నున్నది. చివరనున్న శ్లోకములు దానఫలమును తెలుపునవి. మొదటిరేకు రెండవ ప్రక్క మూాడవ పంక్తిలో

కలికలఙ్గో వినయనయసమ్పదా మరిస్పన్దాధిగతస్స' అను వాక్య భాగములో (ఆ రాజ వంశములో) అను పదము లేనిదే యన్వయము కుదురుటలేదు. అట్లే రెండవరేకు మొదటి ప్రక్క ఐదవ పంక్తిలో "సేనిది గ్రామదాన సర్వ్వ కర పరిహార చాడభద అప్రవేశ" అనుచోట క్రియ లేదు. 'దానము చేసెను' అను క్రియాపద ముండవలయును. రెండవరేకు రెండవ ప్రక్క దానమిచ్చిన గ్రామముయొక్క సరిహద్దులు చెప్పునప్పుడు సరిహద్దులవద్ద వర్ణనము మూడవ రేకు మొదటి ప్రక్క మొదటి పంక్తి వరకు నున్నది. అందును ఈ సరిహద్దులు (కలది) అను క్రియా పదము లేదు-(త్వాపోత్తరా మాభూ దపరిశఙ్కావః పరదానేతి పార్థివ—)

## శా స న ము - మూ ల ము



మొ ద టి రే కు - రెం డ వ ప్ర క్క

1. ఓం స్వస్తి సర్వ్వతుఞ సుఖరమణీయా ద్విజయ కలిఙ్గరాధివా
2. సో సకల భువన నిమ్మాలాధిపత్యం భగవతో మహేశ్వర ప్రణామా
3. దపగత కలికలఙ్గో వినయనయ సమ్పదా మరి స్పన్దాధిగతస్స
4. కలకలిఙ్గాధి రాజ్యం శ్చతురుదధి తరఙ్గ మేఖలావు
5. వనితల ప్రథిత తామలయశా నేక సమరసంక్షోభ
6. జనిజయశబ్దో మహేన్ద్ర పరితాప యోగ వైతఋనో
7. గఙ్గమలకుల ప్రతిష్ఠః ప్రతాపాతిశయానామిత సమస్త



రెండవ రేకు — మొదటి ప్రక్క

1. సామన్త చూడామణి ప్రభామఞ్జరీ ప్రరఞ్జిత చరణో
2. మాతా పితృ పాదానుధ్యాత పరమ మాహేశ్వరో మహారాజ
3. శ్రీ అనన్తవర్మ్మణ కలిఙ్గ నగరే మార్గ్గశీర్ష్యామావాస్యా
4. యాం సూర్య గ్రహణే భారద్వాజ గోత్ర గోత్చాదీక్షితాయ
5. సేవిది గ్రామదాన సర్వ్వ కరిపరిహార చాద భద అప్రవేశ
6. విష్ణుశివ ఆచార్య్య భాణుదేవ మహేశ్వర ఊచు భట్టమా
7. చన్ద్రభానుకోమ్మ్ర చ గాముద ఊచ దేవరహా సీఱ త్రైష్పరిక్రా



రెండవ రేకు - రెండవ ప్రక్క

1. న్తం పూర్వ్వేణ తిన్త్రీ వృక్ష ఉరూఘుణ్డై వాసే త్రికూటే పావణ
2. ణా చాద్ర రశ్ర పాషాణా గెరివట అజనన్ద్వ్యాకూ తటాకత్రి
3. కూట। దక్షిణేన నన్ది వాపీ తిన్త్రీరాధన వృక్ష త్రికూట— రి
4. ణేకపాలాని। పశ్చిమేన కరఞ్జ హాలద్ర శిఖరాకృ
5. తి శిలా తిన్త్రీ త్రికూట। ఉత్తరేణ మౌదర వృక్ష తిన్త్ర
6. లీ రజకవాపీ దేవతాయతన ధరణీ పర్వ్వతికా యోత్త
7. రేణ మహాపర్వ్వతికాయా మస్తకేన త్రికూటా త్పూర్వ్వోత్తరా

# అనంతవర్మ సేవిది గ్రామ తామ్రశాసనము



మూడవ రేకు - మొదటి ప్రక్క

1. మా భూద పరిశఙ్కావః । పరదానేతి పార్థివ । స్వదానాత్ప
2. లమానన్త్యం పరదానానుపాలనం । స్వదత్తా మ్పరదత్తా మ్వా
3. యన్నాద్రక్ష యుధిష్ఠిర । మహీ మహిమత శ్రేష దాన్నాచ్ఛ్రేయో
4. ను పాలనం అష్టమేధ సహస్రాణి వ్వాజపేయ శతానిచ గవా
5. —— ప్రదానేన భూమి భర్త్తన శృద్యతి । అన్యాయేవ హృతా । భూమి రన్యా
6. యేనతు హారితా । హరతా హర యన్తశ్వ హరత్యా సప్త
7. మం కులం । మాణికహస్త శ్రీ సామన్తేణ లిఖితం ।౦॥

**లిపి:—**

ఈ శాసనము సంస్కృత భాషలో వ్రాయబడినది. శాసన లిపి ప్రాచీన దేవనాగరలిపి. శాసనపు రేకులకు సంఖ్యలు వేయబడిలేవు. ఈ శాసనము అనంతవర్మ వేయించినది. అనంతవర్మ కుమారుఁడు నన్దవర్మ వేయించిన శాంత బొమ్మాళి తామ్రశాసనమందలి యక్షరము లీ శాసనాక్షరములతో కలియుచున్నవి. ఈ రెండు శాసనములలోని యక్షరములలో నించుక భేదము కనిపించును.

శాసనము మొదట 'ఓం' గుర్తు తెలుగులోని '—' తావత్తువలె నున్నది. శాసనమున '—' వలపలగిలకకు పూర్వాక్షరము ద్విత్వముగా వ్రాయఁబడినది. అను నాసికాక్షరములు అనుస్వారమునకు బదులుగా వాడఁబడినవి.

| | |
|---|---|
| సర్వర్తు | — సవ్వర్తుణ |
| కలింగ | — కలిఙ్గ |
| కలంక | — కలఙ్క |
| నిర్మలాధిపత్యం | — నిమ్మలాధిపత్య |
| సామంత | — సామన్త |
| అనంతవర్మ | — అనన్తవమ్మణ |

## శాసన విషయము:-

ఈ శాసనమున దాతయైన అనంతవర్మ కలింగ రాజ్యాధిపత్యమునుబొంది చతురుదధి తరంగములను మేఖల కలిగిన భూమియందు స్వచ్ఛమగు విస్తారమైన కీర్తిచేత సమర సంక్షోభములందు జయ శబ్దంబుల బొంది మహేంద్రునికి విషాదమును గలిగించునట్టు వైతరణీ నదిని యజ్ఞములందు వదల బడిన నీటితో సృష్టించినవాడును, గజ్గమలకుల మందు ప్రతిష గాంచినవాడును, ప్రతాపాతిశయము వలన లోబరచుకున్న సమస్త సామన్తులయొక్క చూడామణుల కాంతిపుంజముచే ప్రకాశమానములగు చరణములు గలిగినవాడును, మాతా పితృ పాదసేవ చేయు పరమ మాహేశ్వరుడును అని ప్రశంసింపబడినాడు. ఈ శాసనము నీతడు కలిఙ్గ నగరమునందు మార్గ శీర్ష మాసమందలి యమావాస్యయందు సూర్య గ్రహణ కాలమున భారద్వాజ గోత్రికుని క్కొఱకు 'సేవిది' యను గ్రామమును అన్ని పన్నులనుండి తప్పించి అజ్ఞానుల క్రప్రవేశ్యముగా నొనర్చి దానము చేసెను.

ఈ శాసనమున కలింగ నగర ప్రశంస కలదు. ఆ నగరము సర్వర్తువులందు సుఖకరమైనదనియు అహ్లాద దాయకమును దుర్జేయమును అగు నగరమనియు వర్ణింపబడినది. అనంతవర్మ మహారాజు భగవంతుడగు మహేశ్వరునికి భక్తుడు. ఇతనికి పరమ మాహేశ్వరుఁడను బిరుదమున్నది.

దానము చేయబడినది 'సేవిది' యను గ్రామము. ఈ గ్రామము "విష్ణుశివ మతముల కాచార్యులు, భాణుదేవుడు, మహేశ్వర భక్తులు...... వన్దభులు.....దేవరులు......భసీఱులు...." మొదలగు వారిచేత ఆక్రమింపబడినదై యున్నది.

మూడవరేకు మొదటి ప్రక్క మొదటి పంక్తినుండి దానఫలము పరదానానుపాలనము వలన కలుగు ఫలము చెప్పబడినది. "స్వయముగా దానము చేసి దానిని రక్షించుటకంటె ఎక్కువగా రక్షించినపుడే అది పరదానానుపాలనమగును. స్వదత్తమును గాని ఓ యుధిష్ఠిరుఁడా ప్రయత్న పూర్వకముగా (తప్పక) రక్షింపుము. భూమిని నిష్టలును సుత్తమములును నగు వారికి దానము చేయుటకంటె శ్రేయస్కరమైనది పరదానములను రక్షించుటయగును" అని దానఫలము, "పరదానానుపాలనమువలన కలుగు ఫలమును చెప్పిన తరువాత దానచ్ఛేద ఫలము తెలుపబడినది. ఈ శాసనము మాణిక హస్త శ్రీసామన్తచేత వ్రాయఁబడినది.

## కాల నిర్ణయము:-

ఈ శాసనమును మహారాజశ్రీ అనన్తవర్మ కలిఙ్గ నగరమునందు మార్గ శీర్ష మాసమందలి యమావాస్యయందు సూర్యగ్రహణ కాలమున భారధ్వాజ గోత్రుని కొరకు 'సేవిది' యను గ్రామమును దానమిచ్చు సందర్భమున వేయించినాడు. ఇందు గాంగ శక సంవత్సరముకాని, విజయరాజ్య సంవత్సరముకాని, శక సంవత్సరముగాని పేర్కొనబడలేదు. అనంతవర్మ వేయించిన ఇతర శాసనములను బట్టియైనను ఈ శాసన కాలమును నిర్ణయించుటకు వీలులేదు. అనంతవర్మ కాలము నిదివరకే చారిత్రకులు నిర్ణయించినారు. ఈ శాసనమున చారిత్రక సంబంధమైన విశేషము లేమియు లేవు.

## అనువాదము:-

స్వస్తి సర్వర్తువులందు సుఖకరమైనదై యాహ్లాదదాయకమును దుర్జేయమునగు కలిఙ్గ నగరమున నివసించువాఁడును, సకల భువనములకు నిర్మలమైన యాధిపత్యమును, భగవంతుఁడగు మహేశ్వరునికి భక్తుఁడగుటచేత (నమస్కరించుటచేత) కలికలఙ్కములనుండి వెలువడినవాఁడైన నయవినయ సంపదలుకల (యా రాజ వంశములో) శత్రువులను కలచివేయుటవలన కలింగ రాజ్యాధిపత్యమునుబొంది చతురుదధి తురంగములను మేఖల కలిగిన భూమియందు స్వచ్ఛమగు విస్తారమైన కీర్తిచేత సమర సంక్షోభములందు జయ శబ్దంబులఁబొంది మహేంద్రునికి విషాదమును కలిగించునట్లు వైతరణీనదిని యజ్ఞములందు వదలబడిన నీటితో సృష్టించిన వాఁడును, గఙ్గమలకులమందు ప్రతిష గాంచినవాఁడును ప్రతాపాతిశయమువలన లోఁబరచుకున్న సమస్త సామన్తులయొక్క చూడామణుల కాంతిపుంజముచే ప్రకాశమానములగు చరణములు గలిగినవాఁడును— మాతాపితృ పాదసేవ చేయువాఁడును, మాహేశ్వరుఁడును పరమ శివభక్తుఁడును అగు మహారాజశ్రీ అనన్త

# అనంతవర్మ సేవిది గ్రామ తామ్రశాసనము

వర్మ కలిఙ్గనగరమునందు మార్గశీర్షమాసమందలి యమావాస్యయందు, సూర్యగ్రహణ కాలమున భారద్వాజ గోత్రీకునికొరకు సేవిది యను గ్రామమును అన్ని పన్నులనుండి తప్పించి, అజ్ఞానుల కప్రవేశ్యముగా నొనర్చి (దానము చేసెను) విష్ణుశివ మతముల కాచార్యులు భాణుదేవుడు మహేశ్వర భక్తులు........ వన్దభులు......దేవరులు......భసీఖులు...... మొదలగువారిచేత నా గ్రామము ఆక్రమింపఁబడినదై (నివసింపబడుచున్నదై) తూర్పు దిక్కున ఒక తిన్త్రీవృక్షమును (చింతచెట్టు)........పార్వణగిరి.....ప్రపంచ ఖ్యాతిఁగాంచిన.......దక్షిణమున నన్దివాపి దగ్గరనున్న చింతచెట్టును.......పశ్చిమమున.......శిఖరముకల........ కొండదగ్గరనున్న చింతచెట్టును....... ఉత్తరమున... చింతచెట్టును, చాకలివాండ్ర బావియు దిగువ భాగమున దేవాలయములుగల గుట్టకు ఉత్తరమున నున్న పర్వత శిఖరమును కలగి తూర్పునుండి పడమర వరకు పైన చెప్పిన సరిహద్దులు (కలది) ఇతరులచే నీయఁబడిన భూమిని స్వయముగ దానముచేసి దానిని రక్షించుటకంటె ఎక్కువగా రక్షించినపుడే అది పరదానాను పాలనమగును. స్వదత్తమునుగాని పరదత్తమునుగాని యుధిష్ఠిరుఁడా ప్రయత్నపూర్వకముగా (తప్పక) రక్షింపుము. భూమిని నిష్కులును నుత్తములును నగువారికి దానము చేయుటకంటె శ్రేయస్కరమైనది, పరదానములను రక్షించుటయగును. ఎనిమిదివేల వాజపేయ యజ్ఞములు..... ఓరాజా! దానము చేయుటవలన చూఁడడు. అన్యాయముతో నిండినది, అన్యాయముగా నపహరింపఁబడినది అగు భూమి అపహరించిన వానియొక్క.... ఏడు జన్మలను (తరములను) హరించును. మాణిక హస్త శ్రీ సామన్తునిచేత వ్రాయఁబడినది.

వెనుకకు మొగ్గ వ్రాలి కడు విన్ననువొప్పఁగ దొట్టెఁ గ్రేళ్లలో
మునిగి తదంతరస్థమగు ముంగర ముక్కున గ్రుచ్చుకొంచు లే
చెను రసనా ప్రవాళమున శీఘ్రము గ్రుచ్చెను నల్లపూసపే
రనుపమలీల నిప్పుడు చుపాయము లిట్టివి యెట్లు నేర్చెనో!

(వల్లభరాయడు—క్రీడాభిరామము)

## చర్చ :

# విక్రమేంద్ర భట్టారకవర్మ తామ్రశాసనము

శ్రీ బి. ఎన్. శాస్త్రి మొన్నటి జులై నెల భారతిలో విష్ణుకుండిన విక్రమేంద్ర భట్టారకవర్మ ఇంద్ర పాలనగర తామ్రశాసనము ప్రకటించి మరుగైన విష్ణుకుండినుల మరి రెండు శతాబ్దాల చరిత్రను స్పష్టంగా తెలియ జెప్పారు. ఈ శాసనం ఆఖరురేకు 4 వ పంక్తిలో "సాష్టాశీతి చతుశ్శతే శకపతే స్సంవత్స రాణాం గతే" అని 488 శక సంవత్సరాలు గడువగా వేసిందని స్పష్టంగా చెక్కడంవల్ల విక్రమేంద్రవర్మకాలం గురించి ఇక ఎవరికీ సందేహం అక్కరలేదు. ఈ శాసనంలోని సింహుడనే పల్లవుని విజయం మొద లయిన చారిత్రకాంశాల సమన్వయం జరుగవలసి ఉన్నది.

ఈ శాసనం చదువడంలోను చిన్న పొరపాట్లు దొర్లాయి. ఇలాటి అపూర్వ విషయాలు మనవద్ద ఉన్నప్పుడు ఎంత ఆలోచించి లోకానికి తెలిపితే అంత మంచిది; అంత సంతృప్తికరమూను. ఆలస్యం కావడం వల్ల కీర్తికి కలిగే లోపమేమీ లేదు.

### మొదటి రేకు

రెండవ ప్రక్క మూడవ పంక్తి—"షడభిజ్ఞ ప్రతిహార దర్శనానుగ్రహ" అని ముద్రితం.

"షడభిజ్ఞ ప్రతిపాద్య దర్శనానుగ్రహ" అని చదవాలి. షడబిజ్ఞుడు బుద్ధుడు. షడభిజ్ఞునిచే ప్రతిపాద్యమైన దర్శనంయొక్క అనుగ్రహమని ఉత్తర పదాలతో సంబంధం కుదురుతుంది. పాద్య అని అంతగా కొట్టవచ్చినట్టు ప్రతిబింబంలో ఉండగా 'హార' అని ఎలా పొరపాటుగా అనుకోడం సంభవిం చిందో!

7 వ పంక్తి—"పురుష మేధాద్యాహ రహ స్స్వమ్య గనుషిత శృతి......" అని ముద్రితం.

"పురుష మేధాద్యహరహస్స్వమ్యగనుషిత శ్రుతి..." అని చదవాలి. మేధాద్యహ అని ద్య హ్రస్వంగానే ఉంది. శ్రుతి స్పష్టంగా కొమ్ము క్రావడితో ఉన్నది. వట్రువ సుడి కనిపించదు.

### రెండవ రేకు

మొదటిప్రక్క, మొదటి పంక్తి—"ప్రాగ్దక్షిణా పరామ్భోధి (ధిని) రేవా సరిత్సలిల" అని ముద్రితం. నిధి అనేది తప్పని ధిని అని బ్రాకెట్లలో సూచించారు కూడా.

"ప్రాగ్దక్షిణా పరాంభోనిధి రేవా సరిత్సలిల" అని చదవాలి. పూర్వ దక్షిణ పశ్చిమ సముద్రాలు మూడు వైపులా, రేవానదీ జలాలు ఉత్తరాన ఇతని రాజ్యానికి విభూషణాలుగా (ఎల్లలుగా)ఉన్నాయన్నమాట. శాసన ప్రతిబింబంలో "పరామ్భోనిధి" అని స్పష్టంగా ఉంది. అంభోనిధి అని సరిగా చదవనందున అను వాదంలో "తూర్పు దక్షిణ పడమటి భాగములందు రేవానది నీటియొక్క వలయముచే నలంకరింపబడిన" అనే పెద్ద పొరపాటు దొర్లింది.

రెండవప్రక్క, మొదటిపంక్తి—"శేశ (ష)వచవా రోపిత రాజ్యభారః" అని ముద్రితం. అయ్యో! ఎంత పొరపాటయింది తప్పుగా చదవడంవల్ల. "......వచ నముచేత రాజ్యభార మప్పగించి" అని అనువాదం కూడ తప్పయి ఎంతటి అపూర్వమైన చరిత్రాంశం మరుగైపోయింది!

"శైశవ ఏవారోపిత రాజ్యభారః" అని చదవాలి. శైశవమందే రాజ్యభారం అంటుగట్టారన్న మాట. ఏకారాన్ని చకారంగా చదవడంవల్ల ఈ పొర పాటు జరిగింది. "శైశవ ఏవారోపిత" అని స్పష్టంగా, ఎంత మాత్రం చెక్కు చెదరకుండా ఉన్నాయి అక్షరాలు.

### మూడవ రేకు

రెండవప్రక్క, రెండవ పంక్తి—"ముచ్చైరలం కర్తు కామః" అని ముద్రితం.

"ఉచ్చైరలంకర్తుకామః" అని చదవాలి. ఉన్నతంగా, గొప్పగా అలంకరించగోరినవాడై అని అర్థం.

నా లు గ వ రే కు

మొదటిప్రక్క మూడవ పంక్తి—"నిర్ఘృణ తాం" అని ముద్రితం. ఇలాటి ఫలశ్రుతి శ్లోకాలు తరుచు వచ్చేవి గనుక పొరపడనక్కరలేదు.

"నిఘ్నతాం" అని చదవాలి. నిఘ్నన్ శబ్దం షష్ఠీ బహువచనం. ఘ్న స్పష్టంగా ఉంది. యజమానిని, గోవును, విప్రులను, బాలులను, స్త్రీలను, విద్వాంసులను చంపే దుర్మార్గుడు పోయేగతికి—అన్నమాట.

ఐదవపంక్తి—"హరతః శాసనాంక్కృతామ్" అని ముద్రితం.

"శాసనాంకితామ్" అని చదవాలి. అక్షరాలలో ఏ లోపమూ లేదు. శాసనాంకితమైన భూమిని హరించేవాడు అని భూమికి అన్వయం.

రెండవప్రక్క, రెండవ పంక్తి— "సింహో త్యయం పల్లవం...త్యా" అని ముద్రితం.

"సింహోహ్వయం" అని చదవాలి. హవర్ణం స్పష్టంగా ఉంది. చుక్కలు పెట్టినచోట 'భూ' అక్షరం పెడితే భూత్వా అని చదవవచ్చు.

నాల్గవపంక్తి—"ఇతి ఖ్యాత స్తదేవం నృపః సాష్టాశీతి శతూః శతే శకయుతే సంవత్సరాణాం గతే" అని ముద్రితం.

"ఖ్యాత స్తదేదం నృపః సాష్టాశీతిచతుః శతే శకపతే స్సంవత్సరాణాం గతే" అని చదవాలి. శకపతి సంవత్సరాలలో 488 గడవగా, "తదేదం" తదా+ఇదం— ఈ శాసనం ఇచ్చాడని అర్థం. పాఠకుల సౌలభ్యం కోసం ఈ శ్లోకం పూర్తిగా (సంస్కరణతో) వ్రాస్తాను.

"కృత్వా పల్లవభంగ పేలవ బలం
సింహోహ్వయం పల్లవం
భూత్వావృత్య యదాగతః ప్రథమత
శ్చక్రాభిధానం పురం,
ప్రాదా చ్ఛాసన ముత్తమాశ్రయ ఇతి
ఖ్యాత స్తదేదం నృపః
సాష్టాశీతి చతుఃశతే శకపతేః
సంవత్సరాణాం గతే."

ఈ శాసనాలకాల నిర్ణయ మంతా స్పష్టంగా ఈ శ్లోకంలోని శకవర్షాలపై ఆధారపడి వున్నది. కనుక ఈ శ్లోకం చదవడంలో పొరపాటు రాకూడదు.

అనువాదంలోని ఎగుడు దిగుళ్లను శ్రీ శాస్త్రి సవరించుకోవాలి. ఇలాటి క్లిష్టమైన శుష్కవిషయాలు జనానికి సులభంగా రంజకంగా వుండడానికి అనువాద భాష సరళంగా స్పష్టంగా వుండాలి. శాస్త్రజ్ఞుని దృష్టి ఎప్పుడూ పాండిత్య ప్రకర్ష ప్రదర్శనం కాక కుడ్య కుసూలాలకు తెలుపుతున్నాము నే భావంతో సరళకరంగా ఉండాలి.

శ్రీ శాస్త్రి వాదానికి ఈ విక్రమేంద్ర భట్టారకవర్మ శాసనం తిరుగులేని ఆధారం. ఇలాటి శాసనం ప్రచురించినందుకు మరోకమారు ఆయనను అభినందిస్తున్నాను.

మద్రాసు: —తిరుమల రామచంద్ర.

# విశ్వనాథవారి "ఏసుక్రీస్తుగాడు"

మే నెల చివర, జూన్ నెల మొదలు జరిగిన తిరుపతి సాహిత్య సభలలో నేను శ్రోతగా పాల్గొన్నాను. శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి ప్రసంగాలూ విన్నాను. ఆయన ప్రసంగ వశాత్తు "ఏసుక్రీస్తుగాడు!" అన్న వాక్యం కూడా విన్నాను. గారు అనేది పొరపాటుతో నాకు వినబడి ఉంటుందిలే; అంత పెద్దవాడు—డెబ్బయియేండ్లు దాటినవాడు—అలా అని ఉంటాడా; నా చెవుల దోషమే—అనుకుని ఆరాట పడే హృదయాన్ని సమాధాన పరచుకున్నాను.

జూన్ భారతిలో ఒక పరిశీలకుడు వ్రాసిన సమీక్షలోను "ఏసుక్రీస్తుగాడు!" అని విశ్వనాథ వారు అన్నట్లు చదివి నా చెవుల పొరపాటుకాదని నిశ్చయించుకున్నాను. తర్వాత నిజంగానే బాధపడ్డాను— నేను ఆమతంవాణ్ణి కావడంవల్ల మరింతగా.

భారతదేశం పెక్కు మతాల, జాతుల, భాషల పుట్టినిల్లు. పెక్కు సంస్కృతులకు కూడలి. సహస్రాబ్దాలుగా పలుజాతుల రాక జరుగుతూంది. అలాగే కాలక్రమాన క్రైస్తవ మతమూ భారతదేశంలో అడుగుపెట్టింది. భారతదేశానికి—మన దేశానికి అందాం—వైదిక సంస్కృతి ఎంత కొత్తదో, పర దేశీయమో, క్రైస్తవ మత సంస్కృతులూ అంతే. దానికి ఎవరు గింజుకున్నా ప్రయోజనంలేదు; తిట్టీ ప్రయోజనం లేదు. ఆ సంస్కృతి లేకపోతే విశ్వనాథవారు ఇంతవారయేవారు కారు.

అయినా ఉపనిషత్సంస్కృతి, ఋషుల తేజస్సు, ఆర్య మహామహుల గుణగణ విశేషాలు మూర్తీభవించినట్టు శ్రీ జమదగ్నిశర్మ మొదలయినవారు తెగ పొగడిన విశ్వనాథవారి నోటినుండి ఇలాటి అవాచ్యాలు రావచ్చునా? మా పూర్వులు గొడారివారట—మేము కూడా హిందువుల దేవతలను, మహా పురుషులను నీచంగా వ్యవహరించమే! సర్వమత సామరస్యం, ప్రబోధించి జ్ఞానతేజోలోకాలు దర్శింపజేసే ఉపనిషత్తుల సంస్కృతిని జీర్ణింప జేసుకున్నామనుకునే విశ్వనాథవారి మాటలనుబట్టి చూస్తే వారికి ఆ సంస్కారం చర్మదఘ్నమో, రోమకూపదఘ్నమోననే నాకు అనుమానం కలిగింది. ఆ సంస్కారం వంటబట్టినవారి మాటలు అలా ఉంటాయా? కబీరు అన్నట్టు, ఏసునాథుడే అన్నట్టు అపూర్వ పరిమళం ప్రసరింపజేయవూ?

ఏసుక్రీస్తును తూలనాడదగిన తాహతు విశ్వనాథవారికి దేనిలో వుందో? ఆయన జీర్ణించుకున్న, తనవిధంగానే శిష్య సంతతిని తయారు చేస్తున్న విశ్వనాథవారి సంస్కారానికే ప్రాబల్యం వుంటే, బ్రాహ్మణులు—అనుకునేవారు తప్ప, తక్కిన సప్తదశ కులాల వారు మాడిపోయేవారే.

ఇంతకూ విశ్వనాథవారి ఆధిక్యం—మతదృష్ట్యా ఏమిటి? ఆభిజాత్య దృష్ట్యా ఏమిటి? ఆయన గోత్ర ప్రవరలనే పరిశీలించుకోమనండి. ఎంత సాంకర్యం వుందో! ఎందరు అనార్యులు ఆర్యులతో చేరారో? సందేహం కలిగితే చరిత్రకారులను అడుగమనండి. వారి కల్పవృక్ష నాయకుని పురోహితుడు అనార్య ఋషి కాదా? అయితే విశ్వనాథవారు ఆర్యులూ బ్రాహ్మణులూ గదా? వారు వ్యవహరించే భాష ఏమిటి? ఆర్యభాష ఎలా పోయింది? ద్రావిడభాష ఎలా అలవడినది? ఈ సాంకర్యం ఏమిటి? తక్కిన ఉత్తరాదివారు—అసలు ఆర్యులు—తమ భాషలు మరువలేదే? ఋషుల గోత్ర ప్రవరచరిత్రలు తిరగవేయమనండి. బుద్ధుని వంటివాడు ఋషులను తిట్టలేదే! అప్పటి చర్యలను మాత్రమే ఖండించాడే!

ఏవో నవలలు, కావ్యాలు వ్రాసి, మందిమార్బలం పోగు చేసుకుని, ఋషి కల్పుల మని విర్రవీగుతూ, మత ప్రవర్తకులను, మహానుభావులను నిందించడం శ్రేయస్కరం కాదు. ఈ విషయం విశ్వనాథవారు, వారి శిష్యబృందం గ్రహించడం నిశ్శ్రేయసం.

రేణిగుంట: —టి. ఏసోబు.

## తిరుపతి సాహిత్య సభలు

జూలై నెలలో వెలువడిన 'భారతి' పత్రికలో ప్రచురితమైన 'ఒక పరిశీలకుని' 'తిరుపతి సాహిత్య సభల' పై సమీక్ష శ్రద్ధతో చదివి ఆనందభరితుడనయినానని వ్రాయటంలో అతిశయోక్తి ఎంతమాత్రము లేదు. నావలెనే మరెందరో చదువరులుంటారని నా నమ్మకం.

ఈ బృహత్ సమీక్షలో రచయిత చూపిన సునిశిత విమర్శనా పద్ధతి, నిష్పక్షపాతదృష్టి, దృఢమైన అవగాహనశక్తి, సమగ్ర పరిశీలనా సామర్థ్యము, దర్పణములోవలె ప్రతిబింబించాయి. వీటికితోడు వీరి సులభ సుందర రచనా శిల్పము, చమత్కార విన్యాసము, తాంబూలానికి, ఏలకి, లవంగ ద్రవ్యాలవలె ఒకింత ఘాటును, సౌరభ్యాన్ని కలిగించాయి.

ఆలోచనా పటిమతో గూడిన ఈలాంటి రచనలవలన సమకాలీన విమర్శ సాహిత్యానికే ఎంతో రాణింపు రాగలదనటంలో నాకేమీ సందేహము లేదు.

ఇవే ఈ రచయితకు, భారతి పత్రికా సంపాదకులకు నా అభినందనలు.

మద్రాసు: —ధూళిపూడి ఆంజనేయులు.

కలగూరగంప :

# బేగం హజరత్ మహల్ అపూర్వ పేటిక

1857లో జరిగిన ప్రథమ భారత స్వాతంత్ర్య సమరంలో లక్నోలోను, పరిసరాలలోను ఈస్టిండియా కంపెనీవారిపై సైన్యం నడిపించిన లక్నో రాణి బేగం హజరత్ మహల్ తాలూకు ఒక పెద్ద భోషాణం లక్నోలోని మీర్ అకాడెమీవారు సంపాదించారు.

బేగం హజరత్ మహల్ తన విప్లవం ఫలించదని గ్రహించిన తర్వాత కొందరు నమ్మినబంట్లతో నేపాల్‌కు పారిపోయింది. ఆమె తన అమూల్య వస్తువులన్నీ ఒక పెద్ద భాషాణంలో పెట్టుకుని వెళ్లింది. ఆ భోషాణంలో 52 విడి విడి అరలు ఉన్నాయి—నగలకు, నాణ్యాలకు, గుడ్డలకు, ముఖ్యమైన కాయితాలకు—తక్కిన వస్తువులకు.

ఈ భోషాణాన్ని మీర్ అకాడెమీ అధ్యక్షుడు శ్రీ మక్‌బూల్ అహమ్మద్ లారీ కాఠ్మండునుంచి తీసుకుని వచ్చారు.

బేగం హజరత్ మహల్ గౌరవార్థం కాఠ్మండులో ఒక దర్గా కట్టించాలని, దీనికి ఏర్పాటు చేయాలని శ్రీ లారీ ప్రధాని శ్రీ శాస్త్రితో విజ్ఞప్తి చేయదలచారు.

## మరి ఇద్దరు క్షత్రపరాజుల ముద్రిక

మధ్యప్రదేశ్‌లోని సాగర్ విశ్వవిద్యాలయం పురాతత్త్వశాఖవారు ఇటీవల సాగర్ సమీపంలోని ఏరాన్ అనే పల్లెవద్ద తవ్వకాలు సాగించారు. వాటిలో కొన్ని అపూర్వ వస్తువులు లభించాయి. వాటిలో ఒక్కటి అపూర్వమైన బంకమట్టి ముద్ర. దీనివల్ల ఇదివరకు చరిత్రకారులకు తెలియని ఇద్దరు క్షత్రప పాలకులు తెలియవచ్చారు.

ఈ బంకమట్టి ముద్రిక మీద "రాజ్ఞో ఈశ్వర మిత్ర పుత్రస్య రాజ్ఞో సింహశ్రీసేనస్య" అని క్రీస్తుశకం 3 వ శతాబ్ది బ్రాహ్మీల లిపిలో చెక్కి ఉన్నది.

ఈ ముద్రిక మధ్యన ఒక పర్వతం, మూడు కమానులు (ఆర్చిలు), ఒక నది చెక్కి ఉన్నాయి. ఇది మాళవ దేశాన్ని పాలించిన ఈశ్వరమిత్ర పుత్రుడైన సింహశ్రీసేనుడనే శక—క్షత్రపరాజుదని తెలుస్తున్నది.

ఈ త్రవ్వకాలను ఆచార్యో కె. డి. బాజ్‌పాయి జరిపారు. ఈ ఇద్దరు రాజులు తూర్పు మాళవ ప్రాంతం పాలించిన ప్రత్యేక క్షత్రపశాఖకు చెందినవారని, సాంచీ, ఏరాన్‌లలో దొరికిన శాసనాలలో కనిపించిన శ్రీధరవర్మ అనే రాజు వంశం వారయి ఉంటారని శ్రీ ఆచార్య బాజ్‌పాయ్ అభిప్రాయపడుతున్నారు.

(నాఫెన్)

ఎవ్వానితో నెవ్వోట్టం
జివ్వకు జేసాచవలందు; చేసాచినవో
నివ్వాల నవ్వాల నెవ్వగు
నివ్వక యుండంగ బగసనన్ దీర్పదగున్.

(శ్రీనాథుడు—కాశీఖండము)

# గ్రంథ విమర్శలు

## సమగ్ర ఆంధ్ర సాహిత్యం

[మొదటి మూడు సంపుటాలు రచయిత : శ్రీ ఆరుద్ర. సంపుటం పుటలు: చెరి 1/16 డెమ్మీ 250. వెల: సంపుటం ఒకటికి 3—00 రూ. ప్రాప్తిస్థానం : ఎం. శేషాచలం అండ్ కంపెనీ, మచిలీపట్నం, మద్రాసు, సికిందరాబాద్.]

భారతదేశ భాషలలో సంఖ్యాగణనంచేత ప్రాథమికము కాకపోయినా భాషా మాధుర్యంచేత, ప్రత్యేక ప్రతిభా వ్యక్తిత్వముచేత అద్వితీయమైన తెలుగు సాహిత్యాన్ని ఒక యేడాదిలో పన్నెండు సంపుటాల్లో ఆంధ్రలోకాని కందజేయుచున్న గ్రంథకర్తను, ప్రకాశకులను మొదటనే అభినందించవలసి యున్నది.

ఈ ప్రణాళికలో ఐదు సంపుటాలు చాళుక్య, కాకతీయ, పద్మనాయక, రెడ్డి, గజపతుల యుగాల విభజనతో వెలువడ్డాయి. వీనిలో మొదటి మూడు సంపుటాలు మాత్రమే ఇందులో విమృష్టములు. వాఙ్మయ చరిత్రకువలె, ఈసంపుటాలకు యుగ విభజన ఉన్నా, ఇవి గతానుగతింగా వస్తూన్న కవి చరిత్రలే. ఇవి కవి చరిత్రలే అయినప్పుడు భారతవర్షంలో ప్రథమంగా ఇంగ్లీషులోనైనా కవుల చరిత్రను వ్రాసినది తెలుగు వారే అన్న గౌరవ మాపాదింపజేసిన కావలి వెంకట రామస్వామిగారిని, తెలుగున తొలి కవి చరిత్రకారులు గురజాడ శ్రీరామమూర్తిగారిని, శతకకవులచరిత్ర మూలంగా సంపూర్ణ కవిచరిత్రలకు తోడ్పడిన వంగూరి సుబ్బారావుగారిని కృతజ్ఞతతో పేర్కొంటే చాలా సముచితంగా ఉండేది.

ఈ మూడు సంపుటాల ఏడువందలఏభై తొమ్మిది పుటలలో ముప్పయిముగ్గురు కవుల చరిత్రలున్నవి. నాలుగు యుగపీఠిక లున్నాయి. వీనన్నింటిలోను చరిత్రే ప్రధాన స్థాన మాక్రమించినదిగాని, సాహిత్యం కాదు. ఆదిమయుగం 95 పుటల్లో 36 పుటలు రేనాటి చోళుల చరిత్ర, 14 పుటలు నాగభూమి, 13 పుటలు పట్టికలు పోతే 32 పుటలు మాత్రమే సాహిత్యానికి సంబంధించినవి. ఇక కవుల చరిత్రలలోనైనా, కాల నిర్ణయ చర్చలు, వివాదాలు, ఖండన మండనలు, ప్రధానస్థాన మాక్రమించాయి. ఇంతకూ ప్రజానీకానికి అందించవలసినది ఆంధ్ర సాహిత్య పరిణామ చరిత్ర. దానివల్ల ప్రజలలో సాహిత్యాభిరుచి కలగాలి.ఇదివరలో కవి చరిత్రలలో సాహిత్యానికి చోటులేదన్న ఆక్షేపము ఉండనే ఉన్నది. ఈ సంపుటాలు ఆ ఆక్షేపాన్ని తొలగించలేదు సరేకదా, నిలబెట్టినది. దీనికి కారణం—ఈ సంపుటాలలో యుగ విభజనయే.

కేవలమూ చారిత్రక యుగ విభజనవల్ల సాహిత్య స్వరూప మెంతమాత్రము అభివ్యక్తము కానేరదన్న విషయం, ఈ సంపుటాలలో గుర్తింపబడక పోవడం ఆశ్చర్యంగా ఉన్నది. సాహిత్య సృష్టి కవుల వల్ల, కావ్యాలవల్లనేగాని రాజులవల్ల, పోషకులవల్ల కానేరదు. ఇందుచేతనే దేశచరిత్రలో రాజులపేర యుగాలు, సాహిత్యచరిత్రలో కవులపేర యుగవిభజన జరుగుతుంది. ఇదివరలో తెలుగులో ప్రకటితమైన వాఙ్మయ చరిత్రలలో, పాల్కురికి యయుగమనీ, నన్నయ యుగమనీ, శివకవియుగమనీ, తిక్కనయుగమనీ, శ్రీనాథయుగమనీ యీ రీతిగా వ్యవహరింపబడడానికి కారణ మిదే.

సాహిత్య చరిత్రలో కవులే యుగకర్తలన్న సూత్ర మనువర్తిస్తేగాని, సాహిత్యోత్పత్తి వికాసాలు, సాహిత్య ప్రక్రియా భేదాలు, సమష్టి సాహిత్య స్వరూపము ఎంతమాత్రమూ గోచరింపవు. సాహిత్యంలో రాజకీయ చారిత్రక విభాగంవల్ల ఇంకో ప్రమాదం కూడా ఉన్నది. మన ప్రాచీన సాహిత్యానికి మత సంప్రదాయాలకి గల అవినాభావ సంబంధాన్ని అది వ్యక్తపరచదు. ప్రచుర ప్రచారంలోవున్న మతాలు ప్రవర్తిల్లే కాలంలో ఒక్కొక్క మత ప్రభావము సాహిత్యంలో, సాంఘిక జీవితంలో, సంస్కృతిలో పరిణామాత్మకమైన మార్పులు తెస్తుంది. ఆ మత సంస్కారముద్ర సార్వకాలికంగా వీనన్నింటిలోను విశదమవుతూనే ఉంటుంది.

పై సూత్రాల్ని అవగాహన చేసుకునే తెలుగు సాహిత్యంలో శివకవియుగం ప్రత్యేకంగా వ్యవహరించడం జరిగింది. శివకవుల గ్రంథాలు మత ప్రచార ప్రధానములైనా వానిలో కావ్యకళ మూర్తీభవించినది. ఈనాటి భాషా సమైక్య సమస్యను ఏడు శతాబ్దాల క్రిందటనే పరిష్కరించడమేగాక, తెలుగులో బాహాటంగా—స్వతంత్ర కావ్య రచన ఉన్నది అని విరూపించ

డానికి అవకాశాన్ని కల్పించినవీ ఆ గ్రంథాలే.

శివకవి యుగ విభజనవల్ల పై స్వతంత్ర కావ్య రచనేకాక కావ్యప్రక్రియాభేదాల పరిణామం తెలిసికోవడానికి వీలు కలుగుతుంది. మార్గ పద్ధతిని నన్నయాది కవిత్రయంవారు చంపూ ప్రక్రియకే ఆద్యులు కాగా, శివకవులు దేశికవితలో ద్విపద, శతక, ఉదాహరణ, గేయ, పద రచనలకు ఆద్యులై— మార్గ దేశి కవితా సంప్రదాయాలను గంగా యమునలవలెనే సమ్మేళనము గావించి ఆంధ్ర సారస్వత క్షేత్రాన్ని త్రివేణీ సంగమతీర్థంగా పరిఢవింపజేశారు.

పై విషయాలను గమనిస్తే ప్రస్తుత సమగ్ర ఆంధ్ర సాహిత్య రచనా ప్రణాళిక మూలముట్టుగా తప్పిందనడంలో సందేహములేదు. ఇంతేకాక ఏ ఆంధ్రదేశ చరిత్రలోను ప్రత్యేకంగా ప్రసక్తం కాని పద్మనాయక యుగంతో మూడవ సంపుటమ్ము వెలువరించడమూ, రెడ్డిరాజుల ప్రథమాస్థానకవి ఎఱ్ఱనను ఇందులో జేర్చుట సమంజసము కాదు.

శివకవుల సాహితీ విశిష్టతయేగాక, పద్యమయ శాసన కవుల విశేషాలు ఇందు విస్మృతములు. పద్యమయ శాసనాలతో ప్రారంభమైన తెలుగు సాహిత్యంలో నన్నయ యుగంలోను, ఆ వెనుక కొంత కాలానికి వెలసినన్ని పద్యమయ శాసనాలు మరి యే కాలమునందును లేవు. నూటికిపైగానున్న వీనిలో ప్రశస్తమైన రచన లున్నాయి. ఈ పద్యమయ శాసనాలను ఒక్క పద్యమున్నా దాన్ని 'కావ్యం'గా పరిగణించేవారు. ఈ శాసన రచయితలగు కవులందరిగూర్చి తెలియకపోయినా, కొంతమంది శాసనస్థ ప్రమాణాలచేత మన కెరుకపడుచున్నారు.

అట్టివారిలో నొక శాసనకవి భీమయపండడు. (క్రీ.శ. 1145.) తెలుగులో దేశిమార్గసంప్రదాయం శాసనమూలంగా భీమయపండనివల్ల తెలుస్తున్నది.

"తలపు సదర్థ భావమును
తద్గత సూక్తులు గూఢవర్ణనల్
గొలుసు గొనంగ ప్రావడులు
గోరిన భంగిని వచ్చి ముట్టకో
మలగతి దేశి మార్గములు
మట్టుపడం గటనంబులొప్ప నా
ద్యుల క్రియ జెప్ప నేర్చె నృప
ధూర్జటి భీమయ పండ డిమ్మహిన్."

ఈ శాసనమందు ఏడు పద్యా లున్నవి.

వెల్లంకి గంగాధర మంత్రి:—ఇతడు కాకతి రుద్రనరేంద్రుని మంత్రి. ఈ శాసనము 32 పద్యముల కావ్యం. శాసనములో నేనే అను ప్రయోగమువల్ల శాసన రచయిత గంగాధర మంత్రియే. ఇందులో నాలుగు పద్యాలు తృతీయావిభక్త్యంతాలతో ఉన్నాయి. సప్త సంతాన ప్రశంస కనబడుతున్నది.

వీ రిరువురు గాక గుండిమెడ అన్నమంత్రి, కంటడు, సూరడు, నాగదేవభట్టు అను శాసన కవులు మనకు తెలియవచ్చుచున్నారు. ఈ శాసన కవులందరు నేకకాలమువారు కారు. ఏకప్రదేశమువారు కూడా కారు. వీరినిగూర్చి పరిశ్రమ జరిగిన మనకింకను నెంతమందియో ప్రాచీన కవులు బయటపడగలరు. కవితా రచనచేతనేగాక, భాషా వ్యాకరణచ్ఛందో విశేషాలచేత, ఈ శాసన పద్య వాఙ్మయానికి, సాహిత్యంలో సముచితమైన స్థానమున్నది.

పద్యమయ శాసన కవులే గాక, ఇంకా మరి కొందరు కవులు, కావ్యకర్తలు ఇందులో కానరారు. శ్రీపతి పండితుడు, గజాంకుశుడు, గోకర్ణదేవుడు, అమృతనాథుడు, విష్ణువర్ధనమంత్రి, ఏకామ్రనాథుడు, పేరయఅన్నయ, అన్నయ, వెన్నెలకంటి సూరన, వెన్నెలకంటి అన్నయ, తుర్కరాజు సూరయ, శ్రీధరుడు, గోపన, గంగాధరుడు వీరందరూ ఈ మూడు సంపుటాలలోనికి రాదగినవారే.

ఇక యిందులో ఉన్న కవులలో లేనివి, చేర్చదగినవి కొన్నిమాత్రమే ఉదాహరిస్తాను. గ్రంథ రచనా వైఖరిని నిరూపించడానికి యివి చాలును.

ఆదిమ యుగంలో తెలుగు భాషకు సంస్కృత ప్రాకృత, పైశాచీ, తమిళ, కన్నడ, మహారాష్ట్ర, భాషలకూ గల పరస్పర సంబంధం, పరస్పర ప్రభావమూ, తెలుగు లిపి పరిణామము వివరింపబడలేదు. ముఖ్యంగా సంస్కృతానికి కన్నడ, ఆంధ్రభాషలకు, అవినాభావ సంబంధం ఉన్నది. ఆశుమధుర చిత్ర విస్తర కవితలు, గానట బీసట, చంపూ పద్ధతి—వీనిలోని విశేషాలు వెల్లడి కాలేదు. ఇన్నింటితో ఇంత సన్నిహిత సంబంధముండీ, తెనుగు భారతీయదేశభాషలలో ఒక ప్రత్యేక విశిష్ట సాహిత్యంగా, ఎట్లు రూపొందినదీ అవగాహన చేసికోవడానికి, పై విషయ వివరణ అత్యంతావశక్యం.

నన్నయభట్టు గూర్చిన వ్రాసిన 38 పుటల్లో నన్నయ కవితలో ఉపాఖ్యానాల విశిష్టతగాని జాతీయ

ధ్వనులుగాని సూచితాలు కాలేదు. ముఖ్యంగా అందుండే గద్య, పద్య చ్ఛందో వివరాలు లేనేలేవు. నన్నయ పద్య రచనలో, గద్య రచనలో ప్రతి పద్యమూ, ప్రతి వచనము, ప్రతి వాక్యము, ప్రతి పదము, చివరకు ప్రతి యక్షరము ఒక విశేషం తెలుపుతుంది. నన్నయ తన కాలంనాటి లిపితో వ్రాసినది తెలుగు భారతమైనా ఈనాడు మనం చదువలేము. లిపిమారినా చెక్కు చెదరకుండా నన్నయకవిత నిలిచినదంటే, అది నన్నయ ఛందో నియామావలవల్లనే అని తెలిసికోవాలి.

నన్నయ్య ఆదికవియేగాక, తెలుగులో ఆదిమ పరిశోధకుడును. పదవ శతాబ్దిలో సంస్కృత భారతములోనున్న శ్లోక సంఖ్య, పర్వ వివరాలను అక్షరాలా వివరించి పందొమ్మిదో శతాబ్ది సంస్కృత మహా భారత సుసంస్కృత ముద్రణానికి అత్యధికంగా ప్రామాణికంగా ఉపకరించి, ఆ సంపాదకుల ప్రశంసలనందుకొన్నాడు. ఈ విషయం తెలుగు సాహిత్య చరిత్ర కెక్కవలసినదే కదా!

పావులూరి మల్లన కన్నడంలో రాజాదిత్య గణితాన్ని అనుసరించాడు. మల్లన గణితంలో సూత్ర గణితాన్ని 165 యేండ్లక్రింద బెంజమెన్‌హైన్ ఇంగ్లీషులోనికి అనువదించాడు. ఇందులో పద్యాలు, పెద్దబాలశిక్షలో ఉన్నాయంటే, దీని ప్రచారం ఊహించవచ్చు.

నన్నెచోడకవి కళావిలాసంలో దొరికిన నాలుగు పద్యాలనైనా ఉదాహరించలేదు. ఇందులో మన్మథ ప్రశంస మనోరమంగా ఉంటుంది. ఇంతకుముందు నిర్ణయింపబడిన కాలానికి అనుగుణంగా వేములవాడ భీమకవిజననకాలమే మనకు లభ్యమౌతున్నది.మల్లియ రేచన కవిజనాశ్రయంలో కొంతభాగాన్ని బ్రౌను దొరగారు ఇంగ్లీషులో అనువదించారు.

తిక్కనను సంస్కృత కవిగా గంగాంబ మధురా విజయంతో ''తిక్కయజ్వ కవే స్సూక్తి:'' అని స్తుతించింది. తిక్కన తెలుగు భారతాన్ని తిమ్మణ్ణ కన్నడించుకొన్నా డనడం తెలుగువారికి విశిష్టతయే గదా.

కేతన ఆంధ్ర భాషాభూషణం కన్నడ రెండవ నాగవర్మ సంస్కృతంలో వ్రాసిన కర్నాట భాషా భూషణాన్ని అనుసరించినది1. ఆతని అభినవదండిలో అభినవ శబ్దమూ, కన్నడమునుండి గ్రహించినదే.

ప్రక్షిప్త భాగాలు లేకుండా, శ్రీకారంతో ప్రారంభించి, తూ. చా. తప్పకుండా ముద్రితమైన భాస్కర రామాయణం ప్రచారంలో ఉన్నది.

కృష్ణమాచార్యుల జననకాల విశేషాలు ఈ వరకే లోకానికి ఎరుక పడినవి. ఆతని ద్రవిడవేదంలో కొంత భాగము లభించింది.

ఎఱ్ఱన భారతారణ్య పర్వశేషాన్ని పూరించినట్లు జయంతి రామభట్టు నిర్వచనోత్తర రామాయణాన్ని, నేమాని భైరవావధాని హరివంశాన్ని పూరించారు.

ఈ మూడు సంపుటాలలోను ఆంధ్ర సాహిత్య సౌధానికి మూలాలవాలమైన ఆంధ్రమహా భారతము పూర్తియైనా, కవిత్రయ కవితా విశేషాలుగాని, వాఙ్మయ ప్రపంచంలో, భారతానికిగల అరాజమర మైన స్థానంగాని, ప్రభావంగాని యేమాత్రమూ నిరూపితముకాలేదు.

వీరశైవ సాహిత్యంలో ముఖ్యంగా పాల్కురికి సోమనాథుని ప్రతిభా విశేషాల వివరాలులేవు సరి కదా అతడు రచించిన గ్రంథాల పట్టిక కూడా యీయబడియుండలేదు.2

ఆంధ్రభోజుడు—నీతిభూషణము:—140 వ పుటలో నీతిభూషణములోని పద్యముగా నీక్రింది పద్య మున్నది.

''స్వామియు మంత్రియు దుర్గ
స్తోమమురాష్ట్రంబుధనముసుహృదులుబలముం
గా మహి సప్తాంగంబులు
నేమరకయొనర్పవలయునిందులరక్షల్.'' 149

కాని యిదే పద్యము మంచెన కేయూరబాహు చరిత్ర (4—205) లో ఉన్నది. నాల్గవ పాదములో ''దామదిలో నెఱిగి వీని దగ రక్షించెన్'' అని మార్పు గలదు. అప్పుడీ పద్యమునకు కర్త ఆంధ్రభోజుడా? మంచెనయా?

వేములవాడ భీమకవి:—భీమకవి పద్యాలలో నీక్రింది పద్యమున్నది: (పుట 217).

''వసుమతిలో చిరకాలము
మశకంబై మనుటకంటె మదకరి కుంభ

---

1. ఈ విషయాన్ని యిప్పటికి పదకొండేండ్ల క్రిందటనే శ్రీ తిరుమల రామచంద్రగారు లోకానికి వెల్లడించారు. (ఆంధ్రప్రభ — భారతి.)

2. భారతివారి ముద్రతో నా వద్దనున్న గ్రంథంలో రెండవ సంపుటం 202—220 పుటల్లో గ్రంథ వివరణ లేదు.

# గ్రంథ విమర్శలు

గ్రసనంబగు సింహంబై
మసలుట యొక గడియ చాలు మైలమభీమా''

ఈ పద్యమే కాచన బసవన్న కవి సర్వగారుడము అనే లక్షణ గ్రంథంలో శసలమైత్రికి "అమృత నాథుడు అని'' అమృతనాథుని పద్యంగా ఉదాహరింపబడినది. అమృతనాథుని ప్రస్తావన యిందులేదు.

యథావాక్కుల అన్నమయ్య:—యథావాక్కుల అన్నమయ్యగూర్చి వివరాలు స్పష్టంగా ఉన్నా, వానిని గ్రంథకర్తలు చూచినా, యెట్లు వ్రాశారో చూడండి.

"ఈ వాఙ్మయశాఖలో మకుట నియమంగల మొదటి కృతి అన్నమయ రచించిన సర్వేశ్వర శతకం.'' దీనికి శీర్షిక "కచ్చితమైన తొలి శతకం'' పుట 30.

శతకానికి, మకుటనియమమేకాక సంఖ్యా నియమం చాలా ముఖ్యమైనది. శతకమనేపేరే ఆ సంఖ్యా నియమాన్ని తెలుపుతుంది. 'శతము' రూపాంతరము శతకము. "తత్సుత శతకంబుకంటె నొక్క సూనృత వాక్యము మేలు'' అని నన్నయ. సాహిత్యప్రక్రియలో 'శతకము' సంఖ్యానియమంఅనుసరించే రూఢిఅయింది.

"ఈ సర్వేశ్వర శతకంలో మొత్తం 138 పద్యాలకన్న ఎక్కువలేవు'' అని ఈ సందర్భంలో వ్రాయబడి ఉండడముచేత ఇది శతకము ఎంత మాత్రమును కాదు.

"అన్నమయ్య తన గ్రంథాన్ని శతకం అని ఒక సారి పేర్కొన్నా సర్వేశ్వరస్తోత్రం అని ఒకసారీ, సర్వేశ్వర ప్రాకామ్యస్తవం అని మరొకమారూ పేర్కొన్నాడు''—పుట 31.

ఇంతకుముందు వ్రాసిన వ్రాతలను సరిగా చూడకుండ వ్రాసిన వ్రాతయిది. "అన్నమయ్య 'శతకము' అని వ్రాసిన పద్య మిది.

"జయశక్తిన్ రవిచంద్ర తారకముగా
పల్కెన్ యథావాక్కులా
న్వయ సంజాతుడు అన్నమార్యు డవని
న్వర్ణించి నీ సత్కథా
క్రియ సంబోధన నీదు భక్తిని మహా
నిర్ణీత విశ్రాంతిగా
భయ విభ్రాంతులు లేక యీ శతక ముం
బ్రఖ్యాతి సర్వేశ్వరా''

మొదట నీ పద్యము ప్రాత వ్రాత ప్రతులలో లేదు. పరిషత్తువారు ముద్రించిన గ్రంథంలోనే పుట 22 అధోజ్ఞాపికలో "ఈ పద్య మచ్చుప్రతిలోనిది''—అది ఉన్నది. పరిషత్తువారికి లభ్యమైన వ్రాతప్రతుల్లో లేదు. మదరాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగార ప్రతులలో లేదు. ఇక అచ్చు ప్రతుల్లోను, ప్రథమంగా క్రీ. శ. 1881 లో ముద్రణ అయిన గ్రంథంలోను లేదు. అంతేకాక పై పద్యం మూడవ పాదంలో యతిభంగం. ఇది అన్నమయ్య సర్వేశ్వర శతకములోనిదికాదని, మూల తాళపత్ర ముద్రిత ప్రతులను పరిశీలనమువలన నీవరకే నిర్ధారితమైనది. (తె. క. చ. పుట 335.)

పుట 32లో "పాల్కురికి సోమనాథుడు క్రీ.శ. 1280—1340 మధ్యవాడు అని దేశ చరిత్ర కారులు నిర్ణయించారు కనుక 1242 లో శతకం వ్రాసిన అన్నమయ్యకు గురువు కాలేడు.''

పండితారాధ్యుని కృతులను పాల్కురికి సోమనాథు డనుసరించినట్లే, అన్నమయ్యయు పాల్కురికి సోమనాథుని అనుసరించెననియు, నిది శివకవి సంప్రదాయమనియు విపులముగా తెలుగు కవుల చరిత్రలో పుట 368 నుండి 376 వరకు చర్చింపబడియున్నది. ఆ పుటలోనే దూదికొండ సోమేశ్వరారాధ్యుల గూర్చిన అభిప్రాయం ఖండితమైనది. అప్పుడు అన్నమయ్య గురువునుగూర్చి వ్రాత ఎందుకు విమర్శనీయం కాలేదో తెలియుటలేదు.

పాల్కురికి సోమనాథుడు అన్నమయ్య వెనుక కవి స్తుతులలో నుండుటచేత అన్నమయ్యయే పాల్కురికి సోమునికన్న ముందువాడని వ్రాశారు. (పుట 32) దీనికి ఆధారంగా పింగళి ఎల్లకవి తోభ్యచరిత్ర ఉదాహరించారు.

"చెలగి యథావాక్యముల యన్నమయగారి
భజియించి మ్రొక్కిడి పాలకురికి
సోమనగారి ప్రస్తుతిచేసి... .... ... ...'' అని.

శ్రీనాథ మహాకవి కాశీఖండములో

"వచియింతు వేములవాడ భీమన భంగి
నుద్దండ లీల నొక్కొక్కమాటు
భాషింతు నన్నయభట్టు మార్గంబున
నుభయ వాక్ప్రౌఢి నొక్కొక్కమాటు.''

అని నన్నయకన్నముందు—వేములవాడ భీమకవిని పేర్కొన్నాడు. అంతమాత్రంచేత వేములవాడ భీమకవి నన్నయకన్న పూర్వుడా?

పుట 34 లో....."అన్నమయ్య తత్వానికి విరుద్ధమైన గండగత్తెరను ఆయన మెడకు కట్టు

కథలు తగిలించారు.'' అన్నమయ్య వీర శైవమత సంప్రదాయి. గండగత్తెర వారితో సామాన్యాచారం.

పుటలు 35, 36 ''అన్నమయ్య సాత్త్విక భక్తుడు''......''తీర్థాలలో మునగ నక్కర్లేదంటాడు'' ''అన్నమయ్య తీర్థయాత్రా నిరసనం చేశాడు.''

అన్నమయ్య తీర్థయాత్రా నిరసనం చేసినా, దేనికి ప్రాధాన్యమిచ్చేడో, గ్రంథకర్త లూహింపలేదు. అతడు ప్రాధాన్య మిచ్చినది భక్తపాదజలములకు. అవే తీర్థములు. వీర శైవ సంప్రదాయంలో భక్త పాదోదకము మహిమ గలది. (చూ. పండితారాధ్య చరిత్ర దీక్షా ప్రకరణం—పాదోదక మహిమ)

అన్నమయ కృతిలో ప్రతిపాదితమైనది వీరశైవమే. పరిష్కన్ముద్రణ పీఠికలో (4 వ పుట) ''ఈ సర్వేశ్వర శతకము వీర శైవ మత సంప్రదాయానుసారము. భక్తిరస ప్రధానము'' అని స్పష్టముగా వ్రాయబడియుండగా, ప్రస్తుత గ్రంథము 39 వ పుటలో పై వాక్యములు విడువబడి, దాని తరువాతి వాక్యములు ఉదాహృతములైనవి ''శైలి హృద్యము'' ఇత్యాది. దీని కంతకు మూల మీా మత సంప్రదాయ మవగాహనకాకపోవుటయే.

పుట 39. ''ఈ క్రింది పద్యంలో విభిన్న తత్త్వాల పొందిక కనబడుతుంది.

''సకలాధీశ్వర పట్టభద్రుఁడవు భి
క్షా గామి వత్యంతశాం
తకళాత్ముండవు రౌద్రమూర్తి వతిసౌం
దర్యాంబికా సంగమా
ధికలోలుండవు దివ్య యోగివి మదిం
దెల్లంబుగా నెట్టి వా
రికి దా శక్యమె నీ నిజం బెఱిఁగి వ
ర్ణింపంగ సర్వేశ్వరా!

ఇటువంటి శిల్ప చాతుర్యం ఇతడు వ్రాసిన 138 పద్యాలలోనూ అధికంగానే కనబడుతుంది.''

పై పద్యంలోని శిల్పచాతుర్యం అన్నమయ్యది కాదు. అది దండి కవిది. అతని అనామయస్తవంలోని

''శ్లో. యోగీ భోగీ విషభు గమృత
శ్శస్త్రపాణి స్తపస్వీ
శాంతః క్రూర శ్శమిత విషయ
శ్శైలకన్యాసహాయః
భిక్షావృత్తిః త్రిభువనపతిః
శుద్ధిమా నస్థిమాలీ
శక్యో జ్ఞాతుం కథ మిహ శివ
త్వం విరుద్ధ స్వభావః''

అను శ్లోకమున కనువాదము.

''అన్నమయ కవిత్వం చిత్తశుద్ధిగల భావాలకు ''యథావాక్కులు'' అని చెప్పారి.

గురు వాక్యాలను యథాతథంగా అనువదించుట చేతనే యీాతనికి యథావాక్కుల అన్నమయ్య అను పేరు వచ్చినది.

అన్నమయ్య రచించిన ''శీలానంద సర్వేశ్వర శతకము'' గూర్చిన సూచన కూడా యిందు లేదు.

పోతన నారాయణ శతకంలో అన్నమయ రచన ననుసరించిన పద్యాలున్నాయి.

ఇది కచ్చితమైన 'తొలి శతకం' ఎంత మాత్రమూ కాదు.

భాస్కరుని కేతన:—''కేతన కాదంబరినుంచి మూడు పద్యాలు, ఒక శార్దూలపాదం మాత్రమే లభిస్తున్నాయి'' ఇంతేకాదు. మరి రెండు సీసపద్యాలు లభిస్తున్నాయి. ఇవిగో:

సీ. ఆనక యవ్వృతంబు దానిట్టి చవియని
జనుల కేర్పరపఁగాఁ జాలువారు
చూడక మన్మథు సుందరాకారంబు
గరిమఁ జూపఁగఁ జాలు కడకవారు
వినకయ పరతత్త్వ విపుల నినాదంబు
వినిపింపఁజాలెడు నెరవువారు
అంటక మెరపుల యందంబు వ్రేగును
గణుతింపఁజాలు ప్రఖ్యాతివారు
గీ. కంపుగొనకయ కల్పవృక్షముల పుష్ప
సౌరభం బిట్టిదని చెప్పఁ జాలువారు
ఎందుఁజూచిన ధాత్రిలో హృదయ దృష్టి
కవులు గానని మర్మంబు గలదె జగతి?
సీ. కడువేఁడి పెల్లెండ పుడమి పేల్చిన ప్రొద్దు
లాకాశగతియ మేలని తలంప
వాత్యాభిహతి లగ్గవాడి వియచ్చరు
లవనిపై జనుట మేలని తలంప
వడ వడగా నీళు లుడికిన జలచరుల్
వనచర వృత్తి మేలని తలంప
వనమున గార్చిచ్చు దనరిన వనచరు
లంబు సంచరణ మేలని తలంప
గీ. వ్రాఁడి యెండగాసె వడిగొనె సురగాడ్పు
లెసగె వడయుగాలి నెగసి వీచె

దావ దహన మడరె జీవుల కధిక సం
తాపకారియగు నిదాఘవేళ.

పై వానిలో కవి ప్రతిభను వర్ణించే మొదటి పద్యంలాంటి పద్యాన్ని పూర్వకవులలోనైనా ఎంతోమంది వ్రాయలేరు. దీనికి అద్యతనకాలంలో అనుకరణ ఉన్నది.

తిక్కన-విజయసేనము:—తిక్కన విజయసేనము పద్యాలను గూర్చిన చర్చలో 60 వ పుటలో ఈ క్రింది పద్యము విజయసేనములోనిదిగా చూపబడింది.

"ఉత్సాహ ప్రభుమంత్ర శక్తుల నజే
యుండై పరీక్షించిన
దిత్సా వ్యగ్రుడుగాక విగ్రహముచో
దేశంబు గాలంబు సం
పత్సామగ్ర్యము జూపి శక్యము దెసన్
ప్రారంభియై భూప్రజా
వాత్సల్యార్ద్ర మనస్కుడైన పతి శ
శ్వచ్ఛ్రీ సమేతుండగున్.
(ప్రబంధ—154)

కాని ఈ పద్యమే ఆంధ్రభోజుడు వ్రాసిన నీతిభూషణములోనిదిగా, 141వ పుటలో ముద్రితమైనది. అది సకల నీతి సమ్మతములో 150 పద్యంగా ఉన్నట్లు సూచితమైనది. అప్పుడు పై పద్యమెందులోనిది? తిక్కనదా? లేక ఆంధ్రభోజునిదా?

తక్కన "పరధన పరాంగనాజన పరిహారము" అన్న పద్యము, "మహిమ చెడదు స్వామ్య సుప్రతిష్ఠ" అన్న పద్యము కూడా సకల నీతి సమ్మతములోనివే. విజయసేనములోని వెంతమాత్రము కావు.

విజయసేనములోనిదని గ్రంథాంతరముల నుదాహరింపబడ్డ ఈ క్రింది పద్యం ఇందులో కనబడదు.

సీ. "కలయంగ ధారుణీ తల మగ్నితప్తమై
యుప్పరి పెన మట్లు లుచ్చియుండ
కుల పర్వతంబులు కొలిమిలో గ్రాగిన
యినుప ముద్దల క్రియ వెనగియుండ
..........................................
ఆ. వె. తలుపు దడవ మనము దరికొను చూచిన
రెప్పలెల్ల గమరి యొప్పుదరగు
నరుల బేరుకొన్న నాలుక చొక్కు ని
దాఘ కాల తపన తాపమడరె."

మంచన:—మంచన అనునది 'మంచెన'గా నుండదగును. మంచెన అనే రూపమే సరియైనదని ఈ క్రింది బసవ పురాణ ప్రయోగములు నిర్ధారణ చేస్తున్నవి.

"ద్వి........ ప్రశ్న
సేయుడు లెంక మంచెన పండితుండు
శ్రీరమణుండు మంచెన పండితయ్య
గారికి........ పుట 112.

కృతిపతి గుండన విద్యా విశేషాలను గూర్చి ముఖ్యంగా చెప్పవలసిన ఈ క్రింది వివరా లిందులోలేవు.

సీ. వాచకత్వము లేఖనౌచిత్యమును నాంధ్ర
లిపి రీతిగా సర్వ లిపులయందు
ఫణితి జాతియు, తీవ్ర భంగియును తెనుంగు
బాస పోలిక సర్వ భాషలందు
వదన వికాసంబు......"

తెలుగున 'లిపి' ప్రస్తావము తొలుత కావ్యములలో తెల్పినవాడు మంచెన. గుండమంత్రి తెలుగు లిపివలెనే తక్కిన లిపు లన్నింటియందు ప్రవీణుడు. ఆ లిపులను చక్కగా వ్రాయుటకేగాక, తీవ్ర భంగి అంటే వడివడిగా వ్రాసే సామర్థ్యం గలవాడు.

పుట—191. "నిజానికి కావ్యంలో శ్రీకారం చుట్టిన తరవాత రెండవ పద్యంలోనే మంచన శిల్పం మెరయడం మొదలు పెట్టింది చూడండి. "కరిముఖు డశ్వినుల్ శ్రుతులు కంజసముద్భవు మోము" ఈ పద్యములో చక్కని శిల్పమ్మున్నదని వివరింపబడ్డది. కాని ఈ వివరణమల్లా—ఇదివరకే "మంచెన కవితా శిల్పము" అనే వ్యాసములో ఉన్నది. (చూ. భారతి—1963)

పుట 196. ఇందులో నీ తరువాత పునర్ముద్రణ భాగ్యమందిన కేయూర బాహు చరిత్ర ప్రశంస ఉన్నది. కాని వ్రాత ప్రతిలోనున్న ఈ క్రింది పద్యం ఈ ముద్రణలో లేదు.

"క. సొమ్ములలో ముప్పొర్చు జ
గమ్మెల్లను సోడు ముట్టగా జేయును శ్లా
ఘ్యమ్మగు వస్తువు నగుటను
కమ్మని కనకంబుగాదె కవిత దలంపన్"

అవతారికలో నుండవలసిన ఈ పద్యమేగాక కథాభాగములో మరియొక పద్యమూ ఈ ముద్రణలో లేదు.

పుట 198....."మంచనకు శబ్దాలంకారాల మీద కూడ అట్టే మమకారం లేదు. అయినా అవి అక్కడక్కడ వాటంతటఅవి వచ్చినట్లు కనపడుతాయి.

"కౌశిక గోత్ర భూసుర శి
ఖామణి కేతన భూవరుండు ప్ర

ధ్వీశ నరేంద్రు మంత్రియయి
యెల్లెడ జాల్క బొగడ్త కెక్కె నా
కాశనదీ మరాళ శివ
కాశ సురాశన తారకేశ నీ
కాశ తరాధి రోచి రవ
కాశ వికాస యశో విశాలుడై.

ఈ పద్యంలోని చివర రెండు పాదాలలోని శబ్దాలంకారాలవంటి శిల్పమే తరువాత పోతరాజు గారి కాలంనాటికి ప్రతి పద్యంలోను కనిపించేటంత విస్తారమైంది.''

పోతరాజుగారి కాలంనాటికి ప్రతి పద్యం లోనూ కనిపించేది అనుప్రాస గదా. పై పద్యములో ఉన్న శబ్దాలంకారము అదేనా?

పుట 199. ''కేయూర బాహు చరిత్రలోని నీతులు ప్రాచీన కాలంలోనే ప్రచారంలోకి వచ్చాయని వీటిలో కొన్ని మడికి సింగన తన సకల నీతి సమ్మతంలో ఉదాహరించడంవల్లనే తెలుస్తున్నది. కేయూర బాహు చరిత్రలోని వంటూ ఈ రెండు పద్యాలను అతడు ఇచ్చాడు.

క. ''నైజగుణం బది తమ మది
రాజస మప్పటికి గప్పి ప్రజతో నయ్యై
యోజం బరికింపని యా
రాజులు సాధులని నమ్మరా దెప్పటికిన్.
(సకల—504)

''పొడమదు చేయని కార్యము
పొడమక యుండంగ గప్పి పుచ్చెదమన నె
న్నడు రాదు చేత గలిగిన
నెడ మలయపు మనుజు లేల వేల్పులకైనన్.
(సకల—736)

అయితే ఈ రెండుకేయూరబాహు చరిత్రలో కనబడవు.''

కాని ఇవి కేయూరబాహు చరిత్రలోనే ఉన్నాయి. ముద్రిత ప్రతి పుట 20—నైజ గుణంబది తమ మది—(2—86); పుట 44—పొడమదు చేయని కార్యము (3—232). ఇట్లు అచ్చులో స్పష్టంగా కనిపించుచుండగా లేవనుట యెట్లు? పై రెండేకాక యింకా మరి రెండు పద్యాలు కేయూరబాహుచరిత్రలోనివి సకలనీతిసమ్మతంలో ఉన్నాయి. అవి ఇందులో ఉదాహరింపబడలేదు.

పుట 44. ''సంస్కృతంలోని దృశ్యకావ్యాన్ని తెలుగులో శ్రవ్య కావ్యంగా అనువదించడానికి ఇదే—కేయూరబాహు చరిత్రమే మొదటిదని బులుసు వెంకటరమణయ్యగారు చక్కగా చెప్పారు. భారతి—ఏప్రిల్ 1961.''

కేయూర బాహు చరిత్రకు మూలమైన విద్ధసాల భంజిక దృశ్య కావ్యమే. ఈ విషయ మింతకు ముందే క్రీ. శ. 1902 లో తొలిసారిగా ముద్రితమైన కేయూర బాహు చరిత్ర పీఠికలో సూచితమై, క్రీ. శ. 1942 లో విద్ధసాల భంజికా ఆంధ్రానువాదమూలమున వాఙ్మయ చరిత్ర కెక్కినది.

పుట 200లో మంచన ఏ ప్రాంతంవాడో అనే విషయం చర్చిస్తూ, చివర కిట్లు వ్రాశారు. ''మంచన తన కావ్యంలో ఏదైనా ప్రత్యేక ప్రాంతాన్ని కథలో చెప్పాడేమో చూద్దాం.

మొగిళులలోన యేకతము
ముచ్చిలి పుచ్చుకొనంగ జాలు ద
స్తగిరికి తామ్రపర్ణికిని
సంగమమైన ఘటింప నేర్తు నిన్
మిగిలిన యట్టి బుద్ధిమతి
మేదిని నెందును గాన నేమి క్రొ
త్త గలుగఁజూచి పెండ్లిలి ము
దంబని యాడితి బోటి చెప్పుమా?

''ఈ పద్యంలో దస్తగిరి తామ్రపర్ణికి సంగమం ఘటించడం—అనేమాటవల్ల ఏమైనా తెలుసుకోవచ్చునేమో! తామ్రపర్ణి నది తిరునల్వేలి జిల్లాలో ఉంది. దస్తగిరి యెక్కడుందో! ఇది సామెత కాబోలు. భావి పరిశోధనవల్లగాని ఇది తేలదు.''

ఈ గ్రంథ రచనా పరిపాటిని పరిశీలించడానికి ఈపద్యమొక్కటేచాలును. పద్యమునందలి పదచ్ఛేదమూ అన్వయమూ తెలియక 'దస్తగిరి' అనే ఒక స్థలం సృష్టింపబడ్డది. చాలుదు + అస్తగిరి=సంధిలో చాలు దస్తగిరి అయినది కాబట్టి పద్యములోనున్నది—అస్తగిరి గాని దస్తగిరికాదు.

ఈ 'దస్తగిరి' అన్నది చూడగానే రమారమి ముప్పయి అయిదేండ్లక్రిందట కీ. శే. భావరాజు వేంకట కృష్ణారావుగారు ఒక పద్యమయ శాసనంలో ''అమల పయోధిఁజంద్రుఁడుదయంబయినట్టులపోలె పారిజాత మున విరించి పుట్టిన విధంబున'' అని యుండగా, ''అమలపయోధి జంద్రుఁ డుదయంబయినట్టుల పోలె

వారి జాతమున విరించి పుట్టిన విధంబున''—అని పదచ్ఛేదముచేసి ''పోలెవారు'' అనే ఒక వంశము వారిని సృష్టించిన సంగతి జ్ఞాపకము వచ్చినది. అచ్చట పోలెవారు లేరు; వంశమూలేదు. అట్లనపోలె—ఆరీతిగా అనే అర్థము. దీనిని తరువాత కీర్తిశేషులు రామయ్య పంతులుగారు ఖండించారు.

మారన:—''ఆంధ్రసాహిత్యంలో మొట్ట మొదట పురాణాన్ని అనువాదంచేసిన కవి మారన'' పుట 231.

ఆంధ్ర సాహిత్యంలో మొట్టమొదట పురాణాన్ని అనువదించింది వేములవాడ భీమకవిగాని మారన కాడు. భీమకవి నృసింహపురాణం, లాక్షణికు లుదాహరించినారు. అది లభ్యము కాలేదు. కాబట్టి సంపూర్ణంగా ఉపలబ్ధములైన పురాణానువాదాల్లో మారన మార్కండేయ పురాణం మొదటిది—అని చెప్పాలి.

''మారన తెలిగించిన మార్కండేయ పురాణ గాథలే శంకర కవి హరిశ్చంద్రోపాఖ్యానికి, అల్లసాని పెద్దన మను చరిత్రకు, మట్ల అనంతభూపాలుని బహుళాశ్వ చరిత్రకు మార్గదర్శకమైనాయి.''

ఇందులో పేళ్ల వ్యత్యాసాలు చూడండి. మట్ల అనంత భూపాలునీ బహుళాశ్వ చరిత్ర మట. మట్ల అనంత భూపాలునిది 'కకుత్స్థ విజయము' కాని బహుళాశ్వ చరిత్రకాదు. ఇక బహుళాశ్వ చరిత్ర రచించిన కవి దామెర వెంగళ భూపాలుడు. కవుల పేళ్లు వ్యత్యస్తంగా ఉన్నా అసలు బహుళాశ్వ చరిత్ర కథ మార్కండేయ పురాణంలో ఉన్నదా అంటే అదీ లేదు. బహుళాశ్వ చరిత్రకథ భాగవత దశమస్కంధం ఉత్తర భాగంలో ఉన్నది. మార్కండేయ పురాణంలో ఉన్నది మదాలసాకువలాయూశ్వుల కథ. దీనిని ప్రబంధంగా రచించిన కవి సవరము చిన నారాయణ నాయకుడు. ఆ ప్రబంధం పేరు కువలయాశ్వ చరిత్ర.

శంకరకవి హరిశ్చంద్రోపాఖ్యానం కంటె ముందు వెలసింది గౌరన హరిశ్చంద్ర కథ. దీనిని బట్టి శంకరకవి మారన మార్కండేయ పురాణము నుండే దీనిని గ్రహించాడని చెప్పలేము. అల్లసాని పెద్దన—ఆమూలచూడంగా మారన ననుసరించాడు.—(చూడుడు ''పెద్దన మనుచరిత్ర—మార్కండేయ పురాణము'' బులుసు వెంకట రమణయ్యగారి వ్యాసము—కిన్నెర—1955.) ఇందు భావాలేగాక పద్యాలు, యెత్తుగడలు, పదబంధాలు కూడా చూపబడ్డాయి. చిన్నారి పొన్నారి చిరుత కూకటినాడు శ్రీనాథుడు రచించిన మరుత్తరాట్చరిత్ర—మార్కండేయ పురాణంనుండే గ్రహించాడని ఊహించవచ్చును. అతనికృతులలో నొకచోట మారన యనుసరణమున్నది.

మారన సంస్కృత మార్కండేయ పురాణమున చివరి భాగము—అనగా మరుత్తుని పుత్ర పౌత్రుల కథలు తెలుగు చేయలేదు. క్రీ. శ. 870 ప్రాంతమున విజయనగర సంస్థానమున నాస్థాన కవీశ్వరుడైన మండ కామేశ్వరకవి ఈ పురాణాన్ని సంపూర్ణంగా ఆంధ్రీకరించాడు.

మడికి సింగన సకల నీతి సమ్మతంలో మార్కండేయ పురాణంనుండి పద్య ముదాహరించాడన్న సంగతి ఇందులోలేదు.

పుట 233—''మారన మార్కండేయాన్ని తెలిగించడానికి పూనుకునే సమయానికి బసవ పురాణ పండితారాధ్య చరిత్రవంటి సమకాలిక చరిత్రలు పుట్టాయి.''

ఈ గ్రంథంలోనే సోమనాథుని కాలం భిన్న రీతులుగా ఉండి, నిర్ణయం కానప్పుడు అతని కృతులు మార్కండేయ పురాణానువాద సమయానికి ఎట్లు సమకాలికములు?

పుట 238—నాగయ గన్నని చిత్రకథకు ఆకరము లేదు.

పుట 234 ''మార్కండేయాన్ని 2547 గద్య పద్యాలుగా అనువదించాడు.'' మార్కండేయంలో ఉన్నది 2214 గద్య పద్యాలు.

చిమ్మపూడి అమరేశ్వరుడు: అమరేశ్వరుని పురవర్ణనా నైపుణ్యాన్ని గూర్చి ఈ క్రింది పద్యం 107 వ పుటలో ఉదాహృతమైంది.

''కొలదికి మీర బెద్దయగు
కోట తనర్చున వస్తుసంతతో
జ్జ్వలతర సత్ప్రభాత రవి
చంద్రరుచుల్ సొరనేరకున్న సం
ధ్యలు దివసత్రియామములు
దత్పురి పౌరజనం బెరుంగ ద
మ్మలము జవిన్ విహంగ గతి
పూవుల తావి రతిప్రసంగతిన్''

పద్య భావ వివరణ పది పంక్తుల్లో 107—108 పుటలో ఉన్నది. ఈ పద్యం—అమరేశ్వరునిదే అని గ్రంథకర్త స్పష్టంగా—"అమరేశ్వరుడు చమత్కరించాడు" అని చెప్పడంచేతనే తెలుస్తున్నది. కాని యిది అమరేశ్వరుని దెంతమాత్రమూ కాదు. ఇది నన్నెచోడుని కుమార సంభవములోనిది. (చూ. 7 ఆ. 105 పద్యము.) అందలి పాఠము పైనున్నట్లే యున్నది. ఈపద్యము కుమార సంభవ ముద్రిత ప్రతులన్నింటియందేకాక, వ్రాత ప్రతిలో కూడా ఉన్నది. (వ్రాత ప్రతి పుట 332.) అందుచేత ఈ పద్య మెంత మాత్రమును విక్రమసేనములోనిది కాదు.

ఇట్లే 115 వ పుటలో ఈ క్రింది పద్య మున్నది.

"తరుణుండగు శీతల కరు
మరగి వియలక్ష్మి తన్ను మాని ముదుకడున్
ఖరకరుడును నని ద్రొబ్బిన
కరణిన్ రవి పశ్చిమాద్రి కడ గ్రుంకె నృపా"

పద్యం క్రింద "ఈ వర్ణన కథలోని వ్యంగాన్ని సూచిస్తున్నదేమో మనకు తెలియదు" అనే వాక్య మున్నది.

ఈ పద్యం కూడా అమరేశ్వరుని విక్రమసేనములోని దెంతమాత్రమూ కాదు. ఇది పోతన భాగవతము దశమస్కంధం పూర్వభాగములో 1288 వ పద్యం.

ఇంతేకాదు—పుట 129 లో;

"భూమి నిండె మింట బూర్ణమై కర్కట
మకర మీనరాశి మహితమైన
హరి యశస్సుధాబ్ధి యందురుల తుంపురు
లన్నగ జుక్క లొప్పె నాకసమున"

ఈ పద్యము కూడా అమరేశ్వరునిదే యని భావించినట్లుగా ఆ పుటలోనే "అమరేశ్వరు డిలా చమత్కరిస్తున్నాడు" అనే వాక్యంవల్ల తెలుస్తుంది.

కాని ఈ పద్యమును భాగవతములోనిదే. పైని ఉదాహరించిన 1288 వ పద్యము తరువాత రెండు పద్యములైన వెనుక ఈ పద్యమున్నది.

విక్రమ సేనములో పద్యాలు 54 అని 101, 103, 127 పుటల్లో కనబడుతుంది. విషయ సూచికలో పై మూడు పద్యాలు ఉన్నాయి. అందులో పద్య సంఖ్య 57. అయితే విక్రమ సేనములో పద్యాలెన్ని దొరికినట్లు? విక్రమ సేనములోనివి కావని పుట 110 లో చెప్పిన "పాడవుగ నెల్లయంగళులు" 116 పుటలో "ఉదయ రాగ మించించుక" అన్న పద్యాలు విషయ సూచికలో తిరిగి చేర్చబడడం దురూహ్యంగా ఉంది. విక్రమసేనముతోని విషయ విభాగ మింతకుముందే ఆంధ్ర వాఙ్మయ చరిత్ర సర్వస్వములో కనబడుతుంది. ఇందు క్రొత్త ఏమియులేదు.

స్థాలీపులాకన్యాయంగా కొన్నే ఉదాహరించాను. ఇదివరకే అచ్చులో అందరికీ అందుబాటులో ఉండే విషయాలను విమర్శించకుండా, యథాతథంగా వీనిలో గ్రహించడము జరిగింది. ఆ హేతువుచేత దీనిలో అనవసరమైన సెంపకము చాలా ఉన్నది. ముందు సంపుటాల్లోని విషయాలు తరువాత చూచుకోకపోవడముచేత, వ్రాసినవే తిరిగి వ్రాయడం సంభవించింది. ఇంకా లోతుగా పరిశీలిస్తే ఈ 759 పుటలులోని సాహిత్య చరిత్ర 250 లేక 300 పుటలలో సంస్కారులకు, సామాన్య ప్రజానీకానికి అనుగుణమైన రీతిగా సంగ్రహింపవచ్చును.

ప్రజా సామాన్యంకోసమైనా—సాహిత్య చరితలో "నన్నయ గారడీ రచన" "నన్నెచోడుని గమ్మత్తు" "పండితారాధ్యుల మొండి భక్తి" వంటి వాక్యాలు పరిహరణీయాలు.

రాబోవు సంపుటాల్లో అయినా, తమ ఆశయాలు నెరవేరేటట్లుగా ప్రకటన కర్తలు ప్రయత్నించడం భావ్యం.

మౌలికమైన పరిశ్రమ తగ్గి, క్రోడీకరణ విధానం విపరీతంగా పెచ్చు పెరిగిపోయిన తెలుగు సాహిత్య ప్రపంచంలో సప్రమాణము, సర్వజనీనము, సర్వతోముఖమునైన సాహిత్య చరిత్ర అవతరించుట కనకాశాలున్నవన్న సంగతి ఆంధ్రవిద్వల్లోకము గుర్తించునుగాక!

—నిడుదవోలు వేంకటరావు.

Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna at The Andhra Patrika Press 6 & 7, Thambu Chetty Street, Madras-1
Editor: S. Sambhu Prasad.